౧. శ్రీతులసీవన శ్రీవీక్షణము తులా
   పురుషదానసమగ్రపుణ్యమొసఁగు
శ్రీతులసీప్రదక్షిణ మశ్వమేధాధ్వ
   రానేకఫలమిచ్చు నతిశయముగ
శ్రీతులసీతీర్థసేవ గంగాతీర్థ
   శతగుణంబులనిచ్చు సంతతంబు
శ్రీతులసీదళాంచితధారణము నిఖి
   లావనీదత్తసౌఖ్యంబు సేయు
తులసీపూసలజపమాలికలజపంబు
లొకటికోటిమణుంగులై యొసరుచుండుఁ
దులసికిని ముగ్గువెట్టిన జలజముఖుల
కిందిరాదేవి సామీప్యమందఁగలుగు.

—ప్రౌఢకవి మల్లన్న.

గృహలక్ష్మి చందాదారురాంద్రు తమ చందానెంబరు, పూర్తిచిరునామా తెలుపుచు లేఖ వ్రాయుచో వారికి కే.యన్. కేసరిగారు వ్రాసిన 'తులసి' యను గ్రంథము ఉచితముగాపంపబడును.

# రవీంద్రుడు

బొడ్డు బాపిరాజుగారు

౧

అతఁడు కవిరాజు. భావవిహాయసమున
కల్పనాసౌధముల నీజగమ్ముతోడి
యంటునెఱుగక స్వేచ్ఛావిహారియగుచు
నిర్వికల్పసుఖానందనియతినుండు.

౨

తూరుపుకొండనెత్తములతోయదపంక్తినలంకరించు సం
ధ్యారమణీమణీయమృతహస్తములన్ గనువిప్పులొాచు, శృం
గారరసోదయమ్ములగు కమ్మనిపూవులతావితో మనో
హారములైన మందమలయానిలసామ్యము లాకవిత్వముల్.

౩

ఆతనిహస్తచాలనము లక్షయదివ్యకళావిలాసముల్
పూతలుపూసె; ఆతనియపూర్వగభీరదృగంచలమ్ములన్
ద్యోతకముల్ ప్రశాంతసరసోర్మికలు; ఆతనివాణి విశ్వసా
భ్రాత్రముజాలువారు; అతఁడువాఙ్మయసేవకు డెల్లవేళలన్.

౪

ప్రకృతిశోభారహస్యముల్ ప్రతిఫలించు
కావ్యములనల్లి ప్రత్యూషఃకాలములను
మధురగళమెత్తిపాడి తన్మయతజెందు
లలితసంగీతసాహిత్యకలితుడతఁడు.

౫

సరసిజబాంధవుండు కరసంతతి తోయములగ్రహించు; ని
ర్జరవిభుశబ్దముల్ బనిచి చయ్యనవృష్టినొసంగు; సృష్టిలో
వరలురహస్యవృత్తములు భావమునంగ్రహియించి నిచ్చలున్
గురియుకవిత్వవృష్టుల, ఘనుండు రవీంద్రులకన్న మిన్నయై.




## అఖిలభారతమహిళాసభ

ఆంధ్రమహిళాసభకు రాజమండ్రికాంతలును, భారతమహిళాసభకు మద్రాసుమహిళలును తమ ప్రజ్ఞాప్రాభవములచే కళాకాంతులు గూర్చుచున్నారు. కళాకాంతులుగూర్చు మహిళల నెలవగుమద్రాసునందు డిసెంబరు కడపటివారమున ఆరవఅఖిలభారతమహిళాసభ జరిగినది. జయప్రదముగజరిగినదని ప్రత్యేకము చెప్పవలసిన పనియేమి?

శ్రీమతి నాజిర్‌హుస్సేనుసతి ఆహ్వానసంఘాధ్యక్షురాలు. ఆమె ప్రారంభోపన్యాసము ఆమెయొక్క ప్రతిభాప్రాగల్భ్యములకు ప్రదర్శనసీమయైయున్నది. సంఘవైషమ్యముల, జాతిద్వేషములనాశనమును ఆమె ఆశించినది. పురుషులలో పెచ్చురేగినకులకక్షల, మతవిభేదముల నిర్మూలనముచేయుటకు స్త్రీలుపూనవలయునని ఆమె హెచ్చరించినది. "ప్రియ సోదరీమణులారా! సుందరవస్త్రక్రయమునకు మీరు సిద్ధపడునపుడెల్ల ఈదేశమున తమ సోదరీమణులు వేలకొలది గుప్పెడుగంజి, మూరెడుబట్టలేక అల్లాడుచున్నారను సంగతిని జ్ఞప్తికెలయించుకొనుడు" అని ఆమె స్వదేశీమంత్రజపమునుగావించినది. స్వదేశీతత్త్వము భారతస్త్రీలయందు బాగుగ పాదుకొనుగాక! సభ ప్రత్యేకముగా విద్యాసాంఘికసభయే యైనను దేశసౌభాగ్యసంపాదనమునకు మూలదుంపయగు స్వదేశీవ్రతదీక్షను సభ్యురాండ్ర కుపదేశించి ఆమె తమఆహ్వానసంఘాధ్యక్షతకు అర్హ్యగౌరవమును సంపాదించినది.

శ్రీమతి పి. కె. రాయిసతిగారు సభాధ్యక్షురాలు. శ్రీగాంధిమహాత్ముని గురుమహాశయులగు గోక్లేగారిపేరిట కలకత్తామహానగరమున ప్రత్యేకముగా బాలికల కొకఉన్నతపాఠశాలను నిర్వహించుచున్న ఈవిద్యాభిమాన ఈవత్సరము మహిళలవిద్యాసాంఘికసభకు అధ్యక్షతవహించుట ఎంతయుసముచితముగనున్నది. 'నిర్బంధోచితప్రాథమికవిద్య, నిర్బంధోచితప్రాథమికవిద్య' అని షష్ఠిఘడియలు పలవరించిన గోక్లేగారిపేరిట నొకవిద్యాలయమునునడుపుచున్న ఈవిద్యావతి తనఉపన్యాసమున హిందూదేశమున అలము

కొనిన సకలదోషములకు ప్రాథమికవిద్యాప్రచారము శాంతి చేకూర్చునని చెప్పుట వింత గాదు. ఈమె ఉపన్యాసముయొక్క సారాంశము 'విద్య, సంస్కరణము' అను రెండుపదములే. మార్పునొందుచున్న ప్రపంచమున ఉచితరీతిని పౌరులుగా వెలయుటకు మనబిడ్డలను తరిఫీదుచేయవలయును. వారిశీలమునుదిద్ది మంచిచాలునబెట్టవలయును. నీతివిద్య, మతవిద్య అలవఱచవలయును. సంస్కరణవిషయమున అంతరానితనము ఎంతశీఘ్రముగ పారద్రోలిన అంతమంచిది, గృహములు ఉత్తమపౌరులను దేశమునకుప్రసాదించు ఆలయములు కావలయును. ఇట్టి మహోత్కృష్టవిషయములను ఉపన్యసించి ఈమె ఈవాక్యములతో ముగించినది: "మనసభకు ఇది ఆరవసమావేశముమాత్రమే. అయినను మనము వ్యష్టిగాను, సమిష్టిగాను వివిధరాష్ట్రములందు ఒనర్చినపని నిరుత్సాహపడవలసినదిగాలేదు. నేటి ఈసమావేశము భారతస్త్రీల ప్రథితభవితవ్యమును ప్రస్ఫుటముచేయుచున్నది."

ఉపన్యాసములిట్లు ఉపాదేయములై యున్నవి. చేయబడినతీర్మానములు చెప్పదగియున్నవి. మహిళాసభ మొదటినుండియు శారదాచట్టమునకు అనుకూలమే. ఈచట్టమునకుకలిగిన ప్రాతికూల్యమంతయు పురుషులనుండియే. ఇప్పటికిగూడ వారిప్రాతికూల్యముయొక్కవడి తగ్గలేదు. ఈచట్టమునకు సవరణలుగొనివచ్చుటకు వారు కనిపెట్టుకునియే యున్నారు. అటిస్థితిలో మహిళాసభవారు మఱల శారదాచట్టమునుగూర్చితీర్మానించుట లెస్సగనున్నది. చేయబడినతీర్మానములందు ముఖ్యముగ పేర్కొనదగినది ఆయుధవిసర్జనమునుగూర్చినది. ఆయుధవిసర్జనముయొక్క ఆవశ్యకతనుగూర్చిన తమఅభిప్రాయమును ఈ సభవారు ఆయుధవిసర్జనసభవారికి పంపుటకు సంకల్పించిరి. అంతరానితనమును అంతమొందింప ఆదేశించుచు శ్రీమతి నీలకాంతకన్యగారు గొనివచ్చినతీర్మానము వివిధకులములకు చెందిన సభికురాండ్రచే ఏకగ్రీవముగా ఆమోదింపబడుట గమనింపదగినవిషయము. జాతిమతభేదములను జార్చివైచి దేశమున ఐకమత్యమునుపెంపొందించెడుగ్రంథములనే విద్యాలయములందు బోధింపవలయునను శ్రీమతి రుస్తుంజీ ఫరూదూంజిగారితీర్మానము ప్రశంసింపదగినది. బాలబాలికలకు నిర్బంధోచితప్రారంభవిద్య, వయోధికలగు వనితలకును విద్యాప్రదానముచేయుటకై ప్రత్యేకసదుపాయములను ఏర్పఱచుట, గ్రామపునర్నిర్మాణమునకు వలయుమేస్త్రీలను తయారుచేయుటకు శిక్షాలయములనెలకొలుపుట, స్త్రీకార్మికులవిషయమున విట్లీవిచారణసంఘమువారు సూచించినమెలుకువలను వెంటనేఆచరణయందుంచుట మొదలగుతీర్మానములు పెక్కుగావింపబడినవి. తీర్మానములుచేయుటతోడనే మహిళాసభవారు తృప్తిపడలేదు. అవి ఆచరణయందుంచుటకు ప్రబోధముపుట్టింప, కార్యారంభము చేయు ఉపసంఘములను నియమించిరి. ఇందునుబట్టి భారతస్త్రీలయందు నేడు ఎసరేగిన కార్యకాంక్ష ఎంతతీవ్రతరముగానున్నదో సులభముగ గ్రహింపవచ్చును. ఈసమావేశమున ఆంధ్రదేశస్త్రీలును విశేషముగ పాల్గొనియుండుట యొకవిశేషము.

శ్రీమతి ఓలేటి నిత్యకల్యాణమ్మగారు

తావకలేఖినీనవసుధాతరణాక్షరదివ్యభావపు
ష్పావళి తేటతేనియలజల్లుల తీయఁదనాలుగ్రోలి యీ
భూవలయంబు మైకమున ముగ్ధతఁదాల్చి సుఖాలయంబునం
దేక్షసియించు సంతతము నెంతటి శక్తియుతుండవో కవీ!
నీలసరఃకృపీటనవనిర్మలదర్పణసీమలో సుధా
లీలల రక్కలన్ బ్రతిఫలించెడు శ్యామనభంబువోలె ప్రే
మాలయమోహనప్రకృతిమంజులదృశ్యచయంబుతోఁ గవీ!
నీలలితంపుడెందముననిల్చి రహించును నాట్యలీలలన్.

లేఁతవేకువ సుధాలీల రసాలపల్లవశయ్య కోయిల లలితగీతి
నరమోడ్పుకనుఁదోయి దరహాసములఁగల్వసకిపంపు ప్రేమవాసనలగముల
నమలప్రణయజీవులౌ సుఖచక్రవాకద్వయంపు సాబంగుకౌఁగిలింత
నలరుపిసాళిచూపులఁ గల్వహృదిఁదెల్పు నెలవంక ప్రేమసందేశవితతి
లలితభావమారుతకిశోరమ్ముతిరుగ నవసుఖానందజీవివై పవలురేలు
ప్రకృతిధామమ్ములో విహారములతోడఁగడపెదవు; ధన్యమూర్తివో కవికుమార!

తావకభావకంఠగళితమ్మగు నాకలోకగీతియొక్కఁ భూ
షైవరకాంతిశోభను దశాశలఁజల్లగ ముగ్ధదేవతా
యావనివోలె భాసిలెడు నాకవితాసఖి ప్రేమవక్షమం
దీవుశయింప నీజగతియెల్లను నీస్మృతి కందనేర్చునా?
నీకవితాభ్రవీథి రమణించెడు మంజులభావతారకా
నీకతుషారదృగ్గళితనిర్మలరోచులలోన నైక్యమై
నాకపుసౌఖ్యసంపద ననారతమున్ హసియించు సత్కవీ!
యీకలుషావనీభయదవీక్ష నినున్ స్పృశియింపనేర్చునా?

కమ్మనితెలిమల్లెకాంతులువిరఁజల్లు కమనీయచంద్రముఖంబుతోడ,
అమృతశోభార్ద్రింబులై మవ్వములునించు నవతారకామండనములతోడ,
పూచినతెలితెల్లు పూలచక్కఁదనంపుచంద్రికామంజులశాటితోడ
జ్యోత్స్నవిభాసురస్ఫూర్తి రక్తినొసంగు తోరంపుతోగికన్నుదోయితోడ
ఈ మనోజ్ఞశరద్రజనీమదవతి పోడిమిహసించి నాట్యవిస్ఫూర్తినలరి
కాంచువారలకన్నులకరవుఁదీర్చు నిత్యము కవీంద్రసంస్తవనీయమగును.

# పిఠాపురము రాణీవారు

ఆంధ్ర శేషగిరి రావుగారు బి.యే.

"వనజాక్షుపదభక్తి ననసూయయనఁగాటచే నఖిలప్రపంచసమాత్మ్యయయ్యె
వనితలంబుధర్మవర్తన నరుంధతియనఁగఁ బరమపాతివ్రత్యమహితయయ్యె
శ్రీసర్వమంగళాకృతిఁ దనర్చుటఁజేసి సత్కుమారోదయస్థానయయ్యె
ననమకుమారూప మంగీకరించుట నధికగోత్రాశ్రయాఖ్యాతయయ్యె
ననుచు వందఱుఁగొనియాడ నతిశయించుఁ
జిరయశో గుణనికురంబ చిన్నమాంబ."

పిఠాపురమురాణీవారి పవిత్రనామము చిన్నమాంబావారు. వితీర్ణిమందారములు, విద్యారసికులు, దాననిరతులు, ధర్మప్రియులుఅయిన రాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావుబహాదురువారికి చిన్నమాంబావారు సర్వవిధముల తగినపత్నులు. రాజావారు తలపెట్టిన సమస్తసదుద్యమములకును ప్రోత్సాహశక్తి రాణీవారేయగుట రజతోత్సవ సందర్భమందలి రాజావారిఉపన్యాసము సువ్యక్తముచేసినది. ఆధునికయుగమున ఆంధ్రస్త్రీల సమగ్రాభివృద్ధికి చేరలకొలది ధనమునువెచ్చించుచున్న శ్రీమహిళలలో రాణీవారు తొలుత పేర్కొనదగినవారు. అగుట వీరిజీవితము మిచట ప్రస్తరింపబడుచున్నది.

'దునియామెనహిరాజాఅప్పారావ్' అని బైరాగులచే నేటికిని ఎల్లయెడల కీర్తింపబడు పేరుగలపద్మనాయకకులమగు అప్పారాయవంశమున వీరు జయసంవత్సర కార్తికశుద్ధదశమీ గురువారమున (1894 నవంబరు 8-వ తేది) అప్పారావుల కాపురపుకాణాచియగు నూజవీటియందు జననమొందిరి. విశిష్టాద్వైతమతసిద్ధాంతములయందు విశేషాభినివేశముగల భక్తాగ్రేసరులును, సంస్కృతాంధ్రములయందు సముచితపాండిత్యముగల సంస్కారహృదయులునుఅగు రాజా వేంకటరంగయ్యప్పారావు బహద్దరువారు ఈరాజ్ఞీమణి పితృదేవులు. మాతృదేవినామము వేంకటనారయ్యమ్మారావువారు. ఈయమ ఈపిఠాపురమురాణీవారినే గాక ఇంకను సర్వలక్షణసంపన్నులగు ముప్పురు రాజపత్నులను; ఉయ్యూరు, గొల్లపల్లి, కపిలేశ్వరపురముజమీందారీలనుపరిపాలించుచున్న ప్రభురత్నములను ప్రసవించిన రాజమాత. పతిదేవతయై ప్రఖ్యాతికీర్తినిగాంచినది. అసామాన్యరాజకార్యధురీణయై విలసిల్లినది. ఇట్టిఉత్తమ మాతాపితలకుఉదయించిన చిన్నమాంబావారు తమ జీవితమును ఉత్తమరీతిని వెలయించుచుండుటలో వింతయేమియునులేదు.

చిన్నమాంబావారిని పరిణయమైననాటనుండియు పిఠాపురమురాజావారికి శుభపరంపరలు. 5-10-1906 తేదీని వారు పీఠికాపురరాజ్యమునకు పట్టాభిషిక్తులైరి. పిఠాపురసంస్థాన పాలకులలో ఇంతకుమున్ను ఎవ్వరునుపొందని మహారాజబిరుదముపొందుట పేరుపొందిన శుభములకన్నిటికిని శిఖరప్రతిష్ఠ. ఈరాజదంపతులకు ఇద్దఱుకొమరులు, నలువురు కొమరితలు. పతివలె రాణీవారును బ్రహ్మమతప్రవిష్టలగుట వీరి దినచర్య దైవప్రార్థనతో ప్రారంభమై

దైవప్రార్థనతో ముగియును. సంపదకుతగిన వైభవము. వైభవమునకుతగిన విశాలహృదయము. అంతర్యము ఉదారముమాత్రమేకాదు కవితారసాస్వాదనముచే మనోహరమును. సంగీతసాహిత్యవినోదమునకుతోడు సత్కథాకాలక్షేపము. రాజ్ఞీత్వము గృహకార్యనిర్వహణమునకు అడ్డురాదు. బహుధర్మకార్యనిర్వహణమునకైన పతిసేవ ప్రాలుమాలరు. అనాథజనోద్ధారిణి యనుచుండ వారి అపత్యరక్షణశిక్షణమును పేర్కొననేల?

చిన్నమాంబావారు విదుషీమణులు. వీరిపితృదేవులు సంస్కృతాంధ్రములందు సముచితపాండిత్యముగలవారుగదా! వీరును సంస్కృతాంధ్రములందు సముచితపాండిత్యముగలవారు. పాండిత్యమునకుతోడు వీరు తెనుగున కవిత్వమునుచెప్పగలవారు. సంస్కృతరామాయణసంగ్రహమును వీరు తెనుగుపద్యములలోనికి అనువదించినారు. వీరివిషయమున నూరుసంవత్సరములకుపూర్వముండిన వనపర్తిసంస్థానపురాణి రాజరత్నమ్మావారిని పోలుచున్నారు. ప్రభ్వీమణులై కవితచెప్పిన ఆంధ్రరమణీమణులు మిక్కిలి తక్కువగానున్నారు. అట్టివారిలో వీరొకరనుటచేతనే రాణీవారిప్రతిభ సులభముగ గ్రహింపనగును.

కల ధనమునకు, జ్ఞానమునకు రాణీవారు ఉచితోపయోగ్యవృత్తి కల్పించుచున్నారు. పీఠికాపురమున పంచమబాలికలకు పాఠశాలనేర్పఱచి అందు ఉచితముగ విద్యాదానము చేయించుచున్నారు. మఱియు వీరు పిఠాపురమున గోషాస్కూలునొకదానిని వెలయించినారు. గృహస్థధర్మముననున్న పౌరకాంతలకందు విద్యాప్రవీణలగు ఉపాధ్యాయినులచే విద్యాప్రదానము గావింపబడును. విశేషమేమన రాణీగారేర్పఱచినబండ్లు ఇంటింటికిపోయి విద్యాకాంక్షగల వనితలను పాఠశాలకుగొనివచ్చును. ఈఏర్పాటు తెలుగుదేశమున మఱియెచ్చటనులేదు. ఆంధ్రస్త్రీజనోద్యమములందు తూర్పుగోదావరిమండలపుస్త్రీలు ముందంజవేయుచుండుటకు ప్రబలకారణములలో నొకటి ఆమండలము ఈరాణీగారివంటి విద్యాప్రదాత్రికి నోచిపుట్టుటయే. ఆర్తులై యరుదెంచు అబలలకు వసతిసౌకర్యముకల్పింప నొకసత్రమును, స్త్రీలరోగనివారణకై ప్రత్యేకమొకఆసుపత్రిని, స్త్రీసంఘమున కొకమందిరమును నిర్మించి నిర్వహించుచు రాణీవారు ఆంధ్రస్త్రీలోకముయొక్క కృతజ్ఞతకు పాత్రులయినారు.

విశాలభారతదేశమునందలి వివిధసంస్థానములలో అనేకవిషయములందు బరోడారాష్ట్రము అగ్రసరమైయుండుటకు ఏతద్రాష్ట్రపరిపాలనమున గైక్వారువారికి మహారాజ్ఞి చిమ్నాబాయిసాహేబావారు తోడుపడుట ఎటుల సహకారియైయున్నదో ఆంధ్రదేశమునందున్న పెక్కుజమీందారీలలో అనేకవిషయములందు పిఠాపురముజమీందారీ అగ్రసరమైయుండుటకు ఆజమీందారీపరిపాలనమున మహారాజావారికి మహారాజ్ఞి చిన్నమాంబావారు తోడుపడుట అటుల సహకారియైయున్నదనవచ్చును.

రాజాగారితో రాణీవారు యూరపుయాత్రగావించివచ్చినారు. విదేశయానమొనరించిన తెలుగుజమీందారిణులు ఇకనెవరైన ఉన్నారేమో తెలియరాదు. బ్రహ్మమతప్రవిష్ట

లగుట రాణీవారు పూర్వాచారమునకు లోఁగలేదు. విదేశయానమొనరించిరి. అపారమగు ప్రాపంచికజ్ఞానమును సముపార్జించిరి.

పుట్టినది జమీందారీకుటుంబమున. మెట్టినది జమీందారీకుటుంబమును. ధనమునకు లోపములేదు. లోపమేలేనిధనము విద్యాధనముచే మఱియు సంపన్నమైనది. దయాధర్మములు వానికి రాణింపుకలిగించినవి. ఆధునికనాగరికతకు అగ్రమగు యూరపుఖండమున యాత్రచేసివచ్చుటచే రాణీవారియందుగలిగిన నూత్నసంస్కారము ఆంధ్రస్త్రీజనాభివృద్ధికి దోహదకారికాగలదు. ప్రభ్వి, విదుషి, దాత్రి, విద్యాప్రదాత్రి, సంస్కర్త్రియై ఆధునికాంధ్రస్త్రీలోకమునకు అలంకారముగనున్న చిన్నమాంబారాణీవారికి నిత్యశుభపరంపరలు నిండారుకాలమును నివ్వటిలునుగాక!

"పరమపాతివ్రత్యగరిమంబునకు నామె తావలంబనుట సాధారణంబు
విద్యావిశేషప్రవీణత్వమున కామె మన్కిపట్టనుట సామాన్యవచన
మక్షీణతరదయాదాక్షిణ్యముల కామె యాశ్రయంబనుట యథార్థవృత్తి
సత్కార్యకరణదక్షాదీక్షితకు నామె యవలంబమనుట యన్వర్థభాష
విపులవినయాభిభూషితప్రవృత్తి కామె
యునికియని చెప్ప టది స్వభావోక్తియనుచు
నమ్మహారాజ్ఞి నెల్లరు నభినుతింప
వినుతికెక్కుచునన్న దవ్విమలచరిత. —రావువంశముక్తావళి.

ఏమహాసాధ్వికృపామహిమంబున నబలల యజ్ఞానమంతరించె
ఏసాధ్వి దేశభాషాసేవఁ జేర్మిమైఁ బచరింపుచుజగతిఁ బ్రణుతిఁగాంచు
ఏసతీతిలకమ్మ భాసురధర్మసత్రమ్ములుగట్టించి రాణమీఱు
ఏదేవియనదల నౌదార్యబుద్ధి నుద్ధరణముంబోవరించి తనరుచుండు
నట్టి పీఠపురీరాజ్యపట్టమహిషి
యైన చిన్నమాంబదేవి కనవరతము
సిరియు సంపద సౌభాగ్యగరిమఁగూర్చి
పరమకృపఁ బరాత్పరుఁడు దానరయుఁగాత! —దా. ల. స్వామి.

సిరికిన్ తావయి, విద్యకున్ నిలయమై, శీలంబుప్రాప్తై, గుణో
త్కరరత్నాలికిఁ బెన్నిధానమయి, సత్కాంతాశిరోభూషయై,
కరుణావృత్తికిఁ దావలంబయి మనోజ్ఞఖ్యాతిఁ జెన్నొందు న
వ్వరమోదారకు సాటిసేయవలదా ప్రాచీనపుణ్యాంగనల్.

సన్నుతనూజవీటికులసాగరసంభవ పీఠికాపురా
ధ్యున్నతపద్మసద్మ పురుషోత్తమసూర్యనృపాలు దేవి యా
పన్నజనావనక్షమ కృపారసపూర్ణకటాక్షవీక్ష యా
చిన్నమరాణి యన్నిటను జిన్నమరాణఁదనర్చు నెన్నఁగాన్." —రావువంశముక్తావళి.

# భక్తవిరహము

నండూరి బంగారయ్యగారు బి.ఏ.

గంగాతరంగిణీసంగీతలోలుఁడౌ పరమేశ్వరుని భవ్యపాదసేవ
నీలాచలక్షేత్రహేలావిహారియౌ శ్రీజగన్నాథుని పూజనంబు
శేషాచలమనోజ్ఞభూషాస్వరూపుఁడౌ శ్రీవేంకటేశ్వరుచింతనంబు
గోదావరీతీర్థపాదారవిందుఁడౌ భద్రాద్రిరాముని ప్రార్థనంబు

1. నన్ను శ్రీమూర్తిదర్శనానందసరసి
నోలలాడించి నాజన్మ నొక్కసారి
దీప్తిమంతంబుగాఁజేయుదినముకొఱకు
వేచియుంటిని కాలమా! వేగపడక,
చాగిమ్రొక్కెద నాకోస మాఁగుమమ్మ.

గోపికాబృందంబు కోరికల్ నెరవేర్చి శ్రీరుక్మిణీకాంత చింతదీర్చి
*రామప్రసాదుని కామితార్థములిచ్చి +కమలకాంతుని పాతకములువ్రచ్చి
శంకరాచార్యుని చరితార్థునొనరించి శ్రీవివేకానందు స్వీకరించి
కాళిదాసుని ధన్యకవితారసముగ్రోలి రామకృష్ణునిమనోరాజ్యమేలి
వెలుఁగు భవదీయమహిమను విన్నకొలఁది
బాలగోపాలదర్శన భాగ్యమిచ్చి
ధన్యునొనరింతువనిపూర్ణధైర్యమబ్బె
నాలసింపకుమమ్మ లోకైకమాత.

రాధామనోహేమరత్నాసనస్థుఁడై యెవ్వాఁడు భక్తులనేలుచుండు
గేయమాధురితోడ కీర్తిదిక్కులనించు జయదేవు డెవని యాస్థానసుకవి
మానాభిమానముల్ కానికల్ గాదెచ్చి గోపిక లెవ్వాని గొలుచుచుండ్రు
అశ్రువర్తికధార లభిషేకమొనరించు ‡చైతన్యు డెవ్వాని చరణపీఠి
నట్టిభువనైకరసికుఁడవైన నీకు
అంకితమొనర్పనెంతు నాయాత్మకావ్య;
మెన్నిసంవత్సరంబులో యేగనైన
కానరాదయ్యె నీదేహకాంతినాకు
చారుతరమూర్తి! గోపాలచక్రవర్తి!

గోపికాచిత్తవీథుల కొల్లగొట్టి కానరాకుండఁబోయిన కటికిదొంగ
విరహిణీశాబకంబుల వేటకాఁడు— ఈవియోగాగ్ని నుండి రక్షించునొక్కొ?—

వాల్మీకికవితాప్రవాహంబులో దేలి స్నానమాడుచునున్న జాడజూచి
త్యాగరాజస్వామిరాగమాధురిలోన తాండవించుచునున్న తావులెంచి
పోతనకవిరాజు పూతపద్యములలో తొంగిచూచుచునున్న త్రోవగాంచి
రామదాసస్వామి రమణీయకీర్తన లాలకించుచునున్న లీల దెలిసి

ఆశ్రితాత్యంతసులభ నిన్నాశ్రయింతు!
‡ కొంటెగోపాలబాలుని వెంటబోక
ఈవియోగాగ్ని నుండి రక్షించుకొరకు.

శ్రీరామచంద్రుని సీతావియోగార్తి కుమ్మలించినధన్యవమ్మ నీవు
గోపన్నహృద్వ్యథ తాపంబునడగింప తల్లడిల్లినయట్టి తల్లివీవు
♦నరసింహదాసుని విరహబాధనుజూచి మరగిదుఃఖించినమాత వీవు
¶శృంఖలాబద్ధుఁడౌ శ్రీప్రకాశాఖ్యుని యాదరించిభరించునంబ వీవు
కన్నులారంగ నాబాధగాంచినావు పరమపావని! గౌతమీ! కరుణఁబూని
తోడితేవమ్మ రాముని దోసిలొగ్గి వేడుకొనుచుంటి సైకతవీథినిలిచి.

కన్నతండ్రిముప్పు గడపనికరినాత్మ డాలి కగ్నినుఱుక నాజ్ఞయిచ్చు
ప్రేమమయుడు నాదు సేమంబునరయునే వెఱ్ఱిపడగనేల వెకలినగుచు?
రామచంద్రమూర్తి ప్రేమంబునిరసించి బాలకృష్ణుతోడ పంతమాడి
శిష్యవత్సలుండు శ్రీరామకృష్ణుండు తరలివచ్చుచున్న దారిదోచె.
శైశవదశలోనె జనకుండుపీడిన ననురాగమొలుకంగ నక్కుజేర్చి
తోడిబంధువులెల్ల త్రోసిరాజనునాడు నీడలోనీడవై తోడునూపి
క్షామదావాగ్నిలో క్రాగిమ్రగ్గెడునాడు ప్రేమామృతవృష్టి వెల్లివిరిసి
దరహాసకాంతిచే కరుణాత్మకంబైన నాజన్మకొక నూత్న తేజమిచ్చి

అప్రయత్నంబుగావచ్చి యాదరించు
సదమలానందమూర్తి! సుస్వాగతంబు!
ఆత్మసామ్రాజ్యదివ్యసింహాసనమున
పట్టభద్రుండవగుము! శ్రీపరమహంస!!

*, † వీరిరువురు దేవీభక్తులు. వీరికీర్తనలు బంగాళాదేశమున ప్రచారమునందున్నవి. వానిని తరచు శ్రీరామకృష్ణపరమహంస పాడుచుండువాడు. ‡ చైతన్యస్వామి కృష్ణవిరహము సహింపలేక కన్నుల నశ్రుధారలు గురియుచు కృష్ణాయని పిలుచుచుండువాడు. బంగాళాదేశమున నతనిని కృష్ణావతారమని యెంచి పూజింతురు. ♦ తూము నరసింహదాసు. భద్రాచలవాసి. శ్రీరామసాక్షాత్కృతిని బొందిన భక్తమణియని ప్రతీతి. ¶ నిష్ఠల ప్రకాశయోగి. "గౌతమివేకనుగొంటిరా" అను కీర్తనచెప్పినవాడు. ఖైదులోనుండగ గోదావరీస్నానమునకువచ్చి పద్మాసనమువైచుకొని గోదావరిమీదకూర్చుండి యథేచ్ఛమున వెడలిపోయిరని వాడుక.

# గుంటూరు మహిళాసభావిశేషములు

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు

ఈసంవత్సరము ఆంధ్రరాష్ట్రీయమహిళాసభకు అధ్యక్షురాలు ఆదిపూడి వసుంధరాదేవి ఎం.ఏ.బి.యస్.సి. గారు. వసుంధరాదేవిగారితండ్రి సోమనాథరావుగారు ఆంధ్రదేశమున పేరొందిన విద్వత్కవులు. సోదః వసుంధరాదేవి తండ్రికితగినతనయ. దీర్ఘమైన ఆమె ప్రారంభోపన్యాసమునందుగాని సభలో నెడనెడ గావించిన ప్రసంగములందుగాని వెదకిచూచిన ఆంగ్లపదముకానరాకుండుట ఆమె ఆంధ్రభాషాభిమానమునకును, ప్రావీణ్యమునకును నిదర్శనమని చెప్పవచ్చును. నాగరికత హెచ్చుమీరిన యీదినములలో సహజమై సరళమై సాత్వికమైన శ్రీవసుంధరాదేవిగారి వేషభాషలు చాలమందికి గుణపాఠముగానున్నది. ప్రతినిధినులను ప్రేక్షకురాండ్రునుగూడ నెన్నిమారులు దెచ్చిపెట్టినను గూడ నెన్నిమారులు సహనముగోల్పోవలసిన పరిస్థితులు దెచ్చిపెట్టినను గూడ ఆమె శాంతమును వీడక విసుగుజెందక చదివినతీర్మానము నేచదివి, చెప్పినవిషయము నేచెప్పి సభవారి మెప్పునుబడసిరి. రెండుదినముల వారిసభానిర్వహణము గమనించినవారికి వారికి కార్యదక్షతయందుగలఱుకు, విషయగ్రహణమునందుగలచుఱుకు బోధపడినది.

గుంటూరు ప్రజాహృదయమును చూఱగొన్న క్రైస్తవసోదరీమణులలో డాక్టరు దానమ్మగారగ్రగణ్యురాలు. దానమ్మగారితండ్రిగారుకూడ మంచికవియని చెప్పుదురు. చక్కనిశైలిలో మిక్కిలి ధారాళముగా వ్రాయబడిన ఆమెయుపన్యాసము ఆంధ్రభాషయందామెకు మంచిసంస్కారముగలదనుటకు తార్కాణగానున్నది. దానమ్మగారు చాలకాలము కుగ్లరుఆసుపత్రియందు వైద్యురాలుగానుండి రోగులవిశ్వాసమునకు ప్రేమకు పాత్రురాలైనది. కాని ప్రజాహితకార్యములలో బాల్గొని ఆమె కార్యకౌశలమును సేవాపరతను లోకమునువెల్లడించుటకు అవకాశముకల్గినదికాదు. సొంతవైద్యాలయమును స్థాపించినతరువాతనే, సభలు చక్కగా జరుపుటకు వారముదినములు తమవైద్యాలయమునుకట్టిపెట్టిరని తెలిసికొన్నచో దానమ్మగారు మహిళాసభను జరుపువిషయమై యెట్టిపట్టుదలతో పనిచేసిరో తెలిసికొనవగును. ప్రతిచిన్నపనియు నిర్ణీతసమయమున సక్రమముగా నడిపించుటయందు దానమ్మగారందెవేసినచేయి. కడలేనిఓరిమి, ఏవిషయమైనను సూచనమాత్రముననే గ్రహింపగల బుద్ధిసూక్ష్మత దానమ్మగారికి పెట్టనిసొమ్ములు. దానమ్మగారు తమ ఆహ్వానసంఘాధ్యక్షోపన్యాసమునందు స్త్రీసంఘమున కుపయుక్తములగు వివిధవిషయములు విశాలభావముతో చర్చించి సభవారి మన్ననకు పాత్రమైరి.

గుంటూరులో చాలమారులు మహిళాసభలుజరిగినవి. ఇతరప్రాంతములనుండిగూడ స్త్రీలువచ్చిరి. కాని వివిధమతములకు, వర్ణములకు, జాతులకుజెందిన పురస్త్రీలెల్ల రొక్కసంఘముగాగూడి మహిళాసభను జయప్రదముగానిర్వహించినదీమారే. చాలమంది ఉన్నతోద్యోగులభార్యలేగాక దొరసానులు, క్రైస్తవసోదరీమణులుగూడ విరివిగా ధనమొసగి ఆహ్వానసంఘములోజేరి సభ నిర్విఘ్నముగా నెరవేరుటకు తోడ్పడిరనినచో గుంటూరుపుర స్త్రీలయందెట్టియుత్సాహము వెల్లివిరిసెనో చెప్పవలయునా? కోటీశ్వరమ్మగారి నిరుపమాన సామర్థ్యము, పద్మాసనమ్మగారి కార్యాసక్తి, సాధువమ్మగారి సంతతకార్యపరాయణత, కల్యాణిబాయిగారి సేవాభిలాష యొక్కచోగుమికూడి సక్రమమైనపనిగను, చక్కనియేర్పాటులుగను రాణించినది. రాయసము రత్నమ్మగారిది కనుపడనిమేధ. మహిళాసభను బందరునుండిఆహ్వానించి కార్యదక్షులైన వీరందరిని యేర్చికూర్చి మహిళాసభ యింతచక్కగాజరుగునట్లు చేసినదేవీరు.

20 తారీఖు సాయంత్రమునకే అన్నియేర్పాటులు పూర్తిఅయినవి. ఆసాయంత్రమునుండియు, రాత్రి అంతయువచ్చు ప్రతిరైలునకును ప్రతినిధులువచ్చుచునేయున్నారు. కార్యసంఘమువారు వారిని ఓపికతో బసకు జేర్చుచునేయున్నారు. 21 తేదీఉదయం ఏడున్నరకు అధ్యక్షురాలువచ్చుటతో ఉత్సాహమైనకార్యక్రమము ఆరంభమైనది. దాదాపు 8½ గంటలకు విషయనిర్ణయసభకూడినది. తొలినాటి సభావిషయము విద్యకు సంబంధించినదగుటచే ఇందు అధికముగా ఉపాధ్యాయినులునున్నగువారే పాల్గొనిరి. ఈవిషయనిర్ణయసభలో విశేషచర్చకుపాలైనవిషయము వైద్యకళాశాలనుగూర్చినది. ఆంధ్రదేశమున స్త్రీలకొకప్రత్యేక వైద్యపాఠశాల కావలయుననునది అసలుతీర్మానము. అది గుంటూరునందు నెలకొల్పవలయుననియు, ఇదివఱకు దొరతనమువారీపురమున మెడికలుస్కూలు స్థాపింపనెంచి నిర్మించినభవనములలో దానిని నెలకొల్పవలయుననియు దానమ్మగారు, పద్మాసనమ్మగారు మున్నగువారు సవరణసూచించినారు. సరి బాగున్నది. అయితే వైద్యమేమిటి అల్లోపతియా, ఆయుర్వేదమాఅనుచర్చ బయలుదేరినది. ఆంగ్లవిద్యనభ్యసించినవారును తదభిమానులును అల్లోపతిఅనిరి. తదితరులు ఆయుర్వేదమనిరి. అదియా ఇదియాయని ఇంత చర్చయేల? ఈరెండువైద్యములను నేర్పెడి స్కూలుఆఫ్ ఇండియన్ మెడిసను ఉన్నది చెన్నపురియందు. అట్టి వైద్యపాఠశాల స్త్రీలకుకోరిన బాగుగానుండునని యొకరుసూచించిరి. ఆంగ్లవైద్యము నేర్చినస్త్రీలు బోలెడుమంది పనిలేక త్రుప్పుపట్టిపోవున్నారు. ఆయుర్వేదము నేర్చినస్త్రీ యొక్కతైనలేదు. కాన అయుర్వేదమునకిప్పుడు వీలులేదు. ఆంగ్లవైద్యమే కావలయునని కొందరు పట్టుపట్టిరి. ఇట్లు వాదోపవాదములైనవెనుక తీర్మానము వోటుకుబెట్టిరి. దొరసానులు, క్రైస్తవసోదరీమణులు, కొందరు హిందూసోదరీమణులు ఆంగ్లవైద్యమునకు చేతులెత్తిరి. 'ఉద్ధతులమధ్య మెదలకుండతరమే'అని ఆయుర్వేదము చల్లగాజారిపోయినది. ఈవైద్యవిషయకచర్చ అనవసరమైనదైనను చాల కాలముక్రమించినది. తరువాత ప్రాథమికపాఠశాలలలో బాలబాలికలనుకలిపి చదివించవలెననియు, ఇట్టిపాఠశాలలకు స్త్రీలే ఉపాధ్యాయినులుగానుండదగుననియు నొకతీర్మానము వచ్చినది. ఈతీర్మానము నుపపాదిస్తూ భాస్కరమ్మగారు చక్కని ప్రసంగముగావించిరి. స్త్రీలు ఉద్యోగముచేయుట గౌరవప్రదముగా భావించి విరివిగా ఉద్యోగములందు చేరవలయుననియు నొకతీర్మానముదెచ్చిరి. ప్రతి ముఖ్యపట్టణమునందొకఉన్నత పాఠశాలను స్థాపింపవలెననియు, ఆంధ్రదేశమునందు స్త్రీలకొకప్రత్యేకకళాశాలను స్థాపింపవలయుననియు నొకతీర్మానముదెచ్చిరి. ఈతీర్మానముకు విషయనిర్ణయసభలో నెక్కువచర్చలేక నెగ్గినను, మహాసభలో అట్లూరి వేంకటసీతమ్మగారు దీనిని మిక్కిలి తీవ్రముగా నెదిరించిరి. కాని తీర్మానము యథారూపమున నెగ్గినది. తరువాత లలితకళలనుగూర్చినతీర్మానము నెగ్గినది. చిట్టచివర దేశీయపరిశ్రమలనుగూర్చినతీర్మానము విషయనిర్ణయసభలో చాలసేపు వాగ్వాదములకెడమిచ్చినది. దేశీయపరిశ్రమలనుటకుబదులు దేశీయవస్తువస్త్రములని స్పష్టముగా వివరించవలయునని ఉన్నవ లక్ష్మీబాయమ్మగారిపట్టు, పరిశ్రమలనినప్పుడన్నియు దానిలో చేరినట్లేగదాఅని ఎదిరిపక్షమువారి జవాబు. చేర్చితేనేమిఅనివారు, చేర్చకపోతేనేమి అనివీరు. ఇట్లు వాదము సాగినవెనుక 'వస్త్ర'అను పదముచేర్చబడియేతీర్మానము ఆమోదింపబడినది. ఉభయభాషాప్రవీణలో తెలుగు ప్రాధాన్యముగల బి. భాగమును ఆంధ్రయూనివర్సిటీవారు తీసివేయ నుద్దేశించినట్లు ఆపరీక్షలో నుత్తీర్ణలైనవారును, చదువుచున్నవారును నగుస్త్రీలు చాలమందివచ్చి మొఱపెట్టుకొనిరి. పైపరీక్షలకు 25 యేండ్లలోపువారు హాజరుకాగూడదనునియమము చాల ప్రతిబంధకముగానున్నదనియు 25 వత్సరములుమించినవారికి సర్కారువారు ఉద్యోగమీయరు, 25 ఏళ్ళకు మించినగాని ఈపరీక్షకురాగూడదు, ఈపరీక్షలో ప్యాసై సర్కారుస్కూళ్లలో పనిచేయనెంచువారికి ఇదియెట్లుపొసగును? అందును స్త్రీలవిషయమున నిట్టివయోనిర్ణయము మఱింత బాధకరమనియు కొందఱుచెప్పిరి. కాని యీవిషయము సభవారికంతగా పట్టినట్లులేదు. సం-

స్కృతమునకు ప్రాముఖ్యమీయవలయునని వేరొక రొకతీర్మానము దెచ్చిరి. దానినసలేమాచూడలేదు. ఉన్నత పాఠశాలలలో దేశభాషలలో విద్యగఱపవలయునను తీర్మానముగూడ సున్నపడినది. వీనినన్నిటినిగలిపి యొక తీర్మానము చేయవలయునని తీర్మానించిరిగాని ఈతీర్మానమునందు అందలిఉద్దేశములకు అనుకూలమైన వాక్యములుపడలేదు. జాతీయవిద్యాసంస్థలకు బాలికలనంపియు, అర్థసహాయముచేసియు పోషింపవలెనను తీర్మానము కాలాతీతమైనదని త్రోసివేయబడినది. దేశమునకును, దేశభాషలకును సంబంధించినతీర్మానములు ఈవిధముగాత్రోసివేయబడి సభవారిచిత్తము కళాశాలలపై మోహముచూపుటచే చాలమంది ప్రతినిధులహృదయములలో అసంతృప్తియేర్పడినది. రాజకీయములతో నీసభకు జోక్యములేకపోవచ్చునుగాని దేశభాషయెడలను జాతీయవిద్యాసంస్థలయెడను వైముఖ్యమువహించుట కారణముకానరాదు. విచక్షణతలేక తీర్మానములన్నియు నిరాకరింపబడుటచే అంతకంటె విచక్షణారహితముగ ప్రతినిధులుతీర్మానములు రొదిరింపదొరకొనిరి. కాన తొలినాటి కార్యక్రమమంతయు ఒకగోలక్రింద జరిగిపోయినది.

ఈసంవత్సరము పెద్దాడ కామేశ్వరమ్మగారు రాకపోవుట సభకు అందముతగ్గినది. ముఖ్యముగా దేశభాషలకును, జాతీయవిద్యాసంస్థలకును సంబంధించినతీర్మానములు తిరస్కృతములగుటతో ప్రతినిధులందరి మనస్సు లామెపైపోయి వాలినవి. అన్నిపక్షములవారికిని సమ్మతముగురీతిని ఉచితముగుపదములతో మంచి తీర్మానాలు తయారుచేసేవారు ఆరాజమండ్రీముసద్దీలు. వారిలో కామేశ్వరమ్మగారు రాలేదు. భాస్కరమ్మగారువచ్చియు చేయిచేసుకోలేదు. ఆనాటితీర్మానాలు గజిబిజిఅయిపోవుట కిదిగూడ కారణమే.

ఒక్కసంవత్సరముపైనుంచి గృహలక్ష్మిపత్రికలోపడుచున్నవ్యాసములు, బందరు మహిళాసభలో జరిగిన తీవ్రచర్చలు గుంటూరు మహిళాసభలో విడాకులతీర్మానంవచ్చి తీరుతుందనుకున్నారు. మొత్తము మీద ఆంధ్రదేశమంతటను ఈవిడాకులతీర్మానం పెద్దతెక్కలికి కారణముగానున్నను ముఖ్యముగా గుంటూరు పౌరులలో గొప్పఆందోళనకు కారణమైనదీవిషయము. తమసాధ్వీధర్మానికి గొప్పఅపాంతరవచ్చిందని కంపిల్లిపోయినారుస్త్రీలు. తాము చాలకాలమునుండి స్త్రీలను భద్రపఱచుచువచ్చిన సాంఘికకట్టుబాటులనెడి ఉక్కుపంజరము ముక్కలుముక్కలుగా విరిగిపోయేసమయం వచ్చినదనుకున్నారు పురుషులు. సభసమీపించినకొలది యింటింట ఈవిషయకమైనచర్చలు బయలుదేరినాయి. కొందఱటువంటిసభలకు ధనసహాయము నిరాకరించారు. కొంతమంది సూక్ష్మబుద్ధిగలవారు సభకుబోయిన తమభార్యలు యింటికివస్తారో రారోఅని భయపడి ఇళ్లలో భద్రపఱచుకొన్నారు. మొత్తముమీద స్త్రీపురుషులహృదయములలో అతిభయంకరమైన ఆందోళనరేపినది విడాకులతీర్మానము. ఈవిధముగా విడాకులవిషయము అందఱిని కలవరపెట్టియుండుటచేత మఱునాటిసాంఘికసభపైనిలిచినవి అందఱిచిత్తములు.

**22-11-31** ఆదివారముఉదయము దాదాపు 8 గంటలకు విషయనిర్ణయసభకూడినది. శారదాచట్టమునకు సవరణ పనికిరాదనునది ప్రథమతీర్మానము. దీనినిగూర్చి ప్రసంగించుటకు ఎందఱో కుతూహలము జూపిరి. వివాహవయస్సుతగ్గించరాదని ఆనాటిసభలో స్త్రీలుప్రసంగించినవిధము చూచినవారికి శారదాచట్టమునకు స్త్రీలు యెంతఅనుకూలముగానున్నది బోధపడినది. విషయనిర్ణయసభలోను మధ్యాహ్నము పెద్దసభలోను వివాదాస్పదమైనవిషయము వారసత్వములనుగూర్చి. 'స్త్రీలకు పుట్టినింట వారిఆస్తిలోను అత్తవారిఆస్తిలోనుగూడ భాగములేకపోవడము కేవలము అన్యాయముగనుక ఈఉభయకుటుంబములలో స్త్రీలకు భాగము పొందే హక్కుఉండవలయుననేది తీర్మానవిషయము.' ఈతీర్మానము ఉపపాదించుచు శ్రీమతి రాయసము రత్నమ్మగారు మనసుకరిగేఉపన్యాసమిచ్చారు. స్త్రీలు ఆస్తినిపొందే హక్కులేకపోవడముచేత గొప్ప సంస్థానాధిపతులపత్నులకుగూడ దాయాదులవద్ద భరణములపొందుదురవస్థ యేవిధముగాపట్టినదియు ఉదా

కారణములతో శ్రీ రత్నమ్మగారు వివరించినప్పుడు అందరికన్నులు చెమ్మగిల్లినవి. భార్యఆస్తికి భర్త హక్కుదారుడైనప్పుడు భర్తఆస్తికి భార్య హక్కుదారురాలు ఏలకాగూడదని ప్రశ్నించినది. భర్తృవియోగ వ్యథాక్లేశములన్నియు స్త్రీకిని, ఆస్తి దాయాదికినా? ఈఅన్యాయము సహింపరానిదన్నది. ఈతీర్మానమునకు వి. పద్మాసనమ్మ, డి. కమలరత్నమ్మ, జి. రంగనాయకమ్మ, శ్రీం. లక్ష్మీనరసమ్మ, వ. వెంకటసుబ్బమ్మ మున్నగువారెందరో అనుకూలముగామాట్లాడినారు. ఇక దీనికి వ్యతిరేకులుండరనుకొనుచుండగా ధైర్యసాహసములతో ఎదిరించినారు గోళ్లమూడి రాజ్యలక్ష్మమ్మగారు. ఉభయకుటుంబములలో స్త్రీ ఆస్తి కోరడమన్యాయమనీ ఇందువలన స్త్రీకి రెండుభాగములైతే పురుషుడి కొకేభాగమగుననీ కాబట్టి యీతీర్మానం నెగ్గరాదని ఈమెవాదన. మధ్యాహ్నముసభలోగూడ ఈతీర్మానము గొప్పచర్చకు కారణమైనది. మహాసభలో గోళ్లమూడి రాజ్యలక్ష్మమ్మగారి వ్యతిరేకవాదనను బలపరిచినారు చీమకుర్తి సత్యవతమ్మగారు. నల్గురు కూతుళ్లుండి ఆనల్గురు నాల్గుభాగములుతీసుకొని అత్తవారిండ్లకేగినచో ఇక నాతల్లిదండ్రులగతేమన్నది ఆమె. కూతురికిభాగమిస్తే కోడలు తెస్తుందనీ, కుమార్తెలభాగములపంపకము తలిదండ్రుల అనంతర మేజరుగును గాన భయములేదనీ మగవానికి సొంతసంపాదనగూడకలదుగాన ఆస్తికెప్పుడును స్త్రీకి తీసిపోదనీ అనుకూలురు సమాధానమిచ్చారు. మహాసభలో ఈతీర్మానము రెండుమాఱులు వోటుకుబెట్టగా రెండుమాఱులు గెలిచినది. ఆస్తికావలయుననెడి యీతీర్మానమునకు మహాసభలోనివారందఱొక్కమాటుగా చేతులెత్తినపుడు ఆస్తివిషయములో స్త్రీలు ఎంత ఆతురతగానున్నదియు విదితమైనది. పునర్వివాహేచ్ఛగల బాలవితంతువులకు సంరక్షకులే వివాహము చేయవలయుననునది నాల్గవతీర్మానము. విషయనిర్ణయసభలో ఈతీర్మానము యెట్టివివాదము లేకయే అంగీకరింపబడినది. మహాసభలో దీని నుపపాదించుచు అదుర్తి భాస్కరమ్మగారు విపులమైనప్రసంగము చేసినారు. క. వరలక్ష్మమ్మగారు బలపఱచినారు. దువ్వూరి సుబ్బమ్మగారు దీనినియెదిరిస్తూ ఇష్టమైన విధవలు యెట్లాగో చేసుకుంటూఉండగా వీరికి సంరక్షకులుగూడ ఏల సాయముచేయవలెనన్నది. నేడు బాలవితంతువులు పెండ్లిళ్లుకోరితే రేపు వృద్ధవితంతువులు కోరవచ్చుననీ, పవిత్రమైన భారతదేశానికిది కళంకప్రాయమనీ చెప్పినది. దీనిపై అధ్యక్షురాలు సమాధానము చెప్పుచు ఈతీర్మానములో బాలవితంతువుల ప్రస్తావనే కలదుకాని వృద్ధవితంతువులమాటలేదు కాబట్టి సుబ్బమ్మగారిఆక్షేపణ చెల్లదనిచెప్పి అసలుతీర్మానము గెలిచినట్లుగా తీర్మానించినది.

అయిదోతీర్మానము సంసారమునందుండ యిచ్ఛలేని స్త్రీలు సన్యాసము పుచ్చుకొని హితోపదేశములు చేయుచు దేశసేవచేయవలయునని. దీనిని విషయనిర్ణయసభలో ప్రతిపాదించినది గంగాభాగీరథీ సమానురాలగు ఇప్పగుంట వెంకమాంబగారు. విషయాని కిది విడాకులతీర్మానమునకు చెల్లెలుగానున్నను హితోపదేశంబగైరా హీనపదప్రయోగములవల్ల ఎవరియెదిరింపులు లేక దాటినది. సంసారేచ్ఛ లేకపోతే సన్యాసమునకు సర్వముక్త్యారునామాయిచ్చినట్లేగదా? ఇక ఈతీర్మానమెందుకని చాలమంది లోలోన గుసగుసలాడినారు. కాని యెవరు బల్లమీదెక్కి యెదిరించలేదు. కాని ఉదయము విషయనిర్ణయసభలో దీని నుపపాదించిన వెంకమాంబగారు మధ్యాహ్నము మహాసభకు హాజరుకానందున ఉపపాదకులు ఆమోదకులు లేక రద్దుఅయినది. తరువాత నొకతీర్మానమువచ్చినది. ఇది పురుషులు భార్యఉండగా మరల పెండ్లాడడం అక్రమంకాబట్టి వీరికీఅర్హత తొలగవలయుననేది. విషయనిర్ణయసభలో రసవంతమైనపట్టులలో కెల్లను రసవంతమైనపట్టిది. కట్నముబాగా ముట్టలేదనీ, భార్య చక్కనిదికాదనీ, సంతానంలేదనీ, ఆరోగ్యవతికాదనీ ఎన్నెన్నికారణములచేత ఎచ్చకెచ్చట ఎంతమందిపురుషులు ఎంత దౌర్జన్యంగా నిష్కారుణంగా నిరంకుశంగా భార్యఉండగా పెండ్లాడినదీ యేకరువుపెట్టినారు మావాళ్ళిచ్చట. ఇట్లులేకపోయినా తీవ్రపదప్రయోగంచేత కసితీర్చుకున్నారు. కండ్లారా



మద్రాసు సేవాసదనము: ధాత్రీవిద్య నందుచున్నవారు

(మద్రాసు రాయపేటఆసుపత్రియందు నర్సులుగ తరిబీతునొందుచున్నారు)



ఒక కుక్క మఱియొక కుక్కయొక్క ఫోటో తీయుట

చూచినసంగతులు స్వయంగా అనుభవించిన సంగతులుఅంటూ ఎన్నో జీవితచరిత్రలువినిపించారు. ఈపురుషులు స్త్రీలను హింసించినపాపమునకు పరిహారము వారికి బహుభార్యాత్వము తొలగించడమే అన్నారు. తుదకు ఈతీర్మానముమీద మాట్లాడుచు శ్రీఉన్నవ లక్ష్మీబాయమ్మగారు సనాతనధర్మపరాయణులై స్త్రీల యభివృద్ధి సుతరాముపలదని అతితీవ్రముగా పోరాడుచున్న శ్రీకనుపర్తి మార్కండేయశర్మగారు పెండ్లాముమీద పెండ్లిచేసికొనినవారేననియు, వారిద్వితీయకళత్రము యిటీవలనే కీర్తిశేషురాలైనది కాని, వారి ప్రథమపత్ని యిప్పటికిని జీవితయైయున్నదనియే జ్ఞాపకమనియు చెప్పినారు. అయితే ఆమెను మరల స్వీకరించమని శర్మగారికి సూచనజేయుట మంచిదనివారు పేరొకరు. ఈవిధముగాచర్చలు చేసిచేసి తీర్మానము దృఢపడిచే సమయములో డి. కమలరత్నమ్మగారు స్టేజీయెక్కి విడాకులతీర్మానంరీత్యా స్త్రీలకు పునర్వివాహంకోరుచు పురుషులకు అనాదినుండీయున్న పునర్వివాహాధికారము తొలగించడమేమిటి? ఉంటేయిద్దరికీ ఉండవలెను లేకపోతేలేదు, కాని ఇదేమిటన్నది?ఆమెవేసినప్రశ్న యెవరికెంత అర్థమైనదో దైవమునకెఱుక. సరే, అట్లాయితే అదీఒద్దు ఇదీఒద్దు త్రోసేయండంటే త్రోసేయండన్నారు. సరి. పురుషుల బహుభార్యత్వంతొలగాలనే యీతీర్మానం విడాకులతీర్మానాన్నికూడా తనతో పెనవేసుకొని త్రాడుతెగినబొంగవలె గభాలున పాతాళానికి పడిపోయింది. పురుషులకు బహుభార్యాత్వము తొలగడము అసమంజసమైతే దానినే స్వతంత్రముగా ఎదిరించవచ్చును. ఓడించవచ్చును. కాని విడాకులతీర్మానమునకు దీనికి సంబంధమేమిటో, బహుభార్యాత్వతీర్మానంమానితే విడాకులతీర్మానం వదులుకొనేపరతుతో దీనిని విరమించడమునకు కమలరత్నమ్మగారు యెట్లు ఒప్పుకొన్నారో తెలియదు. మొత్తముమీద రెండు తీర్మానములు వదులుకొనుటచేత పురుషుల బహుభార్యాత్వమును స్థిరపఱచి స్త్రీలవిడాకుల తీర్మానమును దృఢముగారద్దుపఱచుకొనినవారైనారు సభవారు. విడాకులతీర్మానమనేది ఒకవిషసర్పమనీ, అది స్త్రీల పతివ్రతాత్వమునకు కాటువేసి కాలుష్యమొనర్చవలయునని సిద్ధముగానున్నదనీ, కాబట్టి యిదితలయెత్తితే చితుకగొట్టుదామని కూర్చున్నవారికీ; ఆతీర్మానము తమకు యిష్టములేకపోయినను ఆవిషసర్పముయొక్కనృత్యము కండ్లార చూడవలెనని కుతూహలముపెట్టుకొన్న వారికీ ఆశాభంగంకలిగింది. నిజము విచారించితే ఈవిడాకులతీర్మానమునుగురించి ప్రజలింత భయపడవలసిన అవసరము కనుపించదు. అన్యోన్యతగల సతీపతులను ఏచట్టముగానివిడదీయలేదు. పొత్తుకుదురని ఆలుమగలను విహాంఘికమైనకట్టుబాటులుగాని కలిపియుంచలేవు. కాని ఈవిషయము గొప్ప పత్రికాధిపతులకే అర్థముగాక అడావిడి చేసినప్పుడు సామాన్యజనులు అడలుకున్నారంటే ఆశ్చర్యమేమున్నది? శారదాచట్టం రాబోవుచున్నదని మనదేశములో పసిపాపలందరికీ వివాహములుచేసినప్పుడు శూద్రులుకూడా తొందరపడి పెండ్లిచేస్తూఉండగా మీరుకూడా ఎందుకుచేస్తున్నారని యెవరైనాఅడిగితే సంవత్సరాది వెళ్ళినతరువాత ఇక పెండ్లిండ్లు లేవంటగా అన్నారు. ఇక పెండ్లిండ్లుచేసుకోరాదని అప్పుడే ముడిపెట్టుకున్నారు. ఆఅవ్యక్తులు అటులనే ఈవిడాకుల తీర్మానంవస్తే ఇక ఆడవాళ్ళు మొగుళ్ళదగ్గిర ఉండవలసినపనిలేదటగా, ఎవరియిష్టమువచ్చినట్లు వారుండవచ్చునటగా, ఓయిబాబో ఇదేమిసభలు, ఇవేమితీర్మానాలు అని అందఱిహృదయములో ఏర్పడిన ఈఅపోహ విడాకులతీర్మానంయొక్క నిజోద్దేశమును కప్పిపుచ్చి దానికితుడువరాని మాలిన్యమును కలుగజేసింది. ఈచర్చలు, ఈవివాదము, ఈవిపరీతఆందోళనలు చూచినకొలది ఈచట్టము లేకపోవడమే స్త్రీలకు అప్రతిష్ఠగానున్నట్లు తోచుచున్నది. చాలమంది స్త్రీపురుషులు నేడు విడాకులతీర్మానమునుగూర్చి చర్చించునప్పుడు ఇన్ని కట్టుబాట్లు యిన్నినిర్బంధములు పెట్టి హింసిస్తూఉండిననే మీరిట్లు పెచ్చరిల్లిపోతున్నారు, మీకింకా ఇదికూడవస్తే యింట్లో నిలుస్తారా?అంటున్నారు. అయితే ఈకట్టుబాట్లైనా స్త్రీలను మంచివారినిగా ఉంచుచున్నవి? స్త్రీలకు ప్రత్యేకముగా యోగ్యతగాని, పరువుమర్యాదలుగాని, శీలసంపదగాని లేదా? కాబట్టి విడాకుల

చట్టము చేసిచూడుడు. మాలోనేమైన అయోగ్యతకనుపడునేమో అని అడగవలయునని స్త్రీలలో యోచన గలుగుచున్నది. ఏమైననేమి జిల్లాసభలలో జరిగిన మల్లయుద్ధములవలననో, దేశములోరేగిన తీవ్రాందోళన వలననో కాని బందరుమహిళాసభలో తీవ్రచర్చలపాలైన ఈవిషయము-ఒక్క సంవత్సరమునుంచి యావదాంధ్ర దేశమును గగ్గోలు పెట్టించుచున్న ఈవిషయము-గుంటూరుపట్టణాన్ని అట్టుడికించినట్లుడికించిన ఈవిషయము-ఒక్క చచ్చుదెబ్బఅయిన కొట్టకుండా నేచచ్చి ఊరుకుంది. ఏస్త్రీగాని యీతీర్మానం ప్రవేశపెట్టుటకు సాహసింపలేదు. పాముకఱచి ఉత్తనోరైనది.

ఈవిడాకులతీర్మానం బాహుభార్యాత్వం తొలగించేతీర్మానం మఱుగున రంగస్థలంనుండి నిష్క్రమించేసమయంలో భార్యావియోగంజెందిన పురుషుడు అవివాహితయగు బాలికను వివాహమాడుట అసమంజసముగనుక భర్తృవియోగముజెందిన స్త్రీనే వివాహమాడవలయునని యీసభవారు పురుషులకు సూచించుచున్నారుఅను తీర్మానమువ్రాసి ఒకరు అధ్యక్షురాలి కందజేసినారు. ఆతీర్మానం విని అందఱు పకపక నవ్వారు. ఉచితమైన వయస్సుగలవారిని పెండ్లాడతగునని సూచించిన చాలును యింత పచ్చిగా వ్రాయనవసరములేదన్నారు కొందఱు. మొత్తముమీద ఈతీర్మానము పట్టి చర్చావినోదమునకే హేతువైనది కాని తీర్మానంగా లిఖితంగాలేదు.

తరువాత క్రమముగా ఘోషా,అస్పృశ్యత,మద్యపానము, గ్రామపునర్నిర్మాణము మొదలైనవిషయముల గూర్చిన తీర్మానములు నిర్వివాదముగా పరిష్కృతములై సభవారి ఆమోదమును బడసినవి.

సభకు దాదాపు 60 మంది ప్రతినిధులువిచ్చేసిరి. ఈసంవత్సరముగూడ రాయలసీమకంతకును డాక్టరు క. లక్ష్మీదేవిగారొక్కరే ఏకైకప్రతినిధిని. ఈమెగారు మహిళాసభ నీమారు తమబళ్ళారి కాహ్వానించిరి. ఇక సభకువచ్చిన ప్రేక్షకురాండ్రకు లెక్కలేదు. టౌనుహైస్కూలు మేడమీదనున్న అతివిశాలమగు హాలు వాని ప్రక్కవరండాలుగూడ స్త్రీలతో రెండుదినములు నిండిపోయినవి. భోజనాదివసతులు చక్కగాజరిగినవి. ఫలహారతాంబూలములు చక్కగాముట్టినవి. ఊరేగింపులు ఛాయాపటములు తీసికొనుటవగైరా ముచ్చటలన్నియు ముచ్చటగాదీరినవి. కాన ప్రతినిధినుల సత్కారవిషయమున గుంటూరువారు యోగ్యతాపత్రమును బడసిరని చెప్పవచ్చును.

అయితే సభల జయాపజయములను నిర్ణయింపవలసినది సత్కారములనుబట్టిగాదు. తీర్మానములనుబట్టి. బందరుసభలోని తీర్మానములను యీసంవత్సరసభాతీర్మానములను ముందునిడుకొని చూచినచో గతసభకంటె ఈసభలోని తీర్మానములు చాలసంకుచిత మొనర్చబడినవని చెప్పవలయును. దేశీయసంస్థలనుగూర్చియు భాషలనుగూర్చియు వెల్లడింపబడిన భావములు ఉదారములుగాలేవు. రాజకీయములతో సభకు సంబంధములేదన్న కారణమున ప్రతిదేశహితైకవిషయము అనుమానింపబడి పరిత్యజింపబడుట సభయొక్క అభివృద్ధికి సూచకము కాదు. ముఖ్యముగా రౌండుటేబిలుసభకువెళ్ళినదాది ప్రతిసభలో స్త్రీలకు సమానహక్కులని యెలుగెత్తి పలుకుచున్న మహాత్మునకుగాని సరోజినీదేవివంటి స్త్రీప్రతినిధులకు గానీ ఒక్క కృతజ్ఞతాభివందనమైన సమర్పింపజాలని ఆంధ్రరాష్ట్రీయమహిళాసభ యెంతకోలాహలముగ జరిగినను తనలోపమునెట్లు బాపుకొనగలదు?

పూర్వము మహిళాసభలు జరిగినప్పుడు ఒక్క తీర్మానముమీద మాట్లాడుటకు ఇద్దరుస్త్రీలు దొరకుటకు తలప్రాణము తోకకువచ్చెడిది. సాధారణముగా చాలమంది సభలో నోరుమెదల్పకనే పత్రికలలో ఉపపాదక ఆమోదకస్థానములలో నెక్కుచుండువారు. ఇప్పుడట్లుగాదు. ఒక్క ప్రతిపాదన వచ్చినచో పదిమంది యిరువదిమంది మాట్లాడుటకు పేరిచ్చుటకు సిద్ధము. వ్యవధిచాలదనిన వారికి బ్రహ్మాండమైనకోపము. అయితే వీరిలో విషయమెరిగి ప్రతిపాదనపై ప్రసంగించువారు మాత్రము కడుకొలది. ఆదుర్తి భాస్కరమ్మగారివంటి విదుషీమణులే నలుగురైదుగురో మాత్రమే విషయమెరిగి విపులముగా సుబోధకమగురీతి వివరింపగల నేర్పుగల

వారున్నారు. అధ్యక్షురాలు ఈతీర్మానముమీద ఎవరైనమాట్లాడగలరా అని అడిగినప్పుడు నేను నేనని పది మంది లేచుటయు అయితే మీరు మాట్లాడండీ అన్నప్పుడు తీర్మానమేమిటి ఏమిమాట్లాడవలయునని ఆమె అధ్యక్షురాలినడుగుటయు తటస్థించిన సందర్భములుగలవు. ఇదిపరిహాసపాత్రమైనవిషయము. దేశములో రాజకీయాందోళనము ప్రబలినతరువాత చాలమంది స్త్రీలకు సభాపిరికితనము వదలిపోయినది. మంచివక్తృత్వవైఖరి గూడ పట్టుపడినది. కాని ఉత్సాహమునకు వక్తృత్వమునకుదగిన విషయపరిజ్ఞానము మాత్రము మనఆంధ్రస్త్రీలలో ఇంకను కొఱతగానేయున్నది. ఆకారణముచేతనే నిత్యము కంఠపాఠముగా నభ్యసించిన రాజకీయ విషయములందేగాని యితరవిషయములందు ఆంధ్రస్త్రీలు చక్కని ఉపన్యాసములిచ్చుటకు శక్తిచాలనివారుగా నున్నారు. అయినను ఆంధ్రస్త్రీలలో నత్యంతవేగముతో పెంపొందుచున్న విద్యావిజ్ఞానములు మంచిఉపన్యాసకురాండ్రను గాంచెడిభాగ్యము మనకెంతో దూరముగలేదని విదితమొనర్చుచున్నది. ఈశ్వరుడట్టి శుభకాలము సమీపింపజేయునుగాక!

## సోదరీ!

కీసర వేంకటరామనరసింహారావుగారు

తల్లియుఁదండ్రియున్పతియు దైవసమానులు; నీరిపట్ల నీ
వెల్లెడభక్తిగల్గి చరియింపుము; పిన్నలఁజూచి ప్రేమరం
జిల్లగ బల్కువర్తిలుము; సేవకులంగనిఁ దూలనాడగా
జెల్లదటంచెఱుంగుము; విశేషశుభంబగునీకు సోదరీ!

పరులకుఁజెందుదానిఁ దృణభంగి మదిందలపోయుమమ్మ; నీ
పరపతిపోవుకార్యములఁ బాల్గొనకమ్మ; ప్రశాంతచిత్తవై
హరిచరణాంబులనయుంబును గొల్వగదమ్మ; మెన్నఁడున్
మరువకుమమ్మ యీహితముమాత్రము; మేలగునీకు సోదరీ!

కుందకు ద్రవ్యరాసులను గూర్పగలేదని; మానసంబునన్
బొందకుదుఃఖమున్ సుతులుపుట్టగలేదని; నీవు కోరినన్
జెందునె? కోరకున్న యెడ నేకురకుండునె? ధాత్రవ్రాలు ము
న్నెందునుమార్పుచేయబడెనే? ధరణీతలమందు సోదరీ!

ఆకలిగొన్నవారికి ప్రియంబలరార భుజింపఁబెట్టుటే
ప్రాకటధర్మమార్గము; శుభంకరలద్ధనకార్యదీక్షచే
నాకముజెందినారు మును నాతులు పూతచరిత్రలెందరో
చేకొనుమమ్మ యీవ్రతము; చెచ్చెరమేలగునీకు సోదరీ!

కలియుగమందు నూతనముగాజనియించుచునున్నవమ్మ మా
ర్పులు మనభారతోదయనిరోధములై; భవదీయదృష్టినిన్
నిలుపకువానివైపు; నిజనీతినిరక్షణజేసికొమ్మి; యీ
సలలితమా హితంబు వినజాలిన మేలగునీకు సోదరీ!

# స్వేచ్ఛ

శ్రీమతి పైడిమఱ్ఱి సీతాదేవిగారు

సౌఖ్యసౌధాంతర్భాగములందు హంసతూలికాతల్పముల, డోలికావిహారముల, రత్నకంబళుల, కందుకకేళీవిలాసముల విహరించు నోభారతనారీ! నీకేటి యిట్టినిర్బంధనివాసము? వాయువులో సంచరణంబొనరించు విహంగసముచయంబునకు లేదే స్వేచ్ఛాజీవనంబు? నిర్మలోదకంబుల నిరంకుశవాహ్యాళినొనరించు కీటకాదు లాస్వాదించవే స్వేచ్ఛామృతంబు? నిర్మానుష్యనిబిడాంధకారసమన్వితంబగు కారడవుల నాటఁ నాడవన్యమృగాళిచేయదే స్వేచ్ఛాగానంబు?

కానవో! పూతమైన భారతభూమి దాస్యశృంఖలములను విచ్ఛేదించి, స్వేచ్ఛాగీతమును గానముసేయుటకై నవయుచున్న నవయాంగశోభితులగు కొందరునారీమణుల యశ్రాంత, నిర్మల, నిర్భీత, విజ్ఞాన, ధైర్యస్థైర్యములను?

లెమ్ము! పరదాపద్ధతిని ప్రతిఘటించి, స్వాతంత్ర్యవాంఛను వెల్లడించి, భవత్ నిర్బంధ, భవనయయశ్శలాకములను భగ్నమొనరించి, వ్యక్తిత్వము దైవవిదితముగ గ్రహియించి, స్వేచ్ఛామృతమును గ్రోలి, పురుషుని తీక్ష్ణవీక్షణముల నిర్లక్ష్యముజేసి, యోభారతనారీ! కార్యసాఫల్యమునకై నడుముగట్టుము.

హైందవమాత తనకూతుల శాంతియుతమౌ యుద్రేకావేశాహ్లాదంబును తన మందహాసచంద్రికలచే మన్నించును. అల్లదిగో! నారీహృదయమెట్లు భావనాతరంగములలో డోలాయమానమగుచున్నదో! 'ఘోషా' యను ఘోరమౌగృహమున బంధింపబడి మడియకుండుటకై యెట్లు గగ్గోలొనరించుచున్నదో!

అసూర్యంపశ్యవేయగుదువుగాక! సిరిసంపదలు నీయింట సమృద్ధిగానుండుగాక! సరస్వతీకటాక్షవీక్షణములు నీమీద ప్రసరించుగాత! శ్రవణ, నయనానందకరములగు స్వేచ్ఛాదేవియొక్క గేయనృత్యముల జవిజూడని నీతనువేల? నీలావణ్యమేల? సిరిసంపదలేల? విద్వత్తేల?

ఆమెను నీహృదయపేటికయందుంచుకొనుము. దేశమాత ముఖారవింద మందహాసదీవన నందుకొనుము.

# కుసుమ

కాశీరాజు రామమోహనశర్మగారు

౧

అది వసంతఋతువు. ఆనాటి రాత్రి చంద్రుడు చక్కగా ప్రకాశిస్తున్నాడు. చల్లని పైరుగాలి సుమసౌరభాన్ని మోసుకొస్తున్నది. గున్నమామిడిచిగుళ్లను మెక్కికోయిలహాయిగా కూస్తున్నది. హేమంతుని మంచందగ్గరనే కిటికీఉన్నది. అందులోంచి గదిలోనికి వెన్నెలకాంతులు వస్తున్నాయి. అప్పుడు తనమంచం మీద ఒకప్రక్కగా 'కుసుమ' కూర్చునియున్నది. ఆమె హేమంతునిభార్య. ఆమె స్నిగ్ధకపోలభాగాన్ని పైరుగాలికిఆడుతూన్న నీలకుంతలాలు సవరిస్తున్నాడు హేమంతం. కుసుమ ఆనాడు విచారంగానున్నది. హేమంతుడు చక్కిలిగింతలుపెడుతున్నాడు ఆమెను కులాసపెట్టడానికి. కుసుమ కదలకుండా ఏకాగ్రంగా పూర్ణచంద్రుణ్ణి తిలకించుచున్నది. హేమంతం బుజ్జగింపులు పనిచెయ్యలేదు.

"ఎక్కడున్నావు? కుసుమా!" అన్నాడు.

జవాబులేదు.

"ఊహాప్రపంచకంలోంచి రాదలచుకోలే? కుసుం! చూడు యీరాత్రిఎంతబాగుందో"

కుసుమ మొగం త్రిప్పింది. హేమంతం నవ్వాడు.

"నాకో మంత్రంవచ్చు"నన్నది కుసుమ.

"ఏమిమంత్రం?"

"ఈవెన్నెలరాత్రిని అమావాస్యగా చేసేస్తాను."

"అది వద్దు."

"ఏం?"

"ఈరాత్రి చాలాఆనందంగాఉంది. నీకుచేతైతే ఈలాంటిరాత్రిళ్లు తెల్లవారకుండా చెయ్యాలి."

"అల్లాగా" అనినవ్వింది కుసుమ.

కుసుమనుకౌగలించుకుని ముద్దుపెట్టుకోబోయాడు హేమంతం. కుసుమ తప్పించుకున్నది. కుసుమా హేమంతులు సరసాలాడుకొంటున్నారు.

హరిహరుఁడు తలుపుదగ్గరనుండి గట్టిగా "హేమంతం! ఆశూద్రురాలి నింట్లోనుండనీయకు" అన్నాడు. హరిహరుడు హేమంతంతండ్రి.

హేమంతం కుసుమకేసిచూచాడు. ఆమెముఖాన వింతభావాలవేమీలేవు. కుసుమ చేతులతో కళ్లుమూసుకున్నది. "తత్క్షణం చచ్చిపోతేబాగుండును" అనుకొన్నది అప్పుడామె. అంతాప్రశాంతంగానున్నది. గున్నమామిడిమీద గండుకోయిల ఇంకాకూస్తున్నది. దాన్నివినేవారులేరు. ప్రకృతిసౌందర్యాలు చాలా ఉన్నాయి. కాని వాటిమాధుర్యం గ్రహించేవారులేరు.

౨

హేమంతం అప్పుడే యింటికివచ్చాడు. గదిలో కుసుమఉన్నది. తిన్నగా ఆమెదగ్గరకువెళ్లి

"అది నిజమేనా?" అన్నాడు.

"నిజమే."

"ఇంతవఱకూ ఎందుకుచెప్పలేదు?"

"చాలామార్లు చెప్పదామనుకున్నాను. కానిచెప్పలేకపోయినాను. నేను చాలాచెడ్డదాన్ని." ఆమె నేత్రాలనుండి రెండుకన్నీళ్లచుక్కలురాలాయి.

"ఇప్పుడైనాచెప్పతావా?" అన్నాడు. కుసుమ గంభీరంగా తనచరిత్ర అమూలాగ్రంచెప్పేసింది. కథ విని హేమంతం బయటికిపోయినాడు. హేమంతం తన్నువిడిచిపోతున్నాడనేఅనుకున్నది కుసుమ. ఆమెకది వింతగాతోచలేదు. జీవితంలో మానవునికి తటస్థించే నిత్యకృత్యంలాగే అది ఆమెమనస్సుకితట్టినది. అప్పుడు యీప్రపంచకం, ప్రేమ, ప్రేమించడం అంతా మాయగాతోచిందిఆమెకు. జరిగిపోయిన దినాల్లో, హేమంతం తన్నుప్రేమించడంలో చెప్పిన దృఢాభిప్రాయాలు కల్లలనుకుంది. తనహృదయంలో మమకారంతోపెంచుకుంటున్నప్రేమలతను తెగగోయటానికిపుట్టిన మొండికత్తిలాంటివాడుగా తోచాడు హేమంతం ఆమె కాసమయాన. హేమంతం తన్ను

ప్రేమించినరోజులలో అతనిహృదయంనిండా ఉండనుకున్న ప్రేమ, ఒక్కనిముషం వాళ్లిద్దరూకలసి ఉంటే ఎంతో మాధుర్యంగాఉండే ప్రేమ, ఆఒక్క నిముషంవియోగానికే తన్ను అంతగాబాధించిన ప్రేమ- అస్థిరమని అప్పుడనుకున్నది.

"ఈరాత్రిచాలాబాగుంది" అని హేమంతంఅని ఇంకా పూర్తిగా ఒక్కరాత్రియైనాగడచిపోలేదు. ఇంకా ఆకోయిల ఆలాగేకూస్తున్నది. పైరుగాలి అల్లాగే వీస్తున్నది. వెన్నెలకిటికీలోనుంచివచ్చి మంచంమీద పోయిగానిద్రపోతున్నది. ఆమె హేమంతం దగ్గర ఎంతగుట్టుగాప్రవర్తించిందో, ఇప్పుడు ప్రేమ అనేదికూడా అంతగుట్టుగా సంచరిస్తున్నది ఆమె హృదయాన.

## 3

రాత్రితెల్లవార్లూ హేమంతానికి నిద్రలేదు. కన్నులునులుపుకుంటూ సదాశివయ్యగారింటికిపోయి నాడు. సదాశివయ్యగారే కుసుమకు పెండ్లిచేసినారు.

"విశేషాలేమిటి?"అన్నాడుసదాశివయ్య. హేమంతానికికోపంతో శరీరమంతా దహించుకుపోతున్నది. రుద్ధమైనకంఠంతో "నీమూలంగా మాకులంచెడిపోయినది. మావంశగౌరవాన్ని నాశనంచేశావు. ఇదంతా నీమూలాన్నే" అన్నాడు. ఇంకమాట్లాడలేకపోయినాడు. సదాశివయ్య చిరునవ్వునవ్వాడు. "మాగౌరవాన్ని నిలబెట్టినాడు మీనాన్నగారు" అనిఅన్నాడు. ఆమాటలకు సిగ్గూ,కోపంగూడావచ్చాయి హేమంతానికి. "నీకెప్పుడేనా ఏమైనా అపకారంచేశానా?" అన్నాడు.

"అయితే హేమంతం! నిన్నొకప్రశ్న అడగనా?"

"ఏమిటి?"

"నాపుత్రిక మీనాన్నగారికేమైనా అపకారం చేసిందా?"

జవాబులేదు.

"హేమంతం! విను. నీవుచిన్నవాడవు. బహుశా నీకుతెలియదు. నీవు కలకత్తాలోచదువుకునేరోజుల్లో మాఅల్లుడు ఎవరితోనుచెప్పకుండా ఇంగ్లాండువెళ్లినాడు. మరి ఐదేండ్లుపోయినాక 'బారిస్టరు'గావచ్చినాడు. మీనాన్నగారు మాకులపెద్దగాఉండేవారు. 'నీకూతుర్ని అల్లుడివద్దకుపంపితే తిరిగి నీయింటికెప్పుడునూ తీసుకోనిరాకు. వ్యతిరేకించితే కులంలోంచి వెలివేస్తా'మన్నారు. నాఅల్లుడికి ప్రాయశ్చిత్తంచేయిస్తానన్నా. ఇంగ్లండు పోయివచ్చినా కులంలోచేర్చుకోమని బ్రతిమాలాను. కాని వినలేదు. అప్పటిసంఘంలో ఎంతటిదురాచారాలోగ్రహించు. నాకూతుర్ని ఒదిలి బ్రదకలేను. అక్కడిపోరుపడలేక బంధువుల్నీ, స్వగృహాన్నీవిడిచి కలకత్తావచ్చేశాను. కష్టాలు నావెనకాలేతరుముకొనివచ్చాయి. మాబావమరదికి పెండ్లిచెయ్యబోతే నన్ను కులంలోంచి వెలివేశారనిచెప్పి పెండ్లిచెడగొట్టారు. చూడు! ఇదంతా మాఅమ్మాయి, మాఅల్లుడుచేసినతప్పేనా? ఇంక నా పరాభవం నన్ను దహించివేసింది. నేను పంతందీర్చుకోవాలని అనుకున్నా. అనుకోవడమేకాదు. అది నావిధి-చేయకతప్పదనుకున్నా. అప్పుడు మీబావమరదే ఆఇంగ్లండుపోయివస్తే ఏమిచేశేవారోగదా మీనాన్నగారు అనుకునేవాణ్ణి.

ఇప్పటికి కథ చాలావరకు నీకు గ్రాహ్యంఅయివుండాలి. ఇదంతా చిత్రంగాఉంటుంది. అంతావిను. నీకు బోధపడుతుంది.

కలకత్తాలో నీబసప్రక్కనేఉన్నయింట్లో గంగాధరంగారనే ముసలిబ్రాహ్మణు డొకాయన ఉండేవాడు. వారియింట్లో 'కుసుమ' అనేబాలవితంతువుండేది. ఆమె శూద్రురాలు. చాలాఅందగత్తె. ఆమెతండ్రి చనిపోయేటప్పుడు గంగాధరంగారికి ఆమెను వప్పచెప్పినాడు. గంగాధరంగారికి అనుమానంఎక్కువ. యువకులామెనుచూడకుండాను, ఈమె యువకుల్ని చూడనీయకుండాను నిర్బంధించాలని చూచాడు. ఆముసలికళ్లలో దుమ్ముకొట్టడం ఈమెకు చాలాకష్టంగాదు. ఆమె యువతి. అప్పుడప్పుడు డాబామీదికి చల్లగాలిసేవించడానికిపోయేది ఆమె.

అప్పుడు నీవు నీ మేడమీద ఒంటరిగా చదువుకు నేనమ యం. మీ రిద్దరు ఒకరినొకర్ని చూచుకున్నారు. మాట్లాడుకొన్నారో లేదో కాని గంగాధరంగారికి నీమీదా, కుసుమమీదా అనుమానం కలిగింది.

కుసుమ నిద్రాహారాలుమానింది. ముసలిగంగాధరం గారియెదురుగా నకారణంగా వెక్కి వెక్కి ఏడ్చేది. ఆయనకు కారణం బోధపడింది. నీవుకూడా కాలేజీ మాని మేడమీదకూర్చుని గంగాధరంగారి డాబా వైపుచూస్తుండడం ఆయనఅనుమానాన్ని బలపరచింది. కొంతఆలోచించి ఆయన నాసలహాకొరారు. పాపం ఆయన రెండేండ్లనుండి కాశీ వెళ్లాలని ప్రయత్నిస్తు న్నారు. నేడు ఆయనను వెళ్లమని ప్రోత్సహించాను. కుసుమను జాగ్రత్తగా చూచేభారంనాదిఅని అన్నాను. ఆయనసమ్మతించి కాశీకిపోయినాడు. కుసుమను, ఒకగొప్ప పలుకుబడిగల శ్రీ ని వా స రా వు గా ర నే బ్రాహ్మణేతరునిగృహమందుంచి ఆమెను ఆయనకు వప్పచెప్పి, అప్పుడప్పుడు ఆమెయోగక్షేమాలు కను గొనేవాడిని.

నీవు వయ్యారంగా శ్రీనివాసరావుగారింటిముందు షికార్లుచెయ్యడం, ఆమె నిన్ను చూస్తుండడం, నీవు కాలేజీకితరచు పోవకుండడం అంతా నాకుతెలుసు. నాభారం తేలికయిపోయింది. ఇదంతా ఒకకల్పిత కథ మల్లేనేఉంటుంది. నాపట్టినపంతం తీర్చుకో డానికి చేశానుదీన్ని..."

"కుసుమ వివాహానికి అభ్యంతర పెట్టలేదా?" అని హేమంతం తలవంచుకుని అన్నాడు.

"అదియేలాగు జరుగుతుంది. స్త్రీలు గాఢంగా ప్రేమిస్తారు సంగతిసందర్భాలు ఆమూలాగ్రంగా తెలిసికొని. ఆమె దినదినానికి చిక్కిపోతున్నది. నీవూఅంతే. నీచదువుకి పెద్దఆటంకంకలిగింది. మీ యిద్దరిస్థితీ నాకుచాలా జాలిపుట్టించాయి.

ఒకరోజునకుసుమదగ్గరకుపోయాను. వాడిపోయిన గులాబిపువ్వులాగున్నది ఆమె. 'ఈముసలివానిదగ్గర సిగ్గుపొందనలసిన అవసరంలేదు నీకు. నీవు ఎవరికోసం చిక్కుతున్నావో నాకు తెలియును. అతనుకూడా నిన్నాలాగే ప్రేమించాడు. మీకు దాంపత్యం చేకూర్చగలను. నీఉద్దేశ్యంఏమి?' అన్నాను ఆమెతో.

"అది యేలాగు? నే బ్రాహ్మణస్త్రీని కానే" అన్నది.

"నిన్ను బ్రాహ్మణస్త్రీగాచేస్తాను" అన్నాను.

"బ్రాహ్మణేతర స్త్రీని వివాహంచేసికోవడం నీకిష్ట మేమో కనుగొ"మ్మంది ఆమె నన్ను.

"అతడు కేవలం పిచ్చివాడైపోయాడు. అతనితో నీరహస్యాలన్ని యెందుకుచర్చించడం. వివాహంజరిగి పోనీ. ఈరహస్యం ఏమాత్రం వెల్లడిగానివకూడన్న అతన్నియెందుకు ఆవిధంగా విరహాగ్నిలో దహించి వెయ్యడం"అని నేను అన్నాను. ఆమె మౌనంగా నుండి వెళ్ళిపోయినది.

ఆమెకీవివాహం ఇష్టమో కాదో అది నేను చెప్ప లేను. ఒంటరిగానున్న సమయాన్న ఆమె వెక్కి వెక్కి రోదిస్తుంది. అది ఆమెకు ఆనందం కాబోలు. కుసు మకు జీవితంలో ఆనందంఆ నేదిభగవంతుడు ఇచ్చాడో లేదో అనుకునేవాణ్ణి. ఆకుసుమకు ఏకాంతం అంటే ఇష్టం. పరిస్థితులీలాఉండగా శ్రీనివాసరావుగారిచేత వివాహంసంగతి నీకు చెప్పించాను. నీవు సమ్మ తించావు.

పెండ్లిరేపుఅనగా కుసుమ నాదగ్గరకువచ్చింది. "నాకు పెండ్లివద్దు"అని యున్నది.

"సన్నాహంజరిగిఉంది. నీవు సమ్మతించకతప్ప" దన్నాను.

దీనంగా "నేచచ్చిపోయినట్లు—పుకారు పుట్టిం చండి—నన్నెక్కడికైనాపంపి—"అన్నది.

"రేపు తనమనోరథం యీడేరుతుంది అని ఆనంద సాగరతరంగాలమీద ఆడుతూపాడుతూఉన్న అతనికి నీచావే యీరోజున నన్ను చెప్పమన్నావా?—చెప్పి నాననుకో. తత్ఫలితంగా నతనిచావు నీకు చెప్పవలసి వస్తుంది. అప్పుడునిజంగా నీచావు—"అని అన్నాను. ఆమె కన్నీళ్ళు విడిచింది.

"ఈముసలితనంలో స్త్రీహత్యా, బ్రాహ్మణ హత్యా పాపాలు నా మెడలోకట్టుకోమన్నావా?" అన్నాను.

సలక్షణంగా వివాహం జరిగిపోయినది. నేను పట్టినపట్టు తీరినది. పంతంకోసం నీకింతవరకూ యీ కథ చెప్పనేలేదు. ఈరోజున చెప్పివేశాను.

"ఇంత చేసికూడా ఊరుకోలేకనా దీన్ని నాకు చెప్పినది."అని హేమంతంఅన్నాడు.

"అంతేకాదు."

"ఇంకాఏమైనా ఉన్నదా?"

"ఔను."

"ఏమి?"

"మీచెల్లెలి వివాహప్రయత్నాలు జరుగుతున్నట్లు విన్నాను. ఇదివరకు మీబ్రాహ్మణకులం చెరిపివేశాను పంతంకోసం. ఇప్పుడు మీరుమీ చెల్లెలికి వివాహంచేసి యింకో బ్రాహ్మణవంశాన్ని చెరుపుతున్నారు. మీరు శూద్రస్త్రీని వివాహంచేసికొనియున్నారు గనుక మీతో వివాహసంబంధంచేసికోవద్దని వారికి ఉత్తరం వ్రాశాను."

"కుసుమను నేను విడిచిపెట్టేస్తాను. అప్పుడు అన్నవస్త్రాలిచ్చి కుసుమను మీరు పోషిస్తారా?"అని హేమంతం అడిగినాడు.

"లోకులు విడిచిపెట్టిన స్త్రీలందరకు అన్నవస్త్రాలిచ్చి పోషించడమా నాపని? నేను చేయవలసినదేదో నేను చేశాను. అదిమాత్రం నాపనిగాద"ని ఖండితంగా చెప్పేశాడు సదాశివయ్యగారు.

"రెండు కొబ్బరిబొండాలు తేరా హేమంతంగారికి"అని సదాశివయ్య నౌకరునిపిలిచాడు. అవివచ్చే లోపల ఆగమన్నా ఆగకుండా హేమంతం వెళ్ళిపోయినాడు. అతని చర్యజూచి సదాశివయ్యగారు ఆశ్చర్యపడ్డారు.

౪

పూర్ణిమవెళ్ళిపోయినది. నాడు పంచమి. వెన్నెల యింకారాలేదు. చీకటిగానున్నది. ఆనాటి గండుకోయిల కూయడంలేదు. కీచురాళ్ళధ్వని యెక్కువగా నున్నది. ఆగున్నమామిడిచెట్టాచీకటిలో తలవిరియబోసుకొన్న పెనుభూతంలాగున్నది. ఆనాడు మందమందగావీచిన పైరుగాలి నేడు భయంకరంగా వీస్తున్నది. నక్షత్రాలు మినుకుమినుకంటూ ప్రకాశించుచున్నవి. అక్కడక్కడ మిణుగురుపురుగులుకూడా కలవు. ఆకాంతిలో ఆకాశంమీద బారులుకట్టి తిరిగే మేఘాలు కనిపించుచున్నవి.

నేడు హేమంతంగదిలో దీపంలేదు. ఆచీకటిలో కుసుమాహేమంతులిద్దరూ మౌనంగానున్నారు. హేమంతం తన మంచంమీద కూర్చుండి కాళ్ళు క్రిందకువ్రేలవైచి యూపుచున్నాడు. అతని పాదాల దగ్గరనే కుసుమ తనముఖం అతని పాదాలమీద నుంచి కన్నీళ్ళతో తడిపివేసింది. ప్రకృతిలో ఆఒక్కమందిరంలోనే అంతా మౌనంగా, ప్రశాంతంగా, దుఃఖపూరితంగానున్నది. ఆభయంకరనిశీధినీఫలకంమీద ఆఒక్కదృశ్యమే చిత్రింపబడ్డది. 'హేమంతం ఒక వ్యాయమూర్తి. అతని పాదాలదగ్గర కుసుమ. ఆమె దోషి' ఇదియే ఆదృశ్యము.

అప్పుడు హరిహరుడుమళ్ళావచ్చాడు. ఆచీకటిలో అతనికళ్ళు చింతనిప్పులవలె మెరుస్తున్నాయి. "హేమంతం! నీకు యిప్పటికి చాలాగడవుయిచ్చి ఉన్నా. ఇంకనాశూద్రురాలిని నాయింట్లో నుండనీయను"అన్నాడు.

కుసుమ ఆమాటలువిన్నది. ఆతురత ఎక్కువైనది. శరీరంజల్లుమన్నది. హేమంతంపాదాలను గట్టిగా కౌగలించుకున్నది. కడపటిసారి హేమంతం పాదాలకుభక్తిపూర్వకంగానమస్కరించింది. వెళ్ళిపోవుటకు లేచి తలుపువరకు వెళ్ళినది. ఈరెండునిముషాల్లో హేమంతంగాంచిన దృశ్యం అతనిహృదయంలో హత్తుకొనిపోయింది. అతని హృదయంలో 'కుసుమ' అంటే ఒక దేవీమూర్తిగా తోచింది. అనంతమైన ప్రేమాస్రవంతి అతని హృదయసాగరంలోనికి ప్రవహించింది.

ఒక్కమాటుగా లేచివెళ్లి కుసుమ చేయిపట్టుకొన్నాడు. రుద్ధమైనకంఠతో

"నాన్నగారూ! నాభార్యఅంటే నాకుప్రేమ. ఆమెను నేనువిడిచిఉండలేను"అని అన్నాడు.

హరిహరునకు కోపంఎక్కువైంది.

"హేమంతం! నీమతానికి తీరనికళంకం తెచ్చిపెట్టావు. అదినీకు ప్రస్తుతంలో తెలీదు. తెలిసినాక దాన్ని పోగొట్టుకోవాలి. నామాటవిను" అన్నాడు.

"నామతంకంటే నాకు నాభార్యఎక్కువ" అని జవాబుచెప్పాడు హేమంతం.

"నా మతాన్ని అగౌరవపరచి, నాగౌరవాన్ని నిలపలేని నిన్నూ, నీభార్యనూ నాయింట్లో ఉండనీయను. లేచిపొండి" అని చురచురలాడుతూ హరిహరుడు వెళ్లిపోయాడు.

కుసుమా హేమంతులు వారిదారి వారుచూచుకొని సుఖంగానున్నారు సంఘసంస్కర్తలై. —టాగూరు.

# ప్రేమరాజ్యము

శ్రీమతి వింజమూరి వేంకటరత్నమాంబగారు

ఉదయకాలమందు ధరణియుజలనిధియు
నినునికాంతికిఁబ్రతిఫలమిచ్చునపుడు
ఇలువిడిచి కనునుత్సాహహృదయనగుచుఁ
బ్రేమరాజ్యమున్వెదకంగ వెడలియుంటి.
కవియొకండు దారిలో నాకుఁగానుపింప
నచ్చటికి నడ్డుదారి యేదనియడిగితి.
"రమ్మునావెంటఁ గొలఁదికాలమ్ములోన
కాంతువద్దానిసౌధశిఖరపుఁగాంతు"
లనుచునతఁడు ప్రత్యుత్తరమప్పుడిచ్చె.
అంతలోదవ్వునం దొకవింతపురము
తోఁచెమిఱుమిట్లుగొల్పెడు ద్యుతులతోడ
"అదిగొ నీవుగోరున"దంచు నతఁడుపల్కె
కానియదిస్వప్నములరాజధానియగుట
నామదిచివుక్కుమనె నాశనాశమయ్యె.
అవలగుజ్జుపురోతొకం డగపడినను
వెంబడింపుమనవుడట్లు వెడలియుంటి
నాడుచుంబాడుచున్ వానిననుగమించి
బ్రతుకను సముద్రపుందరిఁ బట్టిచనుచు.
అచటినుండిమేమొక్క లోయకరుదెంచి
తన్మనోహరత కతిముదంబుఁగంటి
మప్పు డొకపద్మముఖి మందహాసమమర
రక్తిమెఁజూచెఁ బొదనుండి కొతువంక.
"ఇదిగొ ప్రేమసామ్రాజ్యబహిఃప్రదేశ
మునకువచ్చియుంటిమి ప్రేమముదములిందె
మివులనొప్పు" నంచుఁబలికె రవుతులొని
యక్కటా! యది జ్ఞానరాజ్యంబయయ్యె.
ఆశవీడి నేమెల్లఁగా నరుగుచుండ
బాటయందొకబండి సేవకులతోడఁ
బోవఁగంటి భటులు పల్కిరీవిధమున
"రమ్మువెంట మారాజ్ఞిరాజ్యమందె
నీవుగోరురాజ్యముగూడ నెగడునమ్మ!"
అట్టులరుగనొక్కలలన యఖిలభూష
ణాంబరములఁ దాల్చినయది నాకగపడె
ఆమెఁజూడ నాశావేశ మణఁగిపోయె
సంజతుదివెల్గు క్రమముగా సమయునట్లు
అకట! యదిస్వర్గరాజ్యమే యయ్యెఁగాన.
కడకొకగుడిసెకడకు నేవెడలి సుంద
రాంగినొకతెఁగాంచియడుగ ననియెనిట్లు
"దానిఁగూర్చి నేవింటిఁగాని నాప
దములు గృహరాజ్యసీమ వదలవుగాన
దానికేఁగుమార్గమెదియొ నేనెఱుంగ."
అనుచు నిట్టూర్పువిడిచె నాయువతిమిన్న.
ఏను దత్కుటీరముఁగన నెంతశాంతి!
ఆయువతిమోము కలకలలాడుచుండె
గొప్పవెల్గు నాయాత్మకు గోచరించె
ఇల్లెప్రేమరాజ్యమ్మున కిక్కయుంటి.

# ఉద్యోగము: ఆశ

కారుమంచి కొండలరావుగారు బి.ఏ.

అత డొక గొప్పత్యాగి, కలదంతయు దాస్యము గోరి యెంతో స
మ్మతమున వెచ్చపెట్టు, ననమానకలావిభవుండు గొప్పధీ
యుతు డికనేదియున్ దొరకదో—తనమానమునే త్యజించి పె
ద్దతలల తిట్లకై దిరుగు దాంతుడు శాంతుడు మానివర్యుడున్.

ధరణి నుద్యోగమే పురుషులకు లక్ష
ణమ్మటంచును పోరాడునట్టి పురుష
వర్యుడాతడు; సుఖమును వగయు మనసు
పన్ను వికృతులనెడి యోగివరు డతండు.

తలచి యిహమ్ము స్వర్గమును తాపసులై యుభయమ్ములందునన్
బరమసుఖమ్ము వొంది తరువాతి జనమ్ముల కంచుక్షేత్రముల్
నిలిపిరి పెద్దవార; లొక రిచ్చిన దాన సుఖమ్మొ?—నేను నా
తెలివి స్వయమ్ముగా గెలిచి తెత్తునటంచు దలంచు నాతడున్.
తలచి, యవన్నియున్, చదివెదన్ మఱి యున్నతవిద్యనంచు ని
శ్చలమతి మంటగల్పి, యిక పల్చు ప్రయత్నములన్ స్వయమ్ముగా
బలపము గట్టి కాలి కొకపట్టున నిల్వక యక్షరమ్ములే
తెలియని మూఢమానవుల దేవులరీతిని సేవజేయుచున్.

పొందికగ పూర్వులొసగిన భూములందు
గలుగు సుఖము స్వార్జిత మదిగానికతన
సుఖము కాదంట; స్వయముగా జోలెగట్టి
పొగులుచున్ సంచరించుటే మోదమంట;—
మఱియు సుఖమును దుఃఖమ్ము మనసు పన్ను
వికృతులట, తాను యోగియు వీరుడంట—
తుది నెలవొసంగు టాత నుద్యోగమునకు
బ్రశయమది—వాని కామీద బనియె లేదు.
వీరివారికి తంపులు బెట్టకుండ
ఊరకున్నతోచదు వానికొక్క క్షణము.
అతని జీవిత మాదర్శ మట్టివాని
గొలువగా వలె నీతండు కరుణయనక

సెలవనక యిల్లనక చచ్చి చెడి యొనర్ప
వలె బనుల్ రాత్రియిది యిది బగలునాక.
కోరు సుఖమును దానికై కోరుధనము
దాని కొఱకు క్షణమ్ము శాంతమును లేక
సుఖము నాహుతి జేయును; నురిగి వ్రాలు
ముసలితనమున నావాడు మోదవడుట
లింక?— మానవజీవిత మెంత వింత!
వాడు తన ప్రియకాంతను వదలివచ్చి
ఆరు నెలలయ్యె; ఒకదినమైన గాని
సెలవొసంగ డా యుద్యోగజీవితేశు
డచట నిన్ని కన్నీరు రాలుచుటకైన.
నిగనిగలాడు నామె కమనీయకపోలయుగమ్ముకాంతులన్
దిగవిడిచెన్; లతాలలితదేహము తేజము వాడిపోయె; సో
యగములు జిల్కు నామెవదనాబ్జము సోలె; తదోష్టబింబమున్
సొగసును గోలుపోయె మనసున్ దహియించు వియోగకలలన్.
తిరిగి తిరిగి యాతండును దెచ్చుకొనెను
తుమ్మినన్ బడిపోవు నుద్యోగమొకటి
దేహ మెముకలుగా పని దేల్చునేని
సుకముగా ముప్పదైదు దెచ్చుకొననగును.
త్యాగియే కాదు; మఱి ప్రేమయోగికూడ
ఉద్ధరించుట కని యాతడొక్క కన్య
పరిణయమ్మయ్యె దన కడ విరివిగాను
నిలచి యున్న సౌఖ్యమ్ము నా నెలతకివ్వ.
పగలున్ రేతిరటన్న భేద మొక యావంతైన లేకుండ స
ల్పగ నాతండు పనిన్; దలంప డిక పాపమ్మంచు, ప్రాణమ్ము వో
వగ వీక్షించును గాని వాని ననుకంపాశూన్యుడై యివ్వ డే
వగనైనన్ సెలవొక్క రోజు తనతో వర్తించు లోకమ్మటన్.
తనసొమ్మిచ్చెడి వానిరీతిగ వృధా దర్పమ్ము జూపున్ మఱే
పనులన్ దానటు లేనిచో జరుగబోవంచున్ దలంచున్ మదిన్
మును నాకార్యము లెట్లు జెల్లినవో తాపోవంగ నింకెట్లు చె
ల్లునో యంచొక్క క్షణమ్ముగూడ మదినాలోచింప డామర్త్యుడున్.

అవని నధికార మొనరించు మంచు తన్ను
వేల్పులున్ దివినుండి బంపినటు లెంచు;
అదియె బరమార్థ మతనికి; నదియె మోక్ష
సాధనమ్ము; ప్రియమ్మగు సతియు నదియె.
అతడు విరహవేదన బొందు నాదివార
౬. మందు, తోచదు తనయింటి యందు నున్న
మేడిపూయుట యత డింట మెలతతోడ
సరస మొందు పెదవివిచ్చి పలుకుటరయు.

నెలరాల్దాపి రచించినట్టి యొకతిన్నెన్ భూరుహానేకపు
ష్పలతామండితకేళికావని సమీపమ్మందు జెల్వారు ని
స్తులపద్మాకరవీచికాతతుల సంతోషమ్మునన్ దేలు నా
నళినిన్ నిల్చిన చక్రవాకి పెలుచన్ వాపోవగా జూచుచున్.
ఇంచుక గూరుచుండి హృదయేశుడు రాక విలంబనమ్ము గా
వించుట కేమిటో యనుచు వేయివిధంబులవోవ భావముల్
సంచలనమ్ము జెందె, నధరమ్ము చలించె, కవోష్ణబాష్పముల్
చంచలనేత్రి నేత్రముల సారెకు జాలుగ వాగులై చనెన్.
వేదిక యాసుశీల వడు వేదనజూచి కరంగిపాటె; నా
మోదముగోల్పడెన్ గమలముల్; బవనుండు జలమ్మునించె; నా
చ్ఛాదనబూనె పక్షులు గుజమ్ముల బత్రములన్; సుధాంశు లా
పైదలి గాగిలించుకొని బాష్పములన్ పయిరాల్చి రాయెడన్.
చెలియరో! యేటికేడ్చెదవు?-చేసినదోసము తప్పునే-మహా
త్ములె కడుచింతనందిరన త్రోయగ నెవ్వరికౌను? సీత యా
జలధికుమారి మిక్కిలి విషాదమునందదె నాథుబాసి-మ
ర్త్యులనగ నెంతయుంచును మయూఖమొకండు స్పృశించె హస్తమున్.
మనుజులకాశ మెందు; వని మానికుమారికలున్ గుమారుల
త్యనుపము మోదమందరొకో?-యంతటికన్నను పీరుమోదముల్
గనెదరె?-సౌఖ్యజీవనమనంగ నెదో యెఱుగంగలేరు పీ
రని యొకయంశుకన్యక తదశ్రుజలమ్ముల జిమ్మె కూరిమిన్.
సుమములదాల్చియున్ బ్రకృతిసుందరముల్ గిరులున్ సరస్సులున్
విమలమతిన్ భజించి యొక వేదనలేక సతమ్మునున్ విరా

మమెగలుగంగ నేచదువో-మాధవుసేవలో-యజ్ఞమో-జప
మ్మొ-మఱియునాటలో-యెదియొ మోదముసన్‌జను గాలమంతయున్.
ధరియింపన్ భుజియింప భూషణములన్‌దాల్పంగ నావాసముల్
విరచింపన్ దరులే యొసంగును మనోవీథిన్ దదన్యమ్ము లె
వ్వరి కేవేళల గూడనుండవు, దలంపన్‌రాదు రోగమ్ము లా
ధరణిన్ భీతియె వారెఱుంగరు మహాధన్యాత్ము లామానవుల్.
ధనముగడింప మీవయసుదాటును-వృద్ధత వచ్చునప్పుడా
యనుభవముల్?-గడించి యొకహర్మ్యమొ, మూల్యము నెన్నరాని భూ
షణములో మీరుగోరెదరు, స్వాంతముప్రీలును దానికేదో నా
శనము గలింగెనేని; యిక సంతసమన్నది యెక్కడున్నదో?
ముందు గడింపులోనె సరిపోవును కాలము మీకు సంతస
మ్మెందు గలుంగు?-కాలమెది?-యెప్పుడు మీరిక నిత్యవస్తువున్
జెందగ గూర్మి యత్నమును జేతురు?-మీరలు నాశపెంచుకొం
చుం దుది దుఃఖవార్ధిబడి శోషిలిపోవుదు రంతియేగదా!
మనుజని జీవితమ్మునకు మానగరానివవేవొ?-వాని నై
నను గను సూక్ష్మమా సమయనష్టముతో నియమించినారుగా
మును మన భారతాదిమునిపుంగవు లెక్కుడు మోదమబ్బగా
గన రది మీరు చింతిలగగాదని యొక్కతెచెప్పెధైర్యమున్.
తనయువివేకమున్ విడిచి దాస్యమె గొప్పయటంచు నెంచు భా
వన విడనాడి నీవిభుడు భారతసంయమినాథమార్గమున్
గొని యనమానమోద మొనగూర్చుత నీకని యామె శీర్షమం
దున గరముంచి యిచ్చెనిక తొయ్యలి వంశవాకంపు దీవనల్.
ఈపరి వచ్చినప్పుడు చెలీ! విభు బోనియకమ్మ మేలిదే
బాపెదమమ్మ వానియెడ బాగుగ నాటుకపోయియున్న యా
పాపపు దాస్యభావన; లపారముదమ్మునగూడు నీకు సం
తాపము పోవునంచొకతె దాని చెవిన్ వచియించియున్‌జనెన్.

పగవకే-యింతకన్నను బాధపెట్టి
వావిదీసుకవత్తుమో వనజనయన!
అనుచు వచియించి యంశుకస్యకలుకొన్ని
తరుణి యరయుచు నుండగ బరువులెత్తె—

అమ్మ! యేమన కతని దాస్యమ్ము బాపి
సంతసముగూర్తునని యంశుసఖియొకర్తు
కౌగిటంజేర్చి ముద్దాడి గారబమున
తన వినిర్మలమాతృభావనను దెల్పె.

# వియ్యము

సామవేదం జానకిరామశర్మగారు

ఐదుగురుబిడ్డలవెనుక పుట్టినదగుటచే తలిదండ్రు లామెకు మిగులప్రేమతో "నిరుపమా" యని పేరు పెట్టిరి. ఈజాతియం దిట్టి మనోహరమైనపే రిదివర కెన్నడును వినరాలేదు. తఱచు దేవతలనామములే వాడబడుచుండెడివి. గణేశుడు, కార్తికుడు, పార్వతి దీని కుదాహరణములు. ఇపుడు నిరుపమాకల్యాణవిషయ మాలోచింపబడుచున్నది. తండ్రియగు రామసుందరు డమితప్రయత్నమొనర్చినను నచ్చిన వరుడు లభించలేదు. తుద కొకజమీందారునియింటి గారాబుపుత్రునకు సంబంధము నిశ్చితమాయెను. జమీందారుని తండ్రితాతల సంపద కొంతలోకొంత నష్టమైనను పేరుప్రతిష్ఠలుమాత్రము నిలచియుండెను. పిల్లవాని తరఫువారిచే పదివేల రూపాయలరొక్కమును తగినంత వరకట్నమును కోరబడెను. రామసుందరు డీవిషయముపై ఆలోచన యొనర్పక సమ్మతించెను. కారణము యిట్టిపిల్లవాని నేవిధముగను చేయిజారి పోనీయరాదని తలచుటయే.

చివరకు రూపాయ లేవిధముగను పోగుకాలేదు. తాకట్టువుంచి, అమ్మి మిక్కిలి ప్రయత్నముచేసినను కూడ ఆరు ఏడువేలరూపాయలు తక్కువాయెను. వివాహపురోజులు దగ్గరకొచ్చుచున్నవి. చివరకు వివాహపురోజుకూడ వచ్చెను. మిక్కిలి హెచ్చువడ్డీపైన మిగిలినరూపాయలనిచ్చుట కొకానొకడు మాట యిచ్చియుండెను. కాని యది మాటరూపముననే యుండిపోయెను. వివాహవేదికపై కీచులాట ప్రారంభమై పెద్ద యల్లరి వ్యాపించెను. రామసుందరుడు జమీందారునితో చేతులుజోడించి యిట్లు చెప్పెను. "శుభకార్యము పూర్తికానిండు; రూపాయలను నేను తప్పక పసూలిత్తును." జమీందారుడువచించెను: "రూపాయలు లేక కుఱ్ఱవాడు వివాహవేదికపైకి రాజాలడు" అని. ఈదుర్ఘటనచే నంతఃపురమందు రోదనముకూడ ప్రారంభమాయెను. ఈ మహదాపదకు మూలకారణమైనయామె వైవాహికవస్త్రములను ధరించి సొమ్ములలంకరించుకొని, మోముపై తిలకముంచుకొని నిశ్శబ్దముగ కూర్చొనియున్నది. కాబోవు శ్వశురవంశముపై నామెకు భక్తి, లేక ప్రేమ బాగుగ నభివృద్ధినొందుచున్నదో లేదో చెప్పజాలము.

ఇంతలో నొకనూతనవార్త పుట్టెను. వరుడు సాహసించి తనతండ్రికి వ్యతిరేకుడాయెను. అతడు తండ్రితో ఇట్లుచెప్పి కూర్చుండెను. "క్రయవిక్రయముల వ్యాపారపుమాటలకు నేను సమ్మతించను. వివాహము చేసుకొనుటకు వచ్చితిని. చేసుకొనియే వెళ్లెదను." తండ్రి దగ్గరనున్నవారితో చెప్పెను. "చూడండి: నేటికుఱ్ఱవాండ్ర ధైర్యము." ఒకరిద్దరు ప్రవీణపురుషులు "శాస్త్రశిక్షణమును, నీతిశిక్షణమును ఇందువలననే జోత్తిగా నశించినది" అని వచించిరి. వర్తమానకాలమందలి శిక్షణకు విషమయఫలమును తన సంతానమందు ప్రత్యక్షముగచూచి జమీందారుడు హతోద్యముడై కూర్చొనెను. వివాహమెటులనో ఉదాసీనముగ ఆనందరహితముగ నాయెను.

అత్తవారింటికి పంపునపుడు తండ్రి నిరుపమను కౌగలించుకొని అశ్రువుల నాపలేకపోయెను. నిరుపమ ప్రశ్నించెను: "వారు నన్ను మరల రానియ్యరా? నాయనా!"

రామసుందరుడు:—ఏల రానీయరు? రావిత్తురమ్మా! నేను నిన్ను తీసుకువత్తునులే.

రామసుందరుడు తఱచు వియ్యంకునింటికి పుత్రికనుగాంచుటకై వెళ్లుచుండెనుగాని అచట నాతనికట్టి గౌరవమునులేదు. నౌకరులు చాకరులుగూడ నీచముగ చూచుచున్నారు. అంతఃపురమందలి బైటనున్న గవాక్షముకడ ఒకరోజున ఐదునిముసములు నిలచిమాటలాడును. లేనిరోజున నూరక మరలివచ్చును. వియ్యంకుని యందిట్టియవమానము సహింపబడజాలదు. రామసుందరు డెటులైనను రూపాయలను పూర్తిజేసియిచ్చుటకు

నిశ్చయించెను. కాని ఇంతకుపూర్వము నెత్తిపైనున్న ఋణభారమే దింపుకొనుట కఠినముగనున్నది. గృహ నిర్వహణవ్యయమే ఎటులనో వెనుక ముందు లాగుటచే నడచుచున్నది. ఐనను ఋణదాతల దృష్టినుండి తొలగుటకు పలువిధముల యత్నించుచుండెను.

ఇచట అత్తవారియింట పుత్రికకు కూర్చొనినను, నిలచినను నిష్ఠురభాషణములు వినబడుచున్నవి. తలిదండ్రుల నిందనువినుచు గదితలుపుమూసుకొని కన్నీళ్ళ ప్రవహింపజేయుటతో నామెకు రోజుగడచుచున్నది. ముఖ్యముగ అత్తగారికసరుట యేవిధముగను అరికట్టబడుటలేదు. ఎవరైనను "అహా! యెంత అందమైనది. కోడలు ముఖముచూచిన సంతోషముజనించును" అన్న అత్తగా రులికిపడి "కాదా! ఎట్టియింటి పిల్ల కట్టి సౌందర్యము" అనును. ఇంతయేల? కోడలి అన్నపానీయములపైకూడ ఎవరును శ్రద్ధతీసుకొనుటలేదు. ఎవరైన నామెపై దయచూపిన అత్తగారు "చాలు. ఇక నెక్కువ తండ్రి రూపాయలన్నిటిని యిచ్చినగాని బిడ్డకు పూర్తిగ గౌరవముండదు" అని పల్కును. కోడలికిచట హక్కులేనట్లు ప్రతిదానియందును ద్యోతకముచేయుచుండును. అందుచే కోపముకూడ చెందుచుండును.

బహుశః పుత్రిక యనుభవించుచున్న అనాదరము, అవమానము తండ్రిచెవులవరకువెళ్లియుండవచ్చును. దీనిచే రామసుందరుడు చివరకు తాను వసించుచున్న ఇల్లుకూడ అమ్ముటకు ప్రయత్నింపసాగెను. కాని పిల్లలకీవిషయము తెలియకుండనే దాచియుంచబడెను. ఏలనన గృహహీనులమైతిమని వారెరిగిన దుఃఖింతురు. ఇల్లు అమ్మి దానినే తిరిగి యద్దెకుతీసుకొనియుండుటకును, తాను బ్రతికియున్నంతవర కీవిషయము పిల్లలకు తెలియకుండునట్లు దాచియుంచుటకును నిశ్చయించుకొనెను. కాని పిల్లల కీవిషయము తెలిసెను. అందరును రామసుందరుని కడకువచ్చి యేడువసాగిరి. విశేషించి పెద్దవారిముగ్గురలో కొందరకు బిడ్డలుగూడనున్నారు. వారి రోదనము మిక్కిలి గంభీరరూపమునుదాల్చి చివరకు గృహమునమ్ముట మాన్పనైచినది. అపుడు రామసుందరుడు కొద్దికొద్ది మొత్తములను హెచ్చువడ్డీకి తీసుకురాసాగెను. తుదకు కుటుంబఖర్చు నడచుటయే కష్టమైపోయెను. తండ్రి నిరుపమకడకు వచ్చినపు డాతని ముఖముగాంచి అంతయు తెలుసుకొనెను. వృద్ధుడగు తండ్రియొక్క నెరసిన కేశములమీదను, నీరసమగు ముఖముపైనను ఎల్లపుడు దైన్యవిచారముల ఛాయ స్పష్టముగ కనుపించసాగెను. కుమార్తెకడ తండ్రి యపరాధియైనపు డాతని పరితాపము దాచియుంచబడగలదా? రామసుందరుడు వియ్యంకుని యనుమతిపై క్షణకాలము మాటలాడునపుడాతనిహృదయ మేవిధముగ వ్యథనొందుచుండెనో అప్పటి యాతని నవ్వుగాంచిన తెలియవచ్చుచుండెను. కేవలము తండ్రియొక్క వ్యథిత హృదయము నోదార్చుటకుగాను పుట్టినింటికేగ నిరుపమ ధీరురాలాయెను. తండ్రియొక్క నీరసమగు మోము గాంచి యామె దూరముగనుండజాలకపోయెను.

ఒకనా డామె తండ్రితోననెను "నాయనగారూ! నన్నింటికి తీసుకొనివెళ్లుడు."

రామ:—"మంచిదమ్మా! అటులనే."

కాని యాతనికట్టి శక్తియులేదు. తమకుమార్తెలపై సాధారణముగ తండ్రులకుండు సహజాధికారము వరున కీయసమ్మతించిన కట్నమునకై తాకట్టుంచబడినది. కాన పుత్రికకడకేగుటకుగూడ నింగుల సంకోచముతో ననుజ్ఞ యాచింపబడుచున్నది. ఒక్కొక్కప్పుడు హతాశుడైనపుడు రెండవమాట మాటలాడుటకుగూడ ఆతనికి నోరాడుటలేదు. కాని పుత్రిక పుట్టినింటికివత్తుననిన తండ్రి పాపమామెను తీసుకొనిరాకుండగ ఎటులుండగలడు? ఇందుచే వియ్యంకుని సమక్షమున కీదరఖాస్తును పంపుటకుపూర్వము రామసుందరు డెట్టి హైన్యము, ఎట్టి అవమానము, ఎంతకష్టమును సహించి మూడువేలరూప్యములను పోగుచేసియుండెనో ఆయితిహాసమును గుప్తపఱచుటయే మంచిది.

రూపాయలనోట్లను రుమాలునందుమూటకట్టి రామసుందరుడు వియ్యంకుని సమక్షమునకేగికూర్చొనెను. మొదట మోముపై చిరునగవునటించుచు బజారువిశేషముల నెత్తెను. "హరికృష్ణునింటిలో పెద్దదొంగతనము జరిగినది. ఆతనియత్నముచే చివరకు పట్టుబడినది. సోదరులగు నవీనమాధవ రాధామాధవు లిరువురిలో విద్యాబుద్ధులందును, స్వభావమందును రాధామాధవు డుత్తముడు. పట్టణమం దొకనూతనజాడ్యము వ్యాపించినది. దానినిగూర్చి జనులు విపరీతముగ చెప్పుకొనుచున్నారు." ఇటుల నుడువుచు చివరకు హుక్కాగొట్టమునావల యుంచి మాటలసందున చెప్పెను. "హహ, బావగారూ! తమకింకను రూపాయలబాకీయుంటిని. వచ్చునప్పుడెల్ల కొంతసొమ్ము తీసుకొనిరాగోరుదును గాని బయలుదేరివచ్చునప్పటి కాసంగతి మరతును. రాను రాను వృద్ధుడనుకూడ అగుచున్నాను." ఇటు లొకదీర్ఘోపన్యాసమిచ్చుచు హృదయశల్యములతో సమానమగు ఆమూడునోట్లను బహునులభముగా బయటపెట్టెను. నోట్లను మూటిని తీసుకొనిచూచి జమీందారుడు వికృతముగ నవ్వుచు పలికెను: "బావగారూ! ఉండనీయుడు నాకివి అవసరములేదు. స్వల్పమునకై హస్తమును మలినమొనర్పగోరుటలేదు." ఇట్టి ఘటనానంతరము కుమార్తెను తీసుకొనివెళ్ళుదునని ఏముఖము పెట్టుకొని అడుగగలడు? కాని రామసుందరుడు బంధుసంకోచమిప్పు డనవసరమని ఎంచెను. హృదయమందలి ఆతీవ్రాఘాతమునకు కొంచెము సేపూరకుండి భిడియమువిడచి బయటపెట్టెను. జమీందారు డెట్టికారణమును నుడువకయే "ఇప్పుడు కాదు" అని జవాబుచెప్పి పనిమీద బయటకేగెను. రామసుందరుడు కుమార్తెకడ కేగకుండనే వణకుచున్న చేతులతో మరల నోట్ల నారుమాలున ముడివైచి మెల్లగ యింటికివచ్చెను. మనస్సునందు "పూర్తిగా రూపాయలను సంపాదించి కుమార్తెపై నిస్సంకోచముగ యధికారమును పొందనిదే వియ్యంకుని యింటికేగ"నని ప్రతిజ్ఞ పట్టెను.

చాలదినములు గడచినవి. నిరుపమ మనుజునిపై మనుజుని పంపుచుండెను గాని తండ్రిదర్శనము లభింపలేదు. చివరకు కోపించి మనుజులనంపుట మానెను. రామసుందరుని మనస్సు వ్యథచెందెను గాని అప్పుడుకూడ వెళ్ళలేదు. ఆశ్వయుజమాసము వచ్చెను. రామసుందరుడు "పూజలకుగాను నేను కుమార్తెను తీసుకొనివత్తును లేనిచో—" పెద్దపెద్ద ప్రతిజ్ఞలొనర్చి కూర్చొనెను.

పంచమి లేక షష్ఠిరోజున మరల రుమాలునందు కొన్నినోట్లనుకట్టి ప్రయాణమాయెను. ఐదేండ్ల ఈడుగల మనుమడువచ్చి "తాతా! నాకు బండికొనుటకు వెళ్ళుచున్నావా?"అనియడిగెను. చాలదినములనుండియు ఆతనికి బండిపై షికారువెళ్ళుటకు కోరికగలదు. కాని అదిఏవిధముగను పూర్తికాలేదు. ఆరేండ్ల మనుమరాలు యేడ్చుచువచ్చి "పూజచేసుకొనుటకు దేవాలయమునకేగుటకు నాకు మంచి పట్టువస్త్రములే"దని చెప్పెను.

రామసుందరుడు తాను వెళ్ళుటనుగూర్చి పొగపీల్చుచు కొంచెముసే పాలోచించెను. జమీందారుని యింటికి పండుగదినములలో సాధారణవస్త్రములధరించి కృపాపాత్రుడగు దరిద్రునివలె వెళ్ళవలెనా? ఈవిషయ మాలోచించి ఆత డొకదీర్ఘనిశ్వాసమును విడచెను. దానిచే యాతని లలాటమందలి రేఖలు స్పష్టముగా చిత్రింపబడుటకన్న ఎట్టిఫలమును కలుగలేదు. దరిద్రముచే పీడింపబడుచున్న తనయింటియందలి క్రందనధ్వని కర్ణములనిండ వృద్ధుడగు రామసుందరుడు వియ్యంకునియింట ప్రవేశించెను.

పూర్వమువలె నౌకరులరొద్ద తాను సలజ్జముగ దృష్టిబరపినట్లుగాక నేడు నిస్సంకోచముగ తనగృహమందు ప్రవేశించినట్లే ప్రవేశించెను. లోపలికేగగా జమీందారు ఇంటిలోలేనట్లు తెలియవచ్చెను. కొంచెముసేపూరక కూర్చొనియుండవలసి వచ్చెను. రామసుందరుడు తొందరనాపలేక కుమార్తెకు కబురంపెను. ఆనందాతిరేకముచే నిరుపమ నయనములనుండియు బొటబొట కన్నీరుగారెను. తండ్రి యేడువసాగెను. పుత్రిక

కూడ రోదన మారంభించెను. ఎవరినోటినుండియు మాట వెలువడలేదు. ఇటుల కొన్ని నిముసములు గడచెను. రామసుందరుడు "నేడు నిన్ను తీసుకొనివెళ్లెదనమ్మా! యిప్పుడేమియు యిబ్బందిలేదు" అనెను.

ఇంతలో రామసుందరుని పెద్దకుమారుడు హరమోహనుడు తనకుమారు లిరువురితో సాహసముగ నింటిలో ప్రవేశించి తండ్రితో "నాయనా! మేము బజారులో ముష్టియెత్తుకొనవలయునా?" అనెను. రామసుందరుడు క్రోధముతో "మీకొరకు నేను నరకకూపమున బడుదునా? మీరు నన్ను సత్యపాలన మొనర్ప నీయరా?" యనెను. రామసుందరుడు గృహము నమ్మివైచెను. పిల్లలకు మొదట ఈవిషయము తెలియకున్నను పిమ్మట తెలియవచ్చెను. దీనివలన తండ్రికి పిల్లలపై చాలకోపమువచ్చెను. కొంత కలహముకూడ సంభవించెను. మనుమడు చేతులుపట్టుకొని మోమెత్తి "తాతా! నాబండి" అని దీనముగపల్కెను. రామసుందరుడు శిరమువంచుకొని నిరుత్తరుడై నిలబడియుండెను. అందుచే బాలుడు నిరుపమవద్దకు పరుగెత్తుకొనివచ్చి "అత్తా! నాకొకబండీ యిప్పించవా?" అని యడిగెను. నిరుపమ అంతయు తెలుసుకొనెను. "నాయనగారూ! మీరొకపైసాయైనను మామగారికిచ్చిన మీకుమార్తె నిక చూడజాలరు. ఇది మీశరీరమును స్పృశించి యొట్టు పెట్టుచున్నాను" అనెను.

రామ:—ఛీ, బిడ్డా! ఇటువంటిమాటలనా పలుకుట? నేను రూపాయలనీయలేకపోయిన నాకగౌరవమును, నీకవమానమును కాదా? అనెను.

నిరుపమ:—అవమానము రూపాయలనిచ్చుటలో గలదు. నీకుమార్తె కింతగౌరవములేదా? రూపాయలున్నంతవఱకు గౌరవముండి, లేనిచో విలువలేనట్టి రూపాయలసంచినగుదునా నేను? వద్దు నాయనా! రూపాయలనిచ్చి నన్నవమానముపాలు సేయకుడు. మరియు మీఅల్లుడుకూడ రూపాయల నాశించుటలేదు.

రామ:—ఐన వీరిక నిన్ను తీసుకొని వెళ్ళనీయరమ్మా!

నిరుపమ:—పంపకున్న నేమిచేతురు? చెప్పుడు?

రామసుందరుడు కంపించుచున్న హస్తములతో నోట్లుకట్టిన యుత్తరీయమును భుజమునవేసుకొని దొంగవలె నెరికంట బడకుండ యింటికేగెను.

కాని రామసుందరుడు ధనమును తెచ్చుటయు, కుమార్తె యిష్టముపై నీయకుండ వెళ్ళుటయు చాటున నుండి సంభాషణలవినిన దాసియొకతె అత్తగారితో చెప్పివైచెను. ఇది విని దాగియున్న అత్తగారి క్రోధము బయటపడెను. నిరుపమ కత్తగారియిల్లు శరశయ్యాసదృశమాయెను. ఒకటి వివాహమైన కొన్నిరోజులకే భర్త డిప్యూటీమేజస్ట్రీటయి దేశాంతరమునందుండెను. రెండవది పితృగృహము వారి నేరిని రానీయకుండుట.

ఈవిధమున నిరుపమకు జబ్బుచేసెను. దీని కత్తగారు సంపూర్ణదోషియని నిశ్చయింప వీలుకాదు. తన శరీరముపై నామె మిగుల నశ్రద్ధవహించియుండెను. కార్తికమాసమున మంచుకురియుదినములలో రాత్రియందయు తలవంపుదిక్కునున్న తలుపు తెఱచుకొని నిద్రించుచున్నది. రాత్రియంతయు నామెపై మంచుపడుచునే యున్నది. అన్నపానీయములకు నియమితకాలము లేదు. దాసీలు అపుడపుడు ప్రాతఃకాలభోజనమును తెచ్చుట గూడ మరచుచుండిరి. ఐన నామె తననోటితో వారికి జ్ఞాపకముచేయుటలేదు. ఈయింటికి తాను దాసి యనియు, గృహయజమానుల దయపై జీవితకాలము వెళ్ళవలెనను భావ మామెలో నాటుకొనెను. అత్తగారి కిట్టి భావముకూడ లేకుండెను. అన్నపానీయములపై నెవరైన శ్రద్ధతీసుకొన్న కసరుచు "భాగ్యవంతుల బిడ్డ కాదా! బీదలయింటి అన్నమేల రుచించును? దినదినమున కాయాకార మెట్లగుచున్నదే? మరింత క్రోధము హెచ్చు పెరుగుచున్నదే!" అనును. వ్యాధి ముదిరినపుడన్నియు దొంగవేషములనెను. చివరకొకనాడు నిరుపమ

అత్తగారితో మిగుల వినయముతో ననెను "తండ్రిగారిని, సోదరులను ఒక్కసారి చూడనీయండి, తల్లి!" అని. అత్తగారు "చాలు. అన్నియు పుట్టినింటికేగుట కనువుగ నేయున్నవి" అనెను.

చెప్పినను ఎవరును నమ్మజాలరు - ఏసంధ్యాసమయమున నిరుపమ కాయాసము హెచ్చెనో నాడే ప్రథమమున డాక్టరామెను చూచెను. అదినమే చికిత్సకు అంతిమదినముకూడ అయెను.

ఇంటి పెద్దకోడలు మరణించెను. చాలహడావిడిగ కర్మకాండలుజరిగినవి. జమీందారున కెట్టి ఖ్యాతి యుండెనో పెద్దకోడలి యగ్నిసంస్కారవిషయమైగూడ యటులనే ప్రసిద్ధికలిగెను. ఇట్టి చందనకాష్ఠముల చితి నేటివరకు ఎవరును చూచియుండరు. శ్రాద్ధముకూడ గృహగౌరవమునకు తగురీతినే యొనర్పబడెను. దీనిచే నాతడు కొంత ఋణస్థుడుకూడ అయెనని తెలియవచ్చెను.

జనులు రామసుందరున కోదార్పుమాటలుగా కుమార్తె కెంతఘనముగ దహనక్రియ గావింపబడియుండెనో ఆవిషయములజెప్పి సరిపెట్టుచుండిరి.

డిప్యూటీ మేజస్ట్రేటువద్దనుండి "నేనన్నియు నిక్కడ సమకూర్చితిని. మీకోడలును శీఘ్రముగ తీసుకొనిరండు" అని తండ్రియగు జమీందారున కుత్తరమువచ్చెను.

జమీందారునిభార్య యుత్తరమువ్రాసెను: "బిడ్డా! నీకొరకై రెండవసంబంధము స్థిరపరుపబడినది. కాన నీవు త్వరగ సెలవుతీసుకొని రావలెను."

ఈమారిరువదివేలరూపాయల రొక్క మప్పటికప్పుడు చేతులలోపడెను. —రవీంద్రుడు.

# "ఫలిత మెల్లవదలి పతితుడయ్యె"

శ్రీమతి దోత్రాప్రగడ రాజ్యరత్నమ్మగారు

వైరాగ్యమంతట వెదజల్లునట్లుగా
  జడలుగట్టుక జోలిబూనినాడు
స్నేహంబునకుగానిసంపదయేలని
  చెలికానికంతయు జేర్చినాడు
కాముకుడనుగాను గానుగాననునట్లు
  కమలాసుతునిగోము గలచినాడు
ఏకపత్నీవ్రతం బెంతేనిఘనమన
  సగముదేహముసతికి జేర్చినాడు
ఇన్నిబాధలంది యీశ్వరుండై నను
జారుడై నచంద్రు స్నేహమునను
వారకాంతగొనుచు వేణిలోనుంచుక
ఫలితమెల్లవదలి పతితుడయ్యె.

# కాంత

చిరుమామిళ్ల శివరామకృష్ణప్రసాదుగారు

ఆకలిబాధచే నల్లాడుబీదల
  నాదరంబునగాంచునట్టిపేర్మి
ఉగ్గుతోసాశీల్యముత్పన్నమానట్లు
  కన్నవారలబెంచగల్గుశక్తి
అశ్లీలవాక్యాల ననుగమింపక సదా
  ఆచితూచినుడువులాడునేర్పు
తేనియల్ జిల్కెడి తెనుగుప్రబంధాళి
  పఠియించినంతోషపడెడుప్రజ్ఞ.
ధవునియెడప్రేమ భక్తి మాధవునియెడను
గల్గి దీనులకొంగుబంగారమగుచు
అఖలసౌభాగ్యములతోడ నలరుచున్న
కాంతయేకద సకలసౌఖ్యప్రదాయి.

# అంటుమామిడి

తల్లావఝ్ఝుల శివశంకరశాస్త్రిగారు

౧

మాయ నవ్వుతూఉంటుంది. నే నేదిఅడిగినా ఇదే జవాబు. ఆమె నాదగ్గరనుంచి వెళ్లిపోతుంటే ఆమె నవ్వులో నాభావముకోసము పరీక్షించేవాణ్ణి. తిరుగుతూఉండే బిచ్చగాడుకూడా-రాత్రివలె ఉన్న పగటివేళ-ఈవిధముగా తనమార్గము వెతుకుతాడా?

జీర్ణకుటీరములో నానివాసము. ఎదురుగానే ఆమెతాలూకు విశాలసౌధముఉన్నది. వాళ్ళమేడపై అంతస్తువరాండాలో చిక్కుతట్టి వేసిఉన్నది. మాయ అప్పుడప్పుడు ఒకటి అర పుల్లవిరుస్తూఉండేదనుకొంటాను. ఒకమూల చిక్కుతట్టి తెరిపిఅయింది. ఆసందులో నుంచి ఒకరోజామెను నిరభ్యంతరముగాచూచాను. మరోనా డామె అక్కడికి వచ్చింది. నేను మళ్ళీచూచాను. ఆమెను గుర్తుపట్టాను; ఆమె నన్ను గుర్తుపట్టింది. అక్కడినుంచీ ఆమె ప్రతిరోజూ కొంతసేపు అక్కడికివచ్చేది. నేను చాలాసేపు కనిపెట్టుకొని ఉండేవాణ్ణి. ప్రతీక్ష ఎన్నడూ నిష్ఫలముకాలేదు.

ఎన్నిసార్లు నేనామెదివ్యరూపముసందర్శిస్తానో అన్నిసార్లు కాస్తోకూస్తో వైచిత్ర్యము కనబడేది. సమ్మోహకరమైన ఆమెహాసము నాకు పేరువలెనే బాగాజ్ఞాపకమున్నది. కాని ఆమె కంఠస్వరము ఎంతకోమలము ఎంతకరుణమునో నాకు జ్ఞాపకములేదు - కాదు కాదు-తెలియదు.

ఆమె కంఠధ్వని వినడానికి చాలా కుతూహలముతో ఉండేవాణ్ణి. కాని అపాషాణ-కాదు-స్వర్ణప్రతిమ ఎన్నడూ పలకనేలేదు. నేను చాలాచాలా ఉపాయాలు పన్నినమీదట ఆమె పెదవులమీద చిరునవ్వు అంకురించేది. మాటమాత్రము వచ్చేదికాదు. విగ్రహము కనబడేది. సంగీతము వినబడేదికాదు. భావము తెలిసింది, భావార్థము బోధపడలేదు. నానేత్రాలు ధన్యమయినవి, కర్ణాలకు తృప్తికలగలేదు. అప్పుడప్పుడు నా కర్ణద్వయము "నీవు చెవిటివాడవు కావుగదా!" అని గుసగుసలాడేది.

౨

జీవితములో అన్నింటికంటె ప్రియమైనవస్తువూ, మనోహరమైన సంఘటనా బాగా జ్ఞాపకముంటవని లోకులంటారు. కాని భయంకరమైన అసంధ్యాకాలము ఈక్షణమువలె జ్ఞాపకమున్నది.

వేసవి సాయంకాలము. తాపతప్తమైన భూమిమీద నీళ్ళుచల్లి నేను వంటచేసుకొంటున్నాను. ఆకస్మికముగా చంద్రోదయమయింది! చిక్కుతట్టిదగ్గర మాయకనబడ్డది. ఆమె మామిడిపండురసము పీలుస్తున్నది. మామిడిపండు మధురము; అంతకంటె వెయ్యిరెట్లు

మధురము ఆమె చిరునవ్వులు! పెదవులమీద ఇంత మాధుర్యమున్నప్పటికీ తాను మామిడి పండు తినడమెందుకో!

మాయ పండుతిని పై తొక్కలు దూరముగా పారవేసింది. తన ఎంగిలి మామిడి తొక్క ఒకటైనా నావంటలో పడితే వంట పాడయిపోతుందని ఆమె భావము; పవిత్రమవుతుందని నాభావము.

మాయ టెంక చీకబోతూఉంటే హఠాత్తుగా జారింది. నావంటసామగ్రిలో అది పడుతుందేమోఅని మాయకు చప్పున స్ఫురించింది. దాన్ని ఆపడానికి ఆమె ముందుకు సాగింది. టెంకతోపాటు మాయకూడా మేడమీదినుంచి కింద పడిపోయింది. విశ్వప్రేమ తతవల్ల ఆమెపడిపోయింది. లోకమా! నీకు మాయ పనికిరాకపోయిందా? ఆమొగ్గ ఇంకా వికసించనైనాలేదే మూఢలోకమా!

టెంక, మాయ - ఇద్దరూ నాయెదట కఠినస్థలముమీద పడ్డారు. నామీద పిడుగు పడ్డది. ఆమె మూర్ఛపోయింది.

చిటికలోనే ఆమె తల్లిదండ్రులక్కడికి పరుగెత్తుకువచ్చారు. విసిరినమీదట మాయ కళ్ళుతెరిచింది. అందరిప్రాణాలూ కుదటపడ్డవి. మాయ పెదవి కదిపింది. నాకు ప్రాణము లేచివచ్చింది. పెదవులు వణుకుతూఉండగా మాయ "ఎంగిలిటెంక కాదు" అన్నది. అటు తర్వాత ఆమెనోట మాటరాలేదు. కళ్ళు మూతలుపడ్డవి. మాయ ఇంకేమీ మాటాడ లేదు. ఆమె కడసారిమాటలు అవే. మాయ శాశ్వతముగా అంతరించింది.

అన్నివైపులనుంచీ "ఎంగిలి టెంకకాదు" అని ప్రతిధ్వని వస్తున్నది. ప్రతి జడపదార్థమూ "ఎంగిలిటెంక కాదు" అని అంటున్నది. ప్రపంచమంతా "ఎంగిలి టెంక కాదు" అంటున్నది.

మాయ మళ్ళీ ఎక్కడాకనబడలేదు. చాలాకాలమువరకూ ఆమె అన్వేషణములో ఇటూఅటూ వెర్రివాడిలాగ తిరుగుతూఉండేవాణ్ణి. ఆమెజాడ ఎక్కడాదొరకలేదు.

ఆకర్షణపదార్థమేమీ లేకపోవడముచేత లోకాన్ని త్యజించి నిర్జనవనములో ఉంటున్నాను. మాయతాలూకు టెంకమాత్రము నాకు తోడై ఉన్నది. మాయ లభించడము కోసము ప్రయత్నించాను. కాని ఆమె లభించలేదు. శాంతికోసము యత్నిస్తే అదీ లభించలేదు.

3

ఒకనాడు నల్లమబ్బు వర్షిస్తున్నది. నేను టెంక భూమిలో నాటినాను. కొద్దిరోజుల కది మొలకెత్తింది. దాన్ని నిరంతరముగాకాపాడినాను. కొన్నాళ్ళ కది విశాలవృక్షమైంది. హఠాత్తుగా ఒక వసంతఋతువులో పూచింది. చిరునవ్వుతో మాయ ప్రత్యక్షమయిందని పించింది. కోకిల దానిమీద విశ్రాంతితీసుకొని కూకూ అనడము మొదలుపెట్టింది. అది

మాయ కంఠధ్వనే అనిపించింది. ప్రతిపువ్వులోనుంచీ పిందె బయులుదేరింది. "ఎంగిలి మామిడికాదు" అని మాయ అన్నట్టుతోచింది.

ఆచెట్టుక్రిందనే నాకుటీరము. ఆచెట్టుమీదనే పిట్టలు గూళ్ళుకట్టుకొని సుఖముగా ఉండనిచ్చాను. ఎండపడి వెళ్ళుతున్న ప్రతిబాటసారినీ చెట్టునీడలో విశ్రాంతితీసుకోమని బలవంతపెట్టేవాణ్ణి.

ప్రతిసంవత్సరమూ మామిడిపళ్ళకాలములో ప్రతిబాటసారికీ ఒక్కొక్కపండు ఇచ్చేవాణ్ణి. వాళ్ళు తినేటప్పుడు ఎంగిలిమామిడి కాదనుకొనేవాణ్ణి. ఏడాదికొకసారి మామిడి పూలగుత్తుల చాటునుంచి మాయ తొంగిచూచి ప్రత్యక్షమయ్యేది. ఆమెను మాయాఅని పిలిచేవాణ్ణి. ఆమె సిగ్గుపడి ఆకుబురఖా బాగా సవరించుకొనేది.

"ఎందుకు మాయా! ఇంతసిగ్గు?" అనేవాణ్ణి. "ఇప్పుడు నాకు వివాహమయింది" అనేది మాయ.

—శ్రీగోవిందవల్లభపంతుగారి హిందీవ్యాసమున కనువాదము.

## ఎడారిలో

శ్రీమతి గొల్లపూడి జయలక్ష్మమ్మగారు

ఏమి? ఏకాకివై యిట్టి తిమిరవీథి
దీనగళమెత్తి యస్ఫుటధ్వనులనిట్టు
ప్రణయభిక్షనుగోరెడు దీనురాలి
వెవరు?

ఏల యీయేకాంతజీవితమ్ము
జీర్ణవస్త్రాలశుష్కించి యొరులులేని
వింతసీమను వసియింతువేలనీవు?
వేశికన్నీటిబిందువు లడ్డులేక
యెన్నినాళ్లయెనో యిట్టులీయెడారి
నీచునింకుచు? నీదుపదమ్ము లీయె
డారియిసుకలోతిరుగగా నేర్చుచెడ్డా?

ఇంతకాలమ్ముయిట్టు లీవింతసీమ
మూగనేత్రాల నేరికై యేగుచుంటి?
విప్పుడై నను లేక మరెప్పుడైన
నీదుజీవన మీయెడ శాంతిగొనున?
ఏరిరూపమ్ముదాచితో యిన్నినాళ్లు
హృదయపేటిక? అతనికై నీదుప్రణయ
గాఃమీవిశాలయెడారి(?) లీనమగుచు
యెన్నినాళ్లయెనో?

భ్రమదేలనీకు?
ఏలయీదీర్ఘపయనమ్ము (?) యిట్టులీయె
డారియిసుకలో తిరుగగా నేరికొరకు?

## మనవి

వక్లమాని అప్పారావుగారు

ఒకచిరుగీతిలోపవు రహోదయనూత్నసుధార్ద్రభావనా
ప్రకటనచాలు నాయెడదపాడును కల్పములుండుదాక, మీ
సికతములందు రిక్తగకృశించు నవాభ్రపుతేనెజల్లు ప్రో
గక కనుమూయునాబ్రతుకు కంఠమునంటిన పాడకుండునా!

గడించినదానికి రెండింతలు గడించడములో బిపినుకిశోరి పేరెక్కుటచే 'వానికేమి? నోటిలో బంగారపు గరిటెతో పుట్టేడు' యని వ్యవహరింపబడుట వాడుకయయ్యెను. ప్రత్యక్షనిదర్శనముగ తాను పుట్టినింట చాలాకాలము వుండలేకపోయెను.

బిపినుకిశోరి ముచ్చట మూటగట్టినట్లుండును; బహుసున్నితుడు; గానవిద్యలో పాడిపంటివాడు, కాని వ్యవహారములో తెలివితేటలు శూన్యము; జగన్నాథరథచక్రములుమాదిరి తన జీవయాత్రలో ఈడ్వబడుచుండెను. తన పుట్టుకతోనే పెట్టిపుట్టబడిన నాపటాటోపజీవితమును నిలుపబెట్టుకొనలేకపోయెను.

రాజచిత్తరంజను తనయాస్తి ఆమండలన్యాయస్థానములో గెలిచినవాడై ఒక ఎమెచ్యూర్ నాటకం కంపెనీ ఏర్పాటుచేయుటకు సద్యుక్తుడైయుండెను. అదృష్టవశాత్తు బిపినుకిశోరియొక్క నిమీలితనయనములు, మనోహరగానము చిత్తరంజనును నాకర్షించుటచే వానియొక్క నాటకంకంపెనీలో నొకసభ్యుడుగ బిపిను ప్రవేశించెను. రాజాచిత్తరంజను బి. ఏ. చదివెను; మితిమీఱియుండలేదు. ధనికులబిడ్డయైనను నియమితస్థలములలో నియమితవేళలందు భుజించి పరుండుచుండెను. కాని బిపినును చూచేటప్పటికి వానిసొగసుయంతయు రాజును యప్రమత్తుచేయుచుండెను; వికాసము రంజిల్లుచుండెను. బిపినుతో మాట్లాడునపుడును, వాని సంగీతములో నిమగ్నుడైనప్పుడును చిత్తరంజనుని భోజనాలు చల్లారుచుండెను; రాత్రి మితిమీఱుచుండెను.

రాణిబసంతకుమారి భర్తమీద భ్రమజెందినపుడు "ఏమిటిది? కోతిమనిషితో చేనా ఎప్పుడు ఆడుకోడము" అని విసుగుకుంటూయుండెడిది. ఎంతశీఘ్రముగ బిపిను తనభర్తనుంచివెడలిపోవునో నంత సుఖముపొందేది రాణి. ఈవిధమైన యసూయతకు రాజు మనమునం దుల్లాసముపొందుచుండెను. రాజు నవ్వి యీభూమిమీద యాడువాండ్రకు ఒక్కటేతెలుసును— వారు ప్రేమించినవారు; ఇంకొకరు ఎలాగుపోయేది వారికి అక్కర లేదు. ఇతరులందు మిక్కిలి గణనాతీతమైన గుణములున్నను నవి వాళ్ళముందర యెడారులే. పెండ్లిసమయమందు పెళ్ళాంచెవులో ఏదోగొణిగే మొగుడుతప్ప ఇతరులెవ్వరు మంచివారుకారు. భోజనానికి భర్త కొంచెము ఆలస్యమయిన ప్రపంచము తిరుగబడుతుంది; యింకొకడికి నోటికి ఒక్కముద్దయైనలేదన్న చెవిటివారు అగుదురు. స్త్రీజాతికి ఇట్టిపక్షపాతముండుట తప్పు యెన్నవలసినను, చిత్తరంజనున కది నవ్వు వచ్చేది. అప్పుడప్పుడు రాజారాణివద్దకూర్చుని బిపినునుగురించి యతిశయోక్తిగస్తుతిస్తుంటే తన పెళ్ళానికి తలకొచ్చిన అరికాలుమంటయును, గద్దించిమాట్లాడుటయును జూచుచు నవ్వుకొనుచుండెను.

ఏదైతే రాజారాణులకు వింతవస్తువయినదో యది బిపినుకు చావుయయ్యెను. ఇంటి నౌకర్లు రాణి మాట్లాడు యాకనికరములేని మాటలనందుకొని బిపినును చాలాసార్లు పస్తుచేయుచుండిరి. వానికి చేయుచుండిన నుపచారములు మానివేసిరి; వానికి మనస్తాపము, నిర్నిద్రమెండుఅయ్యెను. ఒకరోజున రాణి పుటోయను వానితో "ఏరా! నీకు తీరుబాటేలేదా? రోజంతా ఏమిచేస్తున్నావు?" యనియన్నది. "అమ్మా! ఏమి చెయ్యాము? రాజాగారి యాజ్ఞలప్రకారము అబిపినుగారికి సేవచేయుచుంటిమి" యని వాడునత్తెను.

అంత రాణి "ఏం? బిపినుబాబు నీకు నవాబురా? ఇకచాలు" అని గర్జించెను. పుటో ఈమాటలు అందుకొని మఱుచటిదినమునుంచే బిపిను నుద్దేశించడములేదు; అతని భోజనసదుపాయములందు నిర్లక్ష్యముచేయుచుండెను. ఎన్నడైనను నలవాటులేనివాడగుటచే బిపిను తాను తిన్నకంచాలు తోముకొనవలసి వచ్చినపుడు తోముకోలేక తిఱుచుపస్తుయుండెడివాడు. కాని యీసంగతి రాజు కెంతమాత్రము తెలియనీయకూడదను కొనెను. నౌకరుతో తగవులాటకు మనస్సొప్పలేదు. అంతయు మంచిగనే భావించుకొనుచుండెను. ఈవిధ

మున్న రాజుకు ప్రేమానురాగము మెండగుచుండ రాణికి కోపము యమాయత వృద్ధిపొందిపొంది భరింపలేక పోయెను. ఇట్లుండగ "సుభద్రాహరణము" నాటకము వేసిరి. హాలంతయు ప్రేక్షకులతో క్రిక్కిరిసియుండెను. రాజు, "కృష్ణుడు"; బిపిన, "అర్జునుడు" పాత్రలు ధరించిరి. "హా! హా!! ఏమిగానమాధుర్యము, ఏమికళానైపుణ్యము, ఎంతమనోహరముగవున్నది"అను ప్రేక్షకుల హాహారవములు మిన్నుముట్టెను.

ఆటయయిపోయినది; రాజు రాణివద్దకువచ్చి "ఏలాగున్నది?" అని అనెను. "నిశ్చయముగ బిపిన అర్జునునిపాత్ర బలేనేర్పుగనొప్పించినాడు. గొప్పవాళ్ళవిత్తనమది. వర్ణనాతీతముగనున్నది" అని రాణియంటే రాజునవ్వుచు, "మరి నేనెలావున్నాను? నా వేషము అందముగలేదా?"అని యడిగెను. అంత "ఓ! వీనిది యింకోవిషయము"అని యనుచు, బిపినుకిశోరియొక్క నాట్య, గానకళానిపుణతను మెచ్చుకొనుచుండెను.

అటుఉన్నసూర్యు డిటుతిరిగెను; బల్లలుతిరుగబడెను. ప్రేమించినవాడు అనాయతలజెందసాగెను. ఎంతకాలమైన బిపినులోనిమగ్నుడైనరాజు ఇప్పుడు "ఆలోచనలేనివారు బిపినుగురించి యింత స్తుతిగీతము పాడుతారుగదా! వాడిముఖము, పాట ఏమి అందముగనున్నవి"యని యనెను. ఒక్కక్షణంక్రితంవరకు బిపినంటే కొట్టుకుపోయే రాజుకు ఇప్పుడిప్పుడే తెలివితేటలు వచ్చుచున్నవి!

ఆమఅంచటికోజానుంచే బిపినుకు కావలసిన యావత్తుసౌకర్యములు తమంతట తామే వచ్చుచుండెను. "బిపినుబాబును ఇంతవరకు ఏదోసాకర్లతో సమంగానుంచుచున్నాము; అదిచాలాతప్పవని మనకు"అని రాణీ రాజుతోఅనెను. సంకుచితుడై తనమనస్సు చివుక్కుమనునట్లు "హా!"యని ఆప్రసంగమును ఇంకొకదానిలోనికి ఆరాజుమార్చినాడు. "ఈసంవత్సరముతోలకరికి మళ్ళీయింకొకసారి ఈనాటకంవేయాలి" యని రాణి అంటే రాజు వినుపించుకొనెను—వినుపించుకోలేదు.

ఒకనాడు వానిబట్ట సరిగఉంచనందున రాజు పుటీనుద్దేశించి చివాట్లుపెట్టగ "ఏం? బాబూ! అమ్మగారి యాజ్ఞలపై బిపినును సదాయనుసరించుచున్నాము."అని యంటే రాజు అతిచీదరపడి "ఛీ! ఏరా, బిపిను నీకు నవాబురా? చూస్తాను; వాడికంచాలు వాడు కడుక్కోలేడు? వాడిపని వాడు చేసుకోలేడా? ఏమిటిరా వాడిదర్జా?"యని యనెను. ఇదేఊతముగ పుటో నిర్లక్ష్యంచగ బిపిను యథాదౌర్భాగ్యముగనెను.

రాణి బిపినుపాటలు బహుమెచ్చుకొనుచుండెను. రుచిగఉన్నవి. లాభముకోసము చెప్పడముకాదు. సాయంసమయమందు రాజు, బిపినులు సంగీతముపాడుచుంటే రాణి ప్రక్కగది తెరగుండవిని సంతోషించెడిది. ఇప్పుడు రాజు నియమితవేళలందు భుజించుచుండెను. సాయంకాలవినోదములు విరమించెను.

జమీందారి వ్యవహారాలు రాజుమధ్యాహ్నపువేళ చూచుకొనుచుండెను. ఒకరోజున వాని జనానాకు త్వరగవెళ్ళగ తనభార్య ఏదోచదువుచున్నట్లు జూచెను. "ఏమిటి?"అని అడిగేటప్పటికి రాణికొంచెము వెనుకకుతగ్గింది కాని "బిపిను పాటలుకొన్ని నేనుచదువుకుంటూయున్నాను. హఠాత్తుగ సంగీతముమీదమీకు దృష్టిమాంద్యమయినది"యని తక్షణమే జవాబిచ్చెను. పాపము! ఆమెయేగదా రాజుయొక్కశ్రద్ధ పాడుచేసినది. తెల్లవాఱినది; రాజు బిపినును సుద్యోగమునుండి మాన్పించెను.—ఎక్కడికిపోవును? ఏమిచేయును? ఏమీఆలోచనలేదు. బిపినుకు ఇదివక్కటేనావిచారము. రాజు తన గాఢస్నేహితుడే! జీతం డబ్బులు గురించికాదుకాని రాజుయెడలకుదిరిన ప్రేమవల్లనే వానికి సేవచేసెను. ఎంత దీర్ఘాలోచనచేసినను తనను లేవగొట్టుటకు కారణంతెలియడములేదు. అంతాక్రొత్త! "కర్మ!; అంతానాకర్మ!!" యని బిపిను యనుకొనెను. ఒక్క దీర్ఘనిశ్వాసమువిడచి, తనవాద్యమునుబుచ్చుకొని, పుటీచేతిలో రెండుపైసాలుపెట్టి, వెళ్లిపోయేడు—ఎక్కడకో వెళ్ళిపోయేడు; "స్నేహితుడా!" యనిపిలువని యావిశ్వప్రపంచములోనికి.

—రవీంద్రుడు.

# రవీంద్రుని పద్యపుష్పములు

శ్రీ ంకే బాలకృష్ణమూర్తిగారు

## తులసిదాసు

ఏకతమ గంగయొడ్డున నేగుచుండి
తులసిదాసు స్మశానభూములనుగాంచె
పెండ్లికొమరిత వైభవవిభవమొప్ప
మృతవిభుని చెంత గూర్చున్న సతి నొకర్తు.
తులసిదాసునుగని యామె నిలువఁబడుచు
వందనమొసర్చియనె-"స్వామి! స్వర్గమునకు
భర్తతో నేగ దీవించిపంపరయ్య!"
అనిన నిట్లనె నాతఁడు "తనయ! యేల
ఇంతతొందర స్వర్లోక మేగనీకు?"
"స్వర్గలోకముగాదు నా వాంఛితంబు
కాని నాభర్తయే నాకు కావలయును."
పొలతిపలుకుల నాలించి తులసిదాసు
చిఱునగవునవ్వి యిట్లనె "తరుణి! నీవు
వెడలుమింటికి వేగ నీవిభుని మఱల
నెలదినంబులలో పొందఁగలవు నిజము."
సదనమునుచేరె నాసతి సంతసమున-
అహరహంబును తులసిదాసామె కాసి
విదితవైరాగ్యవిజ్ఞానవిద్యగఱపి
యతివహృదయము ప్రేమమయమ్మొనర్చె.
నెలదినంబులగడువులోపలనె యామె
కిరుగుపొరుగునఁగల సతులరుగుదెంచి
"సుదతిరో! కనుగొంటె నీహృదయవిభుని?"
యనుచుఁ బ్రశ్నింప "కనుఁగొంటి" నంచునామె
హాసితయై పల్కె-"నెచటనున్నా?" డటంచు
నాత్రమున వారలందరు నడుగనిట్లు
బదులుచెప్పె వితంతువు వారిఁగాంచి-
"ఐక్యమున్ బొందె నాతోడ సతేఁడు నాఁడు
హృదయసీమనె డా వసియించునెపుడు."

## ౨

### ఉపగుప్త

మొఱఁగె దీవ్వెలుఁ దల్పులు మూతబడియె
కాఱుమొగులలఁ జొచ్చె నక్షత్రరాజి
కూర్కె మధురాపురముకోట గోడకెలన
బౌద్ధుఁ డుపగుప్త నాఁబడు పడుచువాఁడు.
ఎవరిపదము వి-నూపురరవమెసంగ
నతనియెదఁ సోకె? గనువిచ్చియచ్చెరువునఁ
గరమునం దివ్వెఁబూనిన తరుణిఁగాంచె.
భవ్యభూషణములఁదాల్చి పట్టునీలి
వలుదపుటముఁగట్టి జవ్వనపుకైపు
దండడింపఁగ నవ్వారతరుణిగాంచె
నాజగన్మోహనాంగు దీపార్చికలన.
"తరుణయతిరాజ! క్షమియించుతప్పిదమును
రమ్ము నాయింటి కిటు ధూళిగ్రమ్మియుండు
కటికఱానేల తగుశయ్య కాదునీకు"
అనఁగ నయ్యతి బదులిట్టులనియె: "నతివ!
పొమ్మిపుడు; వత్తుఁ, గాలపక్వమ్ముగాఁగ."
అంతఁ బకబకనవ్వెనా నాకసమున
మబ్బులఁఱుములు మెఱుములు బొబ్బరిల్లె
జడిగొనఁ దుపాను పుడమి దండడిగొనంగ
గాలిఁగంపించు కళికనాఁ గలఁగె కాంత.

* * *

పూవుగుత్తులవ్రేగున మొగ్గతిలిన
కొమ్మలిటునటు దారిని గ్రమ్మికొనియె
వినఁగనయ్యె నింపులుగుల్కు వేణురవము
తెమ్మెరల విద్దెమాడుచు తెఱలిరాఁగ.
ప్రజ యడవికేగ నామని పండువులకు
నిర్జనపురాన పండువెన్నెలలుగురిసె

భిక్షువొంటరిజనుచుండె వీథినొకఁడు
మావిఁగల కోయిలలుపాడె మధురగీతి
పురిగవనుదాటి యుపగుప్త బురుజుదరిసె.
స్ఫోటకమ్మున మేనెల్ల పుండ్లురేగి
పురమునకు వెలియై దిక్కుమొక్కులేక
వందురుచునున్న దెవ్వ రీయభాగ్యజీవి?
జాలి యతి రోగిపజ్జను జతికిలవడి
తచ్ఛిరమ్మును తనయంకతలముసేర్చి
తడుపుచున్నీటఁ బెదవులు నొడలనెల్ల
నల్లనన్ మందురాచుచుఁ దెల్లవార్చె.
"దీనబాంధవ! యెవరవో తెలుపఁగదవె?"
అనిన శాంతత నుపగుప్త యనియెనిట్లు
"పక్వమైనది కాలమిప్పటికిఁ గాన
నరుగుదెంచితి నమ్మ! నాఁడనినయట్లు!"

## పుట్టా వీరమాంబ

శ్రీమతి కొరప్రోలు వేంకటరంగమ్మగారు

ఈమె నివాసస్థానము పెద్దాపురంతాలూకాలోని తాఘూరుగ్రామము. కమ్మకులమునందు మార్ని వెంకన్నగారికి జన్మించెను. ఈమెను బాల్యమునందే పుట్టా బాలరాజునకిచ్చి వివాహమొనర్చిరి. ఈమెకు యౌవనము ప్రాప్తించిన కొలదికాలముననే బాలరాజు పరలోకగతుఁడాయెను. పిమ్మట వీరమాంబ తనతమ్ములిరువురివద్ద నివసింపుచు బ్రహ్మచర్యము నవలంబించి కాశీరామేశ్వరము మొదలైనతీర్థయాత్రలుసేవించి పుణ్యకార్యముల నిర్వర్తింపుచుండ దైవనియోగమున 1927-వ సంవత్సరమున రాజమండ్రిలోగల వీరభద్రపురమున అనాథలగు స్త్రీలపాలిటి కల్పతరువని ప్రసిద్ధివహించిన శ్రీ సాధుమాతయొక్క సంఘమును జూచు భాగ్యము లభించెను. అంత నచ్చటి సత్యనిష్ఠ, సర్వసమత్వము, నియమవ్రతానుష్ఠానము నిరత, కర్తవ్యతాప్రబోధము మొదలైనవి హృదయము నాకర్షింప నిట్టిసంఘమును మరియొకదాని నేర్పరచుటకై తాఘూరుగ్రామమునం దొకమఠమును కట్టించి శ్రీప్రమోదసంవత్సర శ్రావణపూర్ణిమయందు ప్రతిష్ఠనొనర్చి రాజమండ్రి సాధుసంఘమునందలి 'మీరాబాయి'యను సాధువును దానికధిష్ఠాతగానొనర్చి అనాథస్త్రీలకు అహింసామార్గమును నియమనిష్ఠానుష్ఠానములను బోధింపప్రారంభించెను. ఇట్లుసార్థకమగు కాలక్షేపముజరుగుచుండ 'సుకృతీగితాయు'వను సామెత యదార్థముగా వీరమాంబ పరమపదించెను. ఈమె తన అవసానకాలమున అనాథస్త్రీసంఘసంరక్షణకై వరిపంటపొలమునాలుగుయకరములున్నూ కొంతరొక్కమున్నూ సమర్పించి సర్వేశ్వరదత్తమగు మానవదేహమును సార్థకమొనర్చిస్వర్గసౌఖ్యమునకై వెడలెను.

ఇమ్మహితాఘూర్పురమ్మునగల మేటికమ్మవంశమ్మున గల్గినావు
తీర్థయాత్రలుజేసి దేహదోషమువాసి పరమపవిత్రవై బరగినావు
కామభోగములకుగాక నీద్రవ్యంబు సద్వినియోగంబుసల్పినావు
దీనజనార్తినిదీర్పంగ నెమ్మదినెంచి మఠంబు గల్పించినావు

కులమునకువన్నెవాసియు గలుగుచుండ
తమ్ములిద్దరు నీయాజ్ఞతలనుదాల్చి
సాధువులమానసంబులు మోదమొంద
ధీరమతినొప్పితమ్మ యోవీరమాంబ!

# వేదకాలము: భారత నారీమణులు

శ్రీమతి జి. సీతాలక్ష్మీకన్యగారు

ఋగ్వేదకాలమునందు హిందూస్త్రీ మొట్టమొదట కన్యగను, తదుపరి భార్యగను, పిమ్మట తల్లిగను త్రయీధర్మమును నిర్వహించుచు గృహలక్ష్మిగ వెలయుచున్నది.

కన్యగనున్న కాలమందు పుత్రునివలె తలిదండ్రులఆజ్ఞకు లోబడి విద్యాభ్యాసమొనర్చుచుండుటయు, తల్లికి గృహకృత్యములందు సాహాయ్యమొనర్చుటయు మొదలైనపనులు నిర్వర్తించుచుండెడిది. యౌవనవతి యగుటతోడనే తనప్రియుని వరించుటయందు స్వేచ్ఛనుకలిగియుండెడిది. స్త్రీపురుషుల కిర్వురకును సమాన హక్కు లీవిషయమునయున్నట్లు గన్పట్టుచున్నది.

ఋగ్వేదము X 85–లో సోముడు కన్యగానున్న సూర్యను వరించినట్లు కన్పట్టుచున్నది. ఈమె (సవితారః) సూర్యునిపుత్రిక. సూర్య స్వతంత్రించి సమ్మతించెను. వెంటనే సోము నింటికిగొంపోబడి యథావిధిని పెండ్లాడబడెను.

ఋగ్వేదమునందు (36 లో) చెప్పబడిన ప్రమాణము నేటివరకును ప్రతిహిందూవివాహమునందును వచించబడుచున్నది. "అర్యముడు, భాగుడు, సవితారుడు, పరమోది మొదలగు వేదదేవతలు నిన్ను నాకొసంగిరి. నీవు నాఅర్ధాంగివై సౌఖ్యమునొసంగుచు, నాకష్టసుఖములలోపాల్గొనుచు నాతోవృద్ధాప్యమును నీవు కూడ చెందుదువుగాక. దీనికై నిన్ను నే పాణిగ్రహణమొనర్చుకొనుచున్నాను."

భర్తఇంటికి గృహప్రవేశమునకొచ్చినపుడు "సౌభాగ్యముచేతను, సంతానముచేతను, నీవు వృద్ధిపొందుదువుగాక. ఈగృహమునకు లక్ష్మివౌదువుగాక. నీభర్తతో నీవు చిరకాలము కాపురముచేయుదువుగాక. ఇంటిని రాణివలె నేలుదువుగాక. కుమార్ళను, మనుమలనుచూచుకొనుచు చిరకాల మానందించెదవుగాక" మఱియు, ముందుగ భర్త ఈవిధముగ భార్యనుదీవించును. "ప్రజాపతి మనకు బిడ్డలను, మనుమలనొసంగుగాక. అర్యముడు మనకు చిరకాలము ధనమొసంగుగాక. నీభర్తగృహము ప్రవేశించుము. నీగృహమున ధనధాన్యపశుగణంబులు వృద్ధిజెందుగాక. అచంచలమును, నిర్మలమునగు భర్తృప్రేమ నిన్నలముకొనుగాక. సాధుస్వభావము, సర్వలక్షణలక్షణోపేతమగుసుందరముఖారవిందము నీయందు మూర్తీభవించుగాక. భూతదయయు, సాధ్వీలక్షణములు, దైవభక్తియు నిన్ను విడువకుండుగాక."

పైవిషయములననుసరించి మనము కొన్నిసారాంశముల గ్రహింపవగును.

వేదకాలమునందు స్త్రీపురుషులు యుక్తవయస్సునందు ఒకరినొకరు ప్రేమించుకొనుటయు తమయిచ్ఛవచ్చినప్రియుని వరించుటయు, భార్యాభర్తలనెన్నుకొనుటలో స్త్రీపురుషులకిర్వురకును సమానస్వాతంత్ర్యము కలదనియు విశదమగుచున్నది. అతిబాల్యవివాహములులేవు. భర్త, భార్యకు ఇంటియందు సర్వహక్కుల నొసంగి ఆమెను గృహలక్ష్మిగనొనర్చుచున్నాడు. భర్తయొక్క తలిదండ్రులు, అక్కచెల్లెండ్రుఅందరుకలసి ఒకఇంటియందేకాపురమున్నను, భార్యయె గృహిణి. ఆమెయె సర్వాధికారమువహించి ఇల్లు దిద్దుచుండును. 'సత్సంతానసౌభాగ్యసుపుత్రాఫలావాప్తి'యె వివాహముయొక్క పరమావధి. భర్తకు సర్వసౌఖ్యములనొనగూర్చుటయు, దైవభక్తిగలిగియుండుటయు, సంతానమునుపోషించి వృద్ధిగావించుటయు, ఇల్లుదిద్ది దారిద్ర్యపిశాచమును కుటుంబమును చేరనీయకుండుటయు హిందూస్త్రీధర్మములు.

భర్తకు విధేయురాలిగానుండెదనని ప్రత్యేకముగ (క్రైస్తవవివాహములరీతిని) ప్రత్యేకప్రమాణము చేయవలసినఅగత్యము గన్పట్టదు. సహధర్మచారిణిగానుండుట హిందూయువతి విధి లేక హక్కు.

హిందూసంఘమున ఏకపత్నీత్వము ముఖ్యమైనవిషయము. అగ్రజాతులలో నక్కడక్కడ బహుపత్నీత్వము సకృతుగ గన్పట్టుచున్నది. కాని వేదకాలమున ఒకస్త్రీని పలువురు పెండ్లాడుట (ఒకకాలమందే ఒకస్త్రీకి పెక్కుభర్తలుండుట) గన్పట్టదు.

వ్యభిచారము ప్రతియుగమునను, ప్రతిదేశమునందును దోషముగ పరిగణింపబడుచున్నది. ఇది భార్యాభర్తల కిరువురకును సమమె. వేదకాలమునందు భారతదేశమున హిందూజాతియందు వ్యభిచారము దోషముగ నెంచబడినదన్న ఆశ్చర్యమేమి?

వేదకాలమున భర్తఆస్తిపైన భార్యకు సంపూర్ణహక్కు అనగా (ఇంకొకరికి దానమిచ్చుటకు, అమ్ముటకు) హక్కుకలదాఅనువిషయము సంశయాస్పదము. కాని స్త్రీకి, స్త్రీధనమందు అనగా, పుట్టినింటివారిచ్చినసొత్తునందు వివాహకాలమునందు భర్తఇచ్చినసొమ్ములందు (ఆభరణములందు) సంపూర్ణమైన హక్కు కలదు. ఆమె యిచ్చవచ్చినరీతిని చేసికొనవచ్చును.

భార్య వేదసంబంధమైనవిధులందు భర్తతో సమానభాగముకలిగియున్నది. భార్య చెంతలేనిది యజ్ఞయాగాదిక్రతువులు సాగనేరవు. 'పతి' యజమాని, 'పత్ని' యజమానురాలు; ఈరెండుపదములును భార్యాభర్తలకిరువురకును గార్హస్థ్యధర్మమున సమానస్థానమిచ్చుచున్నవి.

భార్యమరణించిన పురుషుడెట్లు వివాహమునకర్హుడో, పతివిహీనయు (Widow) వాంఛకలిగిన తిరిగి వివాహమాడవచ్చును. అథర్వణవేదమున కొన్నిచోట్ల సహగమనాచారముగన్పించినను ఋగ్వేదకాలమున సహగమనము ఆచారముగనున్నట్లు కనుపించదు.

స్త్రీలు విద్యాభ్యాసమొనర్పరాదని వేదములు కట్టడిచేయలేదు. జ్ఞానోపార్జన స్త్రీలకు విధ్యుక్తముగ చెప్పబడినది. వేదకాలమున స్త్రీలు విశేషజ్ఞానమార్జించి గొప్పఉపాధ్యాయినులుగను, కవయిత్రులుగను జ్ఞానమును వెదఁజల్లిరి. వేదాంతచర్చలయందు పాల్గొనిరి. గార్గి, మైత్రేయి లోనుగాగలస్త్రీరత్నములు వారి విజ్ఞానకాంతులను లోకమున ప్రసరింపజేసిరి.

పైవిషయములననుసరించి వేదకాలమున భారతమహిళామణులెట్టి ఔన్నత్యదశయందుండిరో మనము సంగ్రహముగ గ్రహింపవగును. —దివంగత శ్రీయుత లజపతిరాయిగారి భావములననుసరించి.

# కోర్కెతీఱఁగ నిన్ను నేఁగొలుతు నెటుల?

శ్రీమతి బేతా సీతమాంబగారు

నిర్మలాంభఃకణంబుల నీదుపాద
పంకజంబుల నభిషేక పఱతుననిన
పూనినీచెంత నీరయిపోవు నవియు,
పలుసుమంబులచేఁబూజ సలుపుదనిన
నవియుఁగనుగంది నీదరి నవసిచనును,
గంధలేపనములకై నేఁ గడఁగుదనిన
నుండబో దాపరీమళంబండస్థిరత,
భక్ష్యభోజ్యాదులనుఁ దృప్తిఁబరతుననిన
నీకులేనట్టిదేది యీలోకమందు,
తిహాతహాలికేల మన్మనం బహరహంబు
నీలసన్మూర్తిపై నిజ నిశ్చలంబు
గానిదీమది అయ్యయొ! కాన నఱయఁ
జంచలముకానిదొక్కటీజగతియందు
కానఁగారాదు మచ్చున కేమిచూడ
మాధవా! ఓ రమాధవా! మనుచుకొఱకు
కోర్కెతీఱఁగ నిన్ను నేఁగొలుతునెటుల?

# కీ. శే. దరిశి అన్నపూర్ణమ్మ

కో. మా. వేంకటస్వామి గుప్త గారు

పిన్నటనాటినుండి గుణవిశ్రుతసాధ్వని నన్నపూర్ణమన్
దెన్నఁగ నేనెఱింగితి; నదేపనిగాఁ బరమోల్లసద్గుణం
బున్నతిఁ గొప్పనొప్పుచుఁ బరోపకృతిం బొనరించునామె
యాయువున్న వునేఁడు బిడ్డల నిజాధిపువీడి దివిం చనెంగటా.

పెనిమిటియందుర క్తియును, బెద్దలయందునుభ క్తియున్, గళా
కనుదురుస క్తియున్, గృహపుగార్యములందగుయు క్తి, ము క్తిక
న్యను జెలిగాఁగొనక మృదులసాదరసూ క్తి చెలంగునట్టి మే
ల్వనితకు నన్నపూర్ణమ్మకుఁ బాటిలనౌనె యకాలమృత్యువున్.

ఏదాడనఁగోదాడని
వాదాడుచు భర్తతోడఁ బడియుండెడిదు
ర్మేదురతామతియుతవని
తాధీశులు నినుగనిరహీనందుదురమ్మా!

ఉన్నన్నాళ్లు నధీశుసేవనము ప్రాజ్ఞోత్తంసులౌనౌననన్
సన్నాహంబునఁజేసి, దేశహితులెన్నన్ దేశసేవావిలా
సౌన్నత్యంబువహించి సాంఘికశుభోద్యద్వృద్ధికై పాటు ల
న్నన్నా! నాఁబడినావు పావకపరీక్షావేదనన్నాడు నేఁ
డన్నుల్ మిన్నయనంగ జెందితివి ధన్యత్వంబు నీదేసుమీ.

తనరఁగ దర్శివంశము, బదంపడిరొట్టకలన్వయంబు, వై
శ్యనికరమున్, మఱిన్, యమదిశాగతభూమియు, నెంతయేనిఁ బా
వనతఁగడించెనమ్మరో! ప్రభామహితంబు భవచ్చరిత్ర, మే
వనితకు మేలిబంతియయి పర్వదు నీకత యన్నపూర్ణమా!

వీఁకంబొల్చు బలారిపట్టణమెటన్? విజ్ఞుఁడు శ్రీదర్శిసు
శ్రీకప్రాకటవంశ్యుఁ డెక్కడ? యిటుల్ శ్రీనాయకుండెంతయున్
నీకున్నీపతికింఘటించి, మఱియున్ దేశంబునం దెల్లచో!
నేకప్రక్రియ నీకుఁ జేర్మిఁగొలిపెన్; నేడట్టులే యాతండెం
తో క్తిరిం భువి, శాంతినాకమున నిన్మోదించు; నోసాధ్వరో!

# శిశువు

ఆలూరు రామచంద్రయ్యగారు

శిశువునంటి అధికారి మరియొకడుండబోడు. అతనిపాలన కందరును లొంగవలసినదే. ఇంద్రభవనము లందున్నను పూరిగుడిసెలందున్నను అతనికొక్కటే. మర్యాదలు పాటింపడు. పగలు రాత్రిగను, రాత్రి పగలు గను చేయగలడు. ఏడ్చినా యేమియేమని పిన్నలు మొదలు పెద్దలవర కాతనిదరి జేరవలసినదే. కారణము అతని అసహాయత. బిడ్డలవలన తలిదండ్రులకు సంతోషము కలదు. బిడ్డలు దీర్ఘాయుష్మంతులుగను, సుగుణసంపద గలవారుగనుండుటకు తలిదండ్రులు బాలపోషణమర్మముల నెఱింగియుండవలెను. మాతృప్రేమ అసమానమైనది. బిడ్డ కేదైన జబ్బుచేసిన తల్లియొక్క విచారమునకు మేరయేలేదు.

శిశువుయొక్క ఆహారపానీయములను జాగ్రతగ గమనించవలెను. స్నానము, శుభ్రతలనుగూర్చి శ్రద్ధ తీసికొనవలెను. శిశువు యేడ్చిన మంచిది. మితముగ నేడ్చుచో ఊపిరితిత్తులు పెద్దవగును. అజీర్ణమువలన నైతము బిడ్డలు రోదనచేయుటగలదు. నిదురపట్టదు. శిశువు జనించగనే దాది పత్తితోగాని మరి యేదైన మెత్తనివస్తువుతోగాని దానికండ్లను తుడుచును. ఇందువలన కండ్లయందుండు మసక తొలగును. పిమ్మట బిడ్డను గోరువెచ్చనినీట సబ్బుతో కడిగి, బొడ్డుగమనించి, పాలుత్రాగుటకై తల్లివద్ద పరుండబెట్టవలెను.

శిశువులకు పాలిచ్చుట తల్లివిధి. అది ఎంత కష్టమైనపనిగతోచినను చేసియేతీరవలెను. స్తన్యమే శిశువులకు ముఖ్యమైన ఆహారము. కొందరు నీటుకత్తెలు తమయందము చెడిపోవునని దాదులచేత పాలిప్పించుచు పట్లువేసుకొని పాల నిగిరించుకొందురు. ఇది మిక్కిలి చెడ్డపని. పిల్లలకు పాలీయక సంసారసుఖములందీదు వారు యెడతెగక కాన్పులుకల్గి నీరసింతురు. స్తన్యముచేత వ్యాధితప్పును, తృప్తికలుగును, బలము చేకూరును. తల్లి బలహీనురాలైయుండి కొంత విశ్రాంతితీసుకొనవలసియుండిన పక్షమున ప్రసవించిన రెండు గంటలపిమ్మట గోరువెచ్చని నీటిలో చక్కెరకలిపి శిశువు కివ్వవచ్చును. ఇట్లే నియమితకాలములం దిచ్చుచుండవలెను. పాలిచ్చునపుడు బిడ్డను ప్రక్కగ పరుండబెట్టుకొనవలెనుగాని వెల్లకిల బరుండి స్తన్యమీయరాదు. బిడ్డలకు ఎన్నిసారులు పాలివ్వవలసినది తల్లిపై నాధారపడినది. పుట్టిననెలయందు ఆకలికలిగినపుడెల్ల శిశువు రోదనచేయును. రెండుమూడుగంటలకొకసారి ఆహారముకోరును. ఒక్కొక్కసారి త్రాగుపాలు కొద్దియైనను అడుగడుగుకు శిశువు పాలు త్రాగకోరును. ఆకోర్కెను నెరవేర్పవలెను.

పాలదాది నేర్పరచినయెడల జాగరూకత వహింపవలెను. 25 ఏండ్లలోపుగనుండువదియును ఆరోగ్యవతియుగ నుండవలెను. దాది వ్యాధిగ్రస్తురాలుగ నుండరాదు. పాలు పుష్కలముగ నుండవలెను. పాలు త్రాగునపుడు తటాలున లాగి బిడ్డనోటిని పరీక్షించిన పాలువచ్చునదియు లేనిదియు తెలియును. పాలు నీలము కలిసిన తెలుపురంగుకల్గి తేలికగనుండవలెను. చనుమొనలు పుండుపడిగాని కఠినముగగాని నుండరాదు. ముట్లగుచుండు దాదియు, కోపిష్ఠియగు దాదియు వర్జనీయులు. దాది నింటనేయుంచుకొనవలెను. లేనిచో అది తనకిష్టమగు ఆహారము భుజించును. ఆపాలుత్రాగుటచే బిడ్డకు చెరుపుకలుగును.

స్తన్యమిచ్చు తల్లి అజీర్ణపదార్థములను, అత్యుష్ణపదార్థములను భుజింపరాదు. మలబద్ధకముగనుండిన తల్లి కొంత పచ్చిఆముదము పుచ్చుకొనవచ్చును. సామాన్యగృహకార్యములను స్త్రీలు గమనింపవచ్చును. కూర్చుండి కదలక సోమరులుగనుండు స్త్రీల స్తన్యము ఆరోగ్యకరముగాదు. అలసియుండునపుడు పాలు వేడిగ నుండునుగాన అపుడు పాలివ్వరాదు. అట్లుచేసిన బిడ్డకు వ్యాధికలుగును. ముట్లు ఆరంభించినవెనుకను, గర్భోత్పత్తియైనవెనుకను స్తన్యమివ్వరాదు. ఇచ్చిన శిశువునకు జబ్బును, తల్లికి గర్భస్రావమును కలుగును. స్తన్య

మిచ్చు తల్లికి అకస్మాత్తుగ పాలుతగ్గిన గర్భముధరించినదని యెంచనగును. తల్లికి జ్వరమువచ్చినపుడు పాలివ్వరాదు.

గాడిదపాలు, మేకపాలు యించుమించుగ మనుష్య స్తన్యము పోలియుండునుగాన వాటి నివ్వవచ్చునని వైద్యులందురుగాని ఆవుపాలే శ్రేష్ఠము. శుభ్రమైన పాత్రలందు అపుడుపిండిన పాలనుదెచ్చి సమభాగమునీరు కలిపి కాచి కొంచము తెల్లచక్కెర, చిన్నఉప్పుగడ్డ చేర్చి గోరువెచ్చగ చల్లారనిచ్చి యివ్వవలెను. ఇది మనుష్య స్తన్యమును బోలియుండును. ఉప్పుచేరియుండుటచే జీర్ణశక్తికలుగును. మలిపురుగులు పుట్టవు. పాలబుడ్లను ఉపయోగించుట మంచిది. ఏలననగా పాలబుడ్డీలవలన స్తన్యపానము చేసినట్లే తృప్తిచెందుటయేగాక వారి నోటిఉమ్మి పాలతో కలిపి జీర్ణమగును. పాలబుడ్లు శుభ్రముగనుండవలెను. అందు పాలు చాలకాల ముంచరాదు. ఒకసారి బిడ్డ యెంతపాలుత్రాగునో అంతేవుంచి మరల వేడినీటకడిగి ఆరబెట్టుట మంచిది. ఇట్లు చేయనిచో పాలుచెడి బిడ్డకు అజీర్తివిరేచనములు కలుగును. రెండుపాలుబుడ్లు ఉంచుకొని మార్చి మార్చివాడుట మంచిది. నిద్రపోవుబిడ్డనులేపి పాలివ్వనక్కరలేదు. మొదట రెండునెలలవరకు పగలు 5, 6 సార్లును; రాత్రి 2, 3 సార్లును; పోనుపోను 3, 4 సార్లు పగలును; 1, 2 సార్లు రాత్రులందు నివ్వవలెను. ఏడాదివెనుక స్తన్యపానమువలన బలముచాలదుగాన ఆవుపాలు, జీర్ణమగుఅన్నము తినిపించవలెను. తల్లి బిడ్డకు స్తన్యమిచ్చుకాలమున సత్తువకల్గుఆహారము భుజించవలెను. మంచిపాలుత్రాగవలెను. మత్తుపదార్థములను భుజించరాదు. సాధారణపథ్యముగల ఆహారము సరిపడనిచో వైద్యుని సలహాపై వేరెదియైన ఆహారము వాడవలెను. మూడుగ్రెయినులు ఫాస్ఫేట్ ఆఫ్ లైమ్ Phosphate of lime ను ఆహారములో కలిపితీసుకొన్న మాతాశిశువులకు మేలుచేకూరును. శిశువుఎముకలకు కండరములకు బలమును, దేహమున కారోగ్యమునుకల్గును. రెండుమూడుసంవత్సరములువచ్చువరకు పాలిచ్చుటమంచిదికాదు. అందువలన బిడ్డకు మంకుతనమును, తల్లికి ఆరోగ్యభంగముకల్గును. కఠినపదార్థములు, ముఖ్యముగ జీర్ణముకానివస్తువులు బిడ్డల కిచ్చుటచే కీడుకల్గును. ప్రాణాపాయముకల్గుటయుగలదు. బిడ్డలపోరుతప్పించుకొనుటకై కొందరు భక్ష్యముల, చిరుతిండ్లనిత్తురు. అట్లివ్వరాదు. మెత్తని రొట్టె, పాలు, గంజి యిచ్చుచు ఏడాదికివెనుక అన్నముపెట్ట వచ్చును. బిడ్డలకుతినుపించుఅన్నము, కూరగాయలు మెత్తగనుండవలెను. మంచిపండ్లుయివ్వవచ్చును. బిడ్డలను తొందరపెట్టి తినిపించరాదు. అందువలన అజీర్ణముకల్గును. నారుగనేతిమన ట్లలవాటుచేయవలెను. ఆరోగ్యముగనుండినబిడ్డకు 10-వ నెల కవతల తల్లిపాలు క్రమముగ నిల్పివేయవచ్చును.

నిదుర దేహారోగ్యమునుకల్గించును. కాబట్టి బిడ్డలెంతనిదురించిన అంతమంచిది. విశాలముగను పరిశుద్ధముగను మంచిగాలివచ్చుప్రదేశమున శిశువును నిదురింపచేయవలెను. చలిగాలికెదురుగ పరుండబెట్టరాదు. బిడ్డకు చిన్నతొట్ల తల్లిప్రక్కయుంచి శీఘ్రముగ పరుండబెట్టవలెను. సకాలమునకు నిదురించునట్లు అలవాటుచేయవలెను. నిదురబుచ్చుటకు ఔషధమువాడరాదు. ఒకొకప్పుడు ఒకటీస్పూనునీటిని బిడ్డకు త్రాగించిన దాహముపశమించును. చిన్నబిడ్డలు దాహముకలిగినను వారు నోరులేనిజీవులుగాన చెప్పకొనలేరు. మంచిగాలి బిడ్డలకు ముఖ్యము. పుట్టిననెలకవతల తల్లియో, దాదియో బిడ్డను కొంతబయటికి సాయంత్రముతీసికొనివెళ్లినమంచిది. సముద్రపుగాలి మంచిది. అయితే చలిగాలిలో బిడ్డలను బయటికితీసికొనివెళ్ల రాదు. పక్షిబిడ్డలకు శరీరసాధకము నీశ్వరు డేర్పరచినాడు. పసిబిడ్డలనడచుట చూడగోరి కాళ్లకు బలముపట్టకమునుపే కొందఱు వారికి నడక నేర్పెదరు. ఎముకలు లేతగనుండుటచే భారముమోవలేక వంగి అడ్డకాళ్లు, వంకరకాళ్లు కలుగునుగావున తమంతట తాము నిలువబడుతరుణమును గమనించియే తల్లిదండ్రులు బిడ్డలకు నడక నేర్పవలెను. మలబద్ధకము పోగొట్టుటకు అరటీస్పూనుఆముదమునివ్వవలెను. బిడ్డకు అజీర్ణభేదులగునో తల్లి తనఆహారమునుదిద్దుకొనవలెను.

స్నానము చేయుటవలన మలినముపోయి దేహము మనోహరముగనుండును. ఉత్తకడుపుపై స్నానము చేయవలెను. పాలిచ్చినవెంటనే నీళ్లుపోయరాదు. వెచ్చనినీరుపయోగించవలెను. నీటిలో చాలసేపు నానరాదు. స్నానానంతరము పొడిబట్టతో తడియొత్తవలెను. వీపు, రొమ్ము, కడుపు, కాలుచేతులపై మూడు నాల్గుసారులు తల్లి తనవెచ్చనిచేతులతో రాచిన బిడ్డలకు రక్తము చక్కగ ప్రవహించును.

బిడ్డలకు కడుపునిండగనే చెప్పుటకు తెలియదుగాన ఎంతసేపు పాలిచ్చినను త్రాగుచునేయుందురు. కాబట్టి తల్లి తగుజాగ్రతవహించవలెను. బిడ్డ వాంతిచేసినచో ఆహారమధికమని ఊహించవచ్చును. కడుపు బాధలుకల్గును. శిశువులకు వాయుదోషములు, కడుపునొప్పి పోగొట్టుటకు శతకుప్పివిత్తులనీరు (dill water) ఉపయోగింపవచ్చును. ఇది మందులషాపులలో దొరకును. శిశువులరోగములకు తల్లిఅజాగ్రతయే కారణము.

శిశువులవస్త్రములగూర్చి జాగ్రతవహించవలెను. బరువుగను, బిగువుగనుండువస్త్రములు వాడరాదు. సూదులు వారిగుడ్డలయందు గుచ్చరాదు. దేహమును కప్పియుంచవలెను. శిశువులకాళ్లనుగూర్చి జాగ్రతపడవలెను. వారికాలికివేయుబూట్సులు వదులుగను, బరువులేకను సులభముగతీసివేయుట కనుకూలముగనుండవలెను. బిగువుగనుండు బూట్సులుతొడగినకాళ్లు పెరుగక వికారమగును.

పండ్లు పూర్తిగమొలచుటకు సుమారు రెండుసంవత్సరములుపట్టును. 7, 8 నెలలో పండ్లువచ్చుట కారంభమగును. మొట్టమొదట పాలపండ్లువచ్చును. పండ్లయిగుళ్లనురుద్దుకొనుటకు పిల్లలకు మృదువైనవస్తువు దేనినైననిచ్చి సంతోషింపజేయవచ్చును. మృదువైన **Gutta-percha pad** నివ్వవచ్చును. పుట్టుమచ్చలను చిన్నతనముననే అపాయములేక వైద్యులు తీసివేయవచ్చును.

**(Tongue-tie)** నాలుక కదలకుండనుండిన కత్తెరతో కత్తిరించి, ఈఆపరేషనువలన వైద్యుడు కుదుర్చవచ్చును.

**(Thrush)** నోటిపుండ్లవ్యాధియుండిన తేనెను బోరక్సుతో కలిపి వాటితో నోటియందలి మచ్చలకు రుద్దవలెను. ఇవి దేహములో మరియెచటనైననుయుండిన వైద్యునకుచూపవలెను.

చర్మవ్యాధులు శుభ్రముగకడుగుట, మంచిఆహారముభుజించుట, మంచిగాలితీసికొనుటలచే నయమగును.

ప్రసవించినవెనుక స్త్రీలకు సాధారణముగ రక్తక్షీణత (**anaemia**) వచ్చుచున్నదని డాక్టరు పెల్డ్‌మాన్ చెప్పుచున్నారు. రక్తముక్షీణించియో, సత్తువలేకనో వారిముఖములు వాడియుండును. కావలసినమంచిగాలిని పీల్చుటకు శక్తిచాలదు. అందువలన గుండెదడకల్గును. తలనొప్పి, వీపునొప్పి, నిదురలేమికల్గును. కొందరు మూర్ఛరోగపీడితులును; ఉన్మాదులునుఅగుటకలదు. బిడ్డకుపాలిచ్చుస్త్రీ యిట్లుండిన శీఘ్రముగ పాలుఇచ్చుట మాన్పించవలెను. ఈరక్తక్షీణతకుదుర్చుటకు తల్లికి బలముకల్గించు మంచిఆహారము, పాలు యివ్వవలెను. మలబద్ధకములేకుండ చూచుకోవలెను. పండ్లు శుభ్రముగనుంచుకోవలెను. మంచిగాలి, వెలుతురుగలచోట్ల ఉండవలెను. ఇట్లుండిన నయమగును.

# యోగి

యమ్. ఉమామహేశ్వరరావుగారు

రాగవిదూరమానసవిరాజితులై పరమార్థతత్వసం
యోగనిరూఢభావగుణయోగ్యులు యోగులుకాక నింద్రియో
ద్వేగవిహారహారితవివేకులు కేవలకుక్షిపూరణో
ద్యోగకళారహస్యవిదు లుగ్రజటాధరులయ్యు యోగులా?

# వాల్మీకి

అధికార్ల సూర్యనారాయణరావుగారు బి.యె;బి.యల్.

పుట్టినావట మాలకులమున
కొట్టినావట బాటసారుల
తుట్టతుదకు విరాగివై చే
పట్టినావంట
రామమంత్రము తల్లక్రిందుగ
రాత్రిపగలును నిశ్చలుడవై
కామలోభదురాగ్రహాది వి
కారములగెల్చి
మంత్రరాజము జపముసేయుచు
మహితయోగసమాధినుండగ
మంటిపుట్టలు ఒంటిచుట్టూ
గట్టినాయంట!
మంటిపుట్టలనుండి వెలువడ
గంటిలో కరుణారసంబును
ఆననంబున బ్రహ్మతేజం
బమరినాయంట!
స్వాంతమందు ప్రశాంతిగూడగ
జ్ఞాననేత్రము విడగ నీకును
జ్ఞానమూర్తికి నడుమగల తెర
నడలిపోయెనట!
పిల్లవారికి సంతసపుగని
పెద్దవారికి పెన్నిధానము
మానులకు ముక్తిప్రదంబుగ
మధురమధురముగ
నవరసోపేతముగ రాగల
కవులపాలిటి కల్పతరువుగ
ప్రవిమలప్రణయాంచితంబుగ
భక్తిభరితముగ
చెప్పితివి రామాయణంబను
చెప్పశక్యముకానికావ్యము
చెప్పియొప్పులకుప్ప సీతను
వప్పగించేవు!
వప్పగించిన సీత మాకడ
వన్నె తరుగదు వాడలేదిల
నున్న దేశాలెల్లనిండెను
వెన్నెలలవోలె
నామెకీర్తులు; మాతృభూమిని
ఆమెనెరుగని పిల్లగానీ
ఆమెగొలువని తల్లిగానీ
అరయగాలేము!
సీతగూరిచితలచుకొంటే
చేతముప్పొంగకనుబోవదు
కండ్లలో తడికాకమానదు
కఠినులకునైన!
వెనుకసీతే, ముందుసీతే,
విపినమంతా సీతరూపే,
విరహవివశుడు రామమూర్తికి
విశ్వమే సీత!
ఇళ్లసీతే, గుళ్లసీతే
పెళ్లికూతుళ్లెల్ల సీతలె,
ప్రేమవశమున మాకుసీతే
యిష్టదైవతము!
భరతదేశపు సతులంతా
భక్తిలోనూ ఓర్మిలోనూ
పూతచారిత్రములలోనూ
సీత ముద్దర్లె!
నాడుజానకి చొరబడీచిత్రి
నేడుకూడా భరతసతులకు

మంచువలెనే చల్లనగునని
మాకునమ్మకము!

రాతినాతిగఁజేసి రాముఁడు
ప్రాణమిడెనో లేదో కానీ
మాన్యమహిళామణిని భారత
మాతకిడినావు!

గొప్పదే సావిత్రి నిజమే!
గొప్పదే ద్రౌపదియు నిజమే!
చెప్పతరమా సీతయెట్టిదో?
సీతసీతేను!

జనులుపుట్టిరి, జనులుచచ్చిరి,
కవులువచ్చిరి, కవితలల్లిరి
భూతలము గాలించి వెతకిన
సీత జోడేదీ?

సత్యమట్టులు చావులేకే
జ్ఞానమట్టులు ముదిమిలేకే
నిత్యనూతనశోభతోనుత
నెగడె సీతమ్మ!

కపిదళంబుల గూర్చినాడవు
కడలిసేతువు గట్టినాడవు
సత్యవిజయము దనుజనాశము
సాటిచెప్పేవు!

లంక, లంకిణి, రావణుండును,
లక్ష్మణాదులు, కపికులంబులు
జీవకళలను గల్గిమనె మా
చిత్తములయందు!

చెంగుమని విపులాబ్ధిదాటగ
యుంగరము జానకికొసంగగ
చెనటిదైత్యుల దునుమగా సం
జీవిగొనిరాగ!

స్వామికార్యముకొరకు బ్రహ్మం
డములనైనా పగులగొట్టగ
విశ్వరూపము దాల్పగాగల
వీరసేవకుడు!

శక్తి సమరమునందు చూపీ
భక్తి రామునిపట్ల చూపీ
యమరెప్రాణంబట్లు నీకృతి
కంజనాసూతి!

ఆంజనేయుని దలచుకొన్నా
అనుజవర్గము నెంచుకొన్నా
ఊటగొను నుత్తేజమున కెద
జోటె గనపడదు!

రామువంటీ రాజుగానీ
రామువంటీ సుతుడుగానీ
రామువంటీ భర్తగానీ
రాడు లేడిలను!

భారతాంబరమందు నిత్యము
ప్రణయకాంతుల బర్వజేయుచు
రాజురవివలెనుంద్రు సీతా
రామదంపతులు!

కౌశికుని ప్రతిసృష్టియనునది
గాంచలేదున్నాదో లేదో
నీవుచేసిన సృష్టినిలచెను
నేడునాడనక!

ఆదిపద్యం బాదికావ్యము
నీదె! కవియను బిరుదునీదే!
ఆదిఅంతము చూచుకావ్యము
నీదెకాబోలు!

కల్లకపటము లేనివానివి!
కావ్యమిచ్చీ, కన్యనిచ్చీ,
రామరాజ్యమె మాయచేయుట
కేమికారణము?



# పాకకళ

## వాంగీబాత్

శ్రీమతి కె. పద్మావతిగారు

మినపపప్పు నాలుగుపంతులును; ధనియాలు, మిరపకాయలు, మిరియాలు, జాజికాయ, జాపత్రి ఒక్కవంతుగను కొంచెము లవంగపట్టయును వేసి తగినంత నేయి బాణలిలో పెట్టి దానిలో పైచెప్పినవస్తువులనన్నింటిని సరియైనపాకముగా వేరువేరుగా వేయించి మెత్తని పొడిచేసియుంచవలయును. మరియు నిందులో పచ్చికొబ్బెరకోరును, తగినంతఉప్పును కలుపవలెను. ఒకకళాయిపాత్రలోగాని, ఒకఅల్యూమినియముపాత్రలోగాని సుమారు 1½ తులములప్రమాణముగల చింతపండును కొద్దినీటిలో కలిపియుంచుకొని ఇదివరలో చేసియుంచినపొడిలో సగభాగమిందుకలుపవలెను. లేత సన్నని వంకాయలకు తొడిమెలుతీసి కాయవిడకుండునట్లు నాలుగుభాగములుగా తరిగి పైన చెప్పినచింతపండుపాత్రలో వేయవలయును. కొంచెము నానినవెంటనే తీసి మిగిలిన సగముభాగముపొడిని తరిగినవంకాయకూరలో కూరవలయును. అరశేరుబియ్యమును నీళ్లలో నానబోసి కొంచెము నానినవెనుక కడిగి పడగట్టియుంచవలెను. పిమ్మట నొకపొయ్యిమీద సుమారు మూడున్నరశేరుపట్టు నొకకళాయిపాత్రనుంచి సుమారుగా అయిదారుతులముల నేయివేయవలెను. దానిలో మిరపకాయలు, మినపపప్పు, సెనగపప్పు, ఆవాలు, పోపువేసి ఎర్రగా వేయించి సరిగా కాగినపిమ్మట పొడిలోనుంచిన వంకాయల నందులోవేసి మెత్తగా ఉడుకుటకు పైమూతలో కొంచెమునీరు పెట్టవలెను. పొయ్యిమీద పెట్టిన వంకాయలను అప్పుడప్పుడు కలిపి కొంచెము నీరు చల్లుచుండవలయును. మెత్తగా ఉడికినవెంటనే దించివేసి మూత పెట్టవలెను. ఇదివరలో పడగట్టియుంచినబియ్యమునకుతగినట్లుగా ఎసరు పెట్టవలెను. దానిలోకొంచెము పసుప్పొడివేసి ఆపసుపునీళ్లు కుతకుతవుడుకుచున్నప్పుడు పడగట్టియుంచిన బియ్యమును వేసి మూడుపాళ్లు ఉడుకువరకును మూత పెట్టవలెను. ఉడికినపిమ్మట నందులో వంకాయలను వేసికలిపి కొంచెము నేపుంచి సరియైన పాకమువచ్చినవెనుక దించివేయవలయును. దీనినే వాంగీబాత్ అనగా (వంకాయఅన్నమని) యందురు. చూచుటకు పొడిపొడిగా చిత్రాన్నమువలెవుండును. తినుటకు రుచికరము.

## అరటికాయపకోడీ

శ్రీమతి పాకల చంద్రకాంతామణిగారు

అరసోలెడుబియ్యమును బాగుగాకడిగి ఒకపాత్రలోబోసి కొంచెమునీళ్లుపోసి నానబెట్టవలెను. ఒక కొబ్బరికాయనుతురిమి నానబెట్టినబియ్యమును, కొబ్బరినికలిపి రోటిలోవేసి మెత్తగారుబ్బవలెను. దానిలో తగినట్లు ఉప్పు, కారము, పసుపువేసి కలిపిఉంచవలెను. అటువెనుక మూడుఅరటికాయలను తెచ్చి పైపెచ్చు తీసివేసి చక్రమువలె గుండ్రముగాను, కొంచెము దళసరిగాను ముక్కలనుకోసి వాటినినీటితో శుభ్రముగా

కడిగి ఒకపాత్రలోవేసి పొయ్యిమీదపెట్టవలెను. ముక్కలుమునిగినట్లు నీళ్లు, ఉప్పు, కారం, పసుపు వాటిలో వేసి బాగుగాఉడికించి మూతపెట్టవలెను. నీరంతయు ఇగిరినవెనుక ఆపాత్రనుదింపి అందుగలముక్కలను వెనుక సిద్ధముచేసియుంచిన రుబ్బుపిండిలోముంచి బాణలిని పొయ్యిమీదపెట్టి, అరసోలెడునూనె నందులోవేసి నూనె బాగుగామరిగినపిమ్మట ఈముక్కలను ఐదారుచొప్పున బాణలిలోవదలవలెను. బాగుగాకాలి ఎరుపుదారుగ వచ్చినపిమ్మట వాటినితీసి వేరొకపాత్రయందుంచవలెను. మిగుల రుచిగాఉండును. ఇట్లే ¼ పావుసేరు శనగపిండిలో సన్నగతరిగిన పచ్చిమిరపకాయలను, ఉల్లిగడ్డలను, తగుఉప్పును, నీళ్లనుకలిపి అందులో ఈ అరటికాయముక్కలను ముంచివేయించి ఉపయోగింపవచ్చును.

## పెరుగుబోండా

శ్రీమతి టి. కన్నమ్మగారు

ఒకభాగము సెనగపిండి, రెండుభాగములుపచ్చిపిండిచేర్చి తగుపాటిఉప్పు, సోడా కొద్దిగాకలుపవలెను. ఎర్రగడ్డలు, పచ్చిమిరపకాయలు, అల్లం, పచ్చికరేపాకు ముక్కలుగాతరిగి చేతితో మర్దనచేయవలెను. నీటితోకూడా కొద్దిగాపెరుగుచేర్చి బాగాకలిపి చేతిపదునుగానుండునట్లుచూచుకొని నేతిలోగాని నూనెలోగానివేచి వేడిగానుండగాభుజించిన చాలారుచిగా గరగరలాడుచుండును.

## ఆరనెల్లికాయజామ్

శ్రీమతి పాకల లక్ష్మీకామేశ్వరమ్మగారు

ఆరనెల్లికాయలనే రాచఉసిరికాయలందురు. ఉసిరికాయలను బాగుగాకడిగి, గింజతప్ప కండనంతయు తరిగి ఆకండను ఒకగ్లాసుతో కొలిచి తీసుకోవలెను. తరువాత దానిని ఒక కళాయిపాత్రలోవేసి చిటికెడు ఉప్పును, కొద్దిగానీరునుచల్లి పొయ్యిమీద పెట్టవలెను. గ్లాసుఉసిరికాయలకు రెండుగ్లాసులచక్కెరనుపోసి పాకముపట్టవలెను. ఉసిరికాయలు చేతితోపట్టుకొనిన చెదరినట్టువుడికినవెనుక అందులోని మిగిలిననీరును పారవంచి ఆముద్దను పైనచెప్పినపాకములోవేసి పొయ్యిమీదపెట్టికలుపుచుండవలెను. ఆముద్ద రోజారంగుగా వచ్చి, గరిటెజారుముద్దగావయినవెనుక దింపవలెను. దీనిని రొట్టెలోపెట్టుకొనితినిన రుచిగానుండును.

## గోధుమబర్ఫీ

శ్రీమతి యు. సత్యబాలసుశీలా దేవిగారు

ఒకచిన్నగిన్నెతో సన్నినిగుడ్డలోశోధించినగోధుమపిండి కొలిచిపెట్టుకొనవలయును. పిమ్మట నదే గిన్నెలో రెండుగిన్నెలనేతినికొలిచి కళాయిలోపోసి పొయ్యిమీద బాగుగాకాచవలెను. దానిలో పైన చెప్పినపిండినిపోసి జాగ్రత్తగాకలుపుచూ వేగినట్లుతెలియగనే దింపవలెను. పైకొలతగిన్నెతోడనే రెండు గిన్నెలుచక్కెరనూ అరగిన్నెడునీటిని ఒకగిన్నెలోపోసి పొయ్యిమీదకాచవలెను. అది చేతితోతాకితే అరంగుళంతీగగావచ్చునట్లు పాకముచూచిదింపుకొని వెంటనే పైన వేపియుంచినపిండిని, నేతిని బాగాకలిపి ఈపాకములోపోసికలిపి పళ్లెములోపోయవలెను. అట్లుపోసినదానిని గట్టిపడువరకును గరిటెతోకలిపి పిమ్మట చేతికినేయిరాచుకొని చదునుగాతట్టి కొంచెముసేపట్లేయుంచి కత్తితో బిళ్లలుగకోయవలెను. ఇట్లే మైదా పిండితోచేయవచ్చునుగాని గోధుమపిండితో చేసినంతశ్రేష్ఠము గాదు.

ఈశీర్షికను సంబంధించినవిషయములు విరివిగా పంపవలసినదిగా పాకకళాకుశలలగు స్త్రీలను ప్రార్థించుచున్నారము. —సంపాదకుడు.

# అర్చకి

శ్రీమతి పరిమి సీతామణిగారు

బింబిసారుఁడు బుద్ధదేవునిపదములకెఱఁగి యాతనిఁ బ్రార్థించి యాతనిపాదనఖములఁ గొనివచ్చినాఁడు. పవిత్రతరములగు నాపాదనఖములనాతఁడు తనయుద్యానవనమం దొకచో స్థాపించి దానిపై బ్రహ్మాండమగునొకస్థూపము నిర్మించినాఁడు. ప్రతిదినము సాయంత్రమగు సరికి యంతఃపురాంగనలందఱు సుస్నాతలై శుభ్రవస్త్రధారిణులై బంగారు పళ్లెరములయందు పూజాద్రవ్యముల నిడుకొని స్థూపముదఱికి వచ్చి తమ స్వహస్తములతో స్తూపముచుట్టును స్వర్ణదీపమాలికలఁ బ్రజ్వలింపఁజేసెడివారు.

బింబిసారుని యనంతరమాతనితనయుఁడగు అజాతశత్రుఁడు సామ్రాజ్యాభిషిక్తుఁడయి నాఁడు. అతఁడు బౌద్ధమతవిరోధియై తనతండ్రికి బౌద్ధమతముపై గల నమ్మకమంతయు రక్తధారలతోఁ గడిగివైచినాఁడు. పవిత్రములగు బౌద్ధమతగ్రంథములన్నియు అగ్నికాహుతి యొనర్పబడి నామమాత్రావశేషములైనవి. అజాతశత్రుఁడంతటితో నూరకొనక యంతఃపురాంగనలకందఱికి ఇట్లని యాజ్ఞయిచ్చినాఁడు.

"ప్రపంచముపై వేదము, బ్రాహ్మణులకన్న పూజింపఁదగినవస్తువు మఱియేదియును లేదు. కావున మీరు బౌద్ధస్తూపము నారాధించవలదు. అట్లారాధించినవారికి మరణశిక్ష విధించబడును."

శరత్కాలము సూర్యుఁడస్తాద్రిఁ జేరుచుండెను. ఆసమయమున శ్రీమతియను యంతఃపురబాలిక శుభ్రాంబరధారిణియై బౌద్ధారాధనకువలయు సామగ్రులఁ జేకొని రాజమాతకడకేగి నిలువఁబడినది. రాజమాతయాబాలికనుగాంచి భీతిచేకంపించినది. ఆమె "శ్రీమతీ! బౌద్ధారాధన మొనరించువారు వధింపఁబడుదురను అజాతశత్రుని కఠోరాజ్ఞ మఱచితివా? ఇది యేమి?" అన్నది.

శ్రీమతి మాట్లాడలేదు. నెమ్మదిగా ఆమె యువరాజ్ఞియగు అమితాదేవి మందిరమునకు వెడలినది. యువరాజ్ఞి యద్దమునెదుట ఆసీనయై పాపటదిద్దుకొనుచున్నది. మృత్యువు నెదుర్కొనబోవుచున్న యాసాహసికసుందరినిగాంచగనే యామెచేతులువడకి యతిప్రయత్నముతో దిద్దుచున్న పాపట వంకరపోయినది. "ఛీ. తెలివితక్కువపిల్లా! నీవెంత సాహసికురాలవు. పో, పో. నీచేతియందలి పూజాద్రవ్యముల నెవరైననుగాంచితేని యాపదలపాలు కాగలవు. పొమ్ము" అన్నది యువరాజ్ఞి.

రాజపుత్రికయగు శుక్లాదేవి ఉన్ముక్తవాతాయనముదఱి నాసీనయై అస్తమయసూర్య కిరణముల వెలుఁగులో చదువుకొనుచుండెను. ఆమె కరకంకణముల మ్రోతవిని తలయెత్తి చూచినది. పూజాద్రవ్యసమేతయగు శ్రీమతినిగాంచి సంభ్రమముతో ఆమెలేచి శ్రీమతితో నిట్లన్నది: "శ్రీమతీ! రాజాజ్ఞ నతిక్రమించి మృత్యువు నెదుర్కొనఁజూచుచుంటివి. ఇదేటి

సాహసము? నామాటవిని ఈప్రయత్నమునుండి విరమింపుము. వ్యర్థముగా ప్రాణములనేల పోగొట్టుకొనెదవు. శ్రీమతి అర్చనాసామగ్రులతో మఱియొకద్వారమునకు సాగిపోయినది. కడ కామెయొకచో నిలువఁబడి "ఓ అంతఃపురాంగనలారా! బుద్ధదేవు నారాధించువేళ కావచ్చినది. రండు" అని ఎలుగెత్తిచెప్పినది. కొందఱీమెసాహసమునుగాంచి భయపడినారు. మఱి కొందరు దూషించినారు. సూర్యుఁడు క్రుంకినాఁడు. చీకటి నలుగడలవ్యాపింపఁజొచ్చినది. పురాతనదేవాలయములో సాయంకాలపూజాసమయమున మ్రోగుగంట మ్రోగఁజొచ్చినది.

వినీలాకాశముపై తారకలు వెలుగొందఁజొచ్చినవి. సింహద్వారముదఱిని భేరి మ్రోగఁజొచ్చినది. వైతాళికులు సాయంకాలగీతములఁ బాడినారు. "దర్బారు ముగిసినది" అని ద్వారపాలకుఁడు కేకవైచిచెప్పినాఁడు. ఉన్నట్టుండి ఉద్యానవనపాలకులందరు అదరిపడి చూచినారు. ఎవ్వరీసాహసమొనర్చినవారు? యామినీసతి కాటపట్టయియుండిన రాజోద్యానవనమునందలి బౌద్ధస్తూపముచుట్టును కంఠహారమువలె దీపమాలికలు!!!

ఒఱలనుండి వెలికిన ఖడ్గములతో రా జ భ టు లు పరుగెత్తివచ్చినారు. అందొకఁడు "మృత్యుదేవతాలింగనమునకై త్వరపడుచున్న నీవెవరు?" అని కర్కశస్వరముతో నడిగినాఁడు. వినిందితవీణాస్వనముతో జవాబు వచ్చినది: "నేను బుద్ధదేవుని పదదాసినగు శ్రీమతిని."

చీకటియందా భటుని చేతికరవాలము విద్యుల్లతవలె మెఱసినది. తెల్లనిపాలరాతిపై క్రొన్నెత్తుటిధారలు ప్రవహించినవి. నిర్మలమగు నాశరద్రాత్రియందు, నిశ్శబ్దదేవతానిలయమగు నారాజోద్యానవనమందు, పవిత్రవంతమగు బుద్ధదేవుని పాదసన్నిధిని సమర్పితమగు నాసాహసికబౌద్ధమతప్రియయగు నాబాలికాజీవనజ్యోతి నిర్వాణమైపోయినది. —రవీంద్రుఁడు.

# ఖైదీ

పిలకా గణపతి గారు

"ఖైదీ! నిన్నిల్లా బంధించినవారెవరు?"

ఖైదీ అన్నాడు-"నాప్రభువే నన్ను బంధించింది. ఈప్రపంచంలో భాగ్యంలోనూ, అధికారంలోనూ నేనందర్నీ అతిక్రమించగలనను కున్నాను. నాప్రభువుధనమంతా నేనే నాధనాగారంలో పోసుకున్నాను. నిద్రకూరుకువచ్చినప్పుడు నాప్రభువు శయనించేశయ్యమీద శయనించాను. నేను లేచిచూసేసరికి నాధనాగారంలో నేను ఖైదీనయిఉన్నాను."

"ఖైదీ! అదుర్భేద్యశృంఖల నిర్మించినదెవరు?"

ఖైదీ అన్నాడు-"ఆశృంఖల అంతజాగ్రత్తగా నిర్మించిందినేనే. నాఅజేయసామర్థ్యం నన్నుమాత్రంవిడిచి ఈ ప్రపంచాన్నంతా జయిస్తుందనుకున్నాను. ఈవిధంగా రాత్రి అనకుండా పగలనకుండా పెద్దపెద్దసమ్మెటలతో కణకణలాడేఅగ్నిలో ఈశృంఖల నిర్మించాను. ఎట్లయితే నేమి దృఢమైనగొలుసులతో శృంఖలచేయడం పూర్తిఅయింది. కాని ఈశృంఖల నన్నే దృఢంగా బంధించివేసింది."

—రవీంద్రుడు.

## ఇరువదియవ పుష్పము: తరువాత

మరునాటియుదయమున నే జమీందారుపంపినబండిలో రామన్నయును, భార్యయును ప్రయాణమైరి. కుమారుడు వారిని చాలదూరముసాగనంపి కన్నీళ్లతో ఇంటికిమళ్లినాడు. రంగమ్మ నాడు పిండివంటలతో భోజనముచేసినది. కాని భగవంతుడు రంగమ్మకి తగినశాస్తిచేయకపోలేదు. రంగమ్మ ధనమంతయు నొకగొప్ప వర్తకునికి వడ్డీకిచ్చినది. రంగమ్మసొమ్మును వడ్డీకిపుచ్చుకున్నవర్తకుడు అపారనష్టమునుపొంది దివాలాతీసెను. అతనియాస్తిని కోర్టువారు వేలముపాడి అమ్మివేసిరి. రంగమ్మనెత్తిమీద పిడుగుపడినట్లయినది. ఈమహాకష్టమామెకు దుర్భరమైపోయినది. ఆమె సుఖస్వప్నములు మటుమాయములైపోయినవి.

కాలక్రమమున నామెకు మతిపోయినది. రాత్రియంతయు కూర్చునిఏడ్చుచు ఎవరినోతిట్టుచుండెడిది. పదివేలరూపాయలకు పదివందలరూపాయలామెకువచ్చినవి. ఈనిరంతరదుఃఖముచేత నామె క్రుంగిపోయినది. చివర కామె నొకవిషజ్వరముపట్టుకుని యెంతకును విడిచినదికాదు. వైద్యునకు కబురంపుటకామె యిష్టపడ లేదు. కాని యామెమాటలువినక గంగన్న లింగరాజుకు కబురుపంపెను. కోపోద్రేకముచేత ఔషధము నామె నేలపైవిసిరికొట్టినది. లింగరాజామెకు సద్బుద్ధిగరపుటకు ప్రయత్నించెను. కాని యామె యాతని మాటలనువిన నిరాకరించినది. "అయ్యా! మీరెందుకింతశ్రమపడి నాకు బోధిస్తారో నాకుతెలియదు. నేనేం తప్పుచేశానని నన్ను పశ్చాత్తాపముపొందమంటారు? మీరు ఈబుద్ధులన్నీ నన్ను దగాచేసినవర్తకుడికి చెప్ప కూడదూ? నేను రోజూ దైవప్రార్థనచేస్తునేవున్నాను. ఒక్కరోజైనా వృధాగాకూర్చోకుండా కష్టపడి డబ్బుసంపాదించాను. నాలో వేలెత్తిచూపగలదుర్గుణాలులేవని చాటిచెప్పగలను. తమ కింతకష్టంయెందుకూ? పూరుకోండి." అని మోటుగాచెప్పినది.

లింగరాజు ఓర్పుతో నామెచెప్పినదంతయువిని "అమ్మా! నువ్వు పొరపాటుపడుతున్నావు. నీభర్తను తిట్టినతిట్లు జ్ఞాపకంతెచ్చుకో. నీఅత్తమామలకడుపుమాడిచి నిలవచేసినసొమ్మును నువ్వు గణించినట్లుగా చెప్పుకుంటున్నావు. నీదురాశమూలాన్ని నీభర్తకు సంసారాన్ని నరకప్రాయంగామార్చేశావు. తలిదండ్రులులేని బిడ్డని కాంతాన్ని యిల్లువెడలగొట్టేశావు. ఏమూలవెతికినా నీలో ధర్మగుణమన్నది కనబడదుకదా! సోదర జీవులయెడల ప్రేమయేలాంటిదో నీకుతెలియదు. రోజూ దైవప్రార్థనంచెయ్యడంతోటి నీవిధితీరిపోలేదు. శక్తి కలిగికూడా తోడిప్రాణులకు ఉపకారంచెయ్యనప్పుడు నీప్రార్థనవల్ల లాభంలేదు" అని ఉన్నమాటలురెండును దాపరికములేకుండ చెప్పినాడు.

రంగమ్మ రుగ్మతక్రమముగా హెచ్చిపోయినది. లోభత్వముచేత ఎందరుచెప్పినను ఆమె మందుపుచ్చుకొన లేదు. అంతబాధపడుచున్ననుఆమెకు దైవచింతకలగలేదు. ఈరీతిగా నడివయస్సులో ఐహికాపేక్షలనువిడువలేక మహాదుఃఖమనుభవించుచు ఇహలోకముననే నరకమనుభవించి రంగమ్మ తన ఇరువదియైదవయేట చనిపోయినది.

## ఇరువదియొకటవ పుష్పము: పశ్చాత్తాపము

వేసవికాలపురోజులు సముద్రతీరమునగడుపుట జమీందారులవాడుక. సముద్రతీరస్థములగు నగరములలో శ్రీరంగపురము ప్రధానమైనది. ఆపట్టణమున జమీందారులకు స్వంతభవనముకలదు. జమీందారులతో గూడ కాంతం శ్రీరంగపురము వెళ్ళినది. వారక్కడనున్నరోజులలో ఒకనాడొకవృద్ధుడు వగర్చుకొనుచు జమీందారు భవనముకద్దకువచ్చి "కాంతంఅనేఅమ్మాయి యిక్కడవుందా అండి?" అని ఆతురతతో నడిగెను. ద్వారమువద్దనున్న నౌకరతని నక్కడేకూర్చుండబెట్టి కాంతమ్మను తీసుకొనివచ్చెను. ఆముసలివాడామెను

చూచి "అమ్మాయీ! నువ్వే నా కాంతానివి? మరణశయ్యమీదనున్న ఒకవ్యక్తి నిన్ను చూడాలని కోరుతూంది. ఒక్కమారు రాతల్లీ! ఆనిర్భాగ్యురాలిని చూద్దుగాని" అన్నాడు.

ఆశ్చర్యచకితురాలై కాంతం జమీందారిణిని సలహాయడిగెను. ఆమె "కాంతం! వెళ్ళు. పరవాలేదు. నీతోగూడా ఆదినారాయణుని పంపిస్తాను వెళ్ళు" అన్నది. మారుమూలపేటలలోనికి వృద్ధుడు కాంతమ్మను, ఆదినారాయణుని తీసుకొనిపోయెను. ఆయింటిస్థితిచూచి కాంతమ్మ జాలిపడినది. ఇల్లొకమూలనుండి శిథిలమైపోవుచుండెను. వృద్ధు డొకగదిముందునిలిచి "ఇదే మనంరావలసినస్థలం. ఒక్కనిమిషంఆగండి వొస్తాను" అనిచెప్పి తలుపుతీసుకుని లోపలికివెళ్లెను. మరికొన్నినిముషముల కాతడు పైకివచ్చి వారిద్దరిని లోపలికిగొంపోయెను. వారు ప్రవేశించిన దొక యిరుకుగది. అంధకారభరిత మై పగలుగూడ భయముగొల్పుచుండెను. మంచముపై పడుకొనియున్న వ్యక్తిని చూచుసరికి కాంతమ్మ శరీరము భయాతిరేకమున జలదరించిపోయినది. శల్యావశిష్టముగానున్న ఒక్కశరీర మొకటి యామెకు కనబడినది. నేత్రములు నిస్తేజములైయుండెను. ఆమె మాటలు స్పష్టముగా వినబడుటలేదు, కాంతమ్మనుచూడగనే ఆవ్యక్తి తనకుష్ఠుహస్తమును ఆమెవైపునకు జాచినది. కాంతం వణుకుచు మెల్లగ దగ్గరకువెళ్ళినది. వాగ్ధోరణినిబట్టి మహాకష్టముపైని ఆవ్యక్తి నిర్భాగ్యురాలగు పున్నయని కాంతమ్మ గ్రహించగలిగెను. కాంతం జమీందారువారి భవనమునున్నట్లు పున్న తెలుసుకున్నది. ఒక్కసారి ఆమెనుదర్శించి తనయపరాధములకు క్షమాపణచెప్పుకొనవలెనని పున్నకు బుద్ధిపుట్టినది. ఆయింటనేకాపురమున్న ఒకవృద్ధునిపిలిచి కాంతమ్మను తీసుకొనిరమ్మనిపంపినది. పున్న దుస్థితినిగాంచినప్పుడు కాంతమ్మ కప్రయత్నముగానే యశ్రువులుస్రవించినవి. పున్న చేతినిపట్టుకుని కాంతంచెప్పినది: "ఇంకా నీమీద నాకు కోపంయెక్కడ? కోపం ఆనాడేపోయింది. నీప్రస్తుతస్థితికి నాహృదయం నీరైపోతూంది."

"అయ్యో! కాంతం! నేను మహాపాపాత్మురాలిని. ఈదుస్థితికి పూర్తిగా నేను అర్హురాలను. నేను చేసిన ఘోరపాపాలు యిప్పుడు నాకళ్లముందు భయంకరరూపాలతో ప్రత్యక్షమవుతున్నాయి. ఇక్కడి బాధతోఅయిందీ? చచ్చిపోయి ఘోరనరకంలో పడిపోడానికి సిద్ధంగావున్నాను. నీవు నన్ను అపారకరుణతో క్షమించావు. కాని భగవంతుడు నన్ను క్షమించడు"అని పున్న హృదయవిదారుణముగ ఏడ్చినది. కాంతమ్మ ఆమెనోదార్చుచు "పున్నా! నిజమైనపశ్చాత్తాపము నీకు కలిగినయెడల భగవంతుడు నిన్నుతప్పక క్షమించ గలడు" అని నెమ్మదిగాచెప్పినది. ఇంటికిపోయినతరువాత జమీందారిణితో పున్న హీనదశనుగూర్చి జాలి కలుగునట్లు కాంతమ్మచెప్పినది. "అమ్మా! తమరా నిర్భాగ్యురాలిని అనుగ్రహించి క్షమించండి" అని బ్రతిమాలినది. ఆమెకోరికప్రకారము జమీందారిణి పున్నకు ఔషధములను, బట్టలను, భోజనసామగ్రియును పంపినది. కాని ఆయౌషధములవలన లాభములేకపోయినది. పున్నకు రోగము ముదిరిపోయెను. తన ఇరువదియవసంవత్సరమున మహాసౌఖ్యమనుభవించవలసినతరుణమున పున్న మరణించినది. 'స్వార్థపరత్వమున మైమరచి అమాయకులకు హాని తలపెట్టెడువారి కిట్టిదుస్థితి తప్పదు' అని చెప్పుట కొకయుదాహరణముగా భగవంతు డామెను సృజించునట్లు అందరికినితోచినది.

## ఇరువది రెండవ పుష్పము: ధర్మవరదుర్గమునందు

మరిసంవత్సరమునాటిసంగతి. వసంతకాలపుసుదినములు. రామన్న భార్యతోకూడ ధర్మవరదుర్గమున నివాసమేర్పరుచుకుని చాలరోజులుగతించినవి. కాంతమ్మనుచూచినప్పుడెల్ల రామన్న సంతోషాశ్రువులుజడిగొన "అమ్మా! నీమూలాన్ని అవసానదశలో ఈయింట్లో తలదాచుకున్నాను. మాకింతనీడకల్పించావు, తల్లీ!"అనుచుండెడివాడు. ముత్యాలుకూడ కాంతమ్మను కుమార్తెవలె ప్రేమించుచుండెను.

ఇప్పుడు కాంతమ్మ జమీందారులకుటుంబములో చేరిపోయినది. అమ్మాజీప్రియస్నేహితురాలై ఆమె కోటలోనే యుండిపోయినది. తనకంటె పెద్దదియగు సోదరియందు చూపదగినగౌరవమును అమ్మాజీ కాంతం యెడల చూపుచుండెను. కోటలోనివారందరును ఆమెను మిగుల ప్రేమించుచుండిరి.

ఒకనాటిరేయుదయము హఠాత్తుగ న్యాయాధిపతి జమీందారువారినిదర్శించి "మాఅబ్బాయి నారాయణ మూర్తిని తమరెరుగుదురుకదా? చిన్నప్పటినుంచీ తమకళ్లముందర పెరిగినవాడేకదూ? అతనికిప్పుడు యిరవై రెండో సంవత్సరం. నిరుడే న్యాయశాస్త్రపరీక్షలో ఉత్తీర్ణుడైనాడు. ప్రభువువారిఅనుగ్రహంవుంటే తమ సిఫార్సుపైని నాస్థానంలో అతన్నిప్రవేశపెట్టి యింక నేను వుద్యోగంచాలించుకుంటాను. రామా! కృష్ణా! అనుకోవలసినకాలంవొచ్చిందికదా! ఇక ఇప్పుడు నేనువొచ్చినపని యేమిటంటే మాకుర్రాడికి పెళ్లియీడు వొచ్చింది. నేను బ్రతికివుండగానే అతన్నొకయింటివాణ్ణిచేద్దామని అభిప్రాయం. నిన్న నావుద్దేశం అతనికి చెప్పిచూశాను. అతను యిదివరకే కాంతాన్ని చూశాడట! ఈఅమ్మాయి సుగుణాలనుగురించే అతనెప్పుడూ చెబుతూవుంటాడుసుమండీ! కాంతమ్మయందతనిమనస్సు లగ్నమైనట్లు నాకిదివరకు తెలియదుకాని నిన్ననే చూచాయగా తెలిసింది." చిరునవ్వుతో న్యాయాధిపతి సమీపమున అమ్మాజీతో కూర్చునియున్న కాంతంపైపు చూచెను. (ఆమె సిగ్గుతో తలవంచుకునికూర్చుండెను) "ఈసంబంధకుదిరిందంటే నాకు చాలాసంతోషంగా వుంటుంది. ఏమంటే ఆమెయెడల నేనుచేసిన అకార్యమునకుతగిన నిష్కృతిచేసినట్లవుతుంది." కాంతం మనస్సు నారాయణమూర్తియందు లగ్నమైయుండినట్లు ఇదివరకే చూచాయగా జమీందారునకు తెలిసియుండెను. అందుచే నాతడు న్యాయాధిపతినిచూచి "ఇంతకంటె సంతోషమేముంది? వారిద్దరికీగలప్రేమను గురించి యిదివరకే నాకు కొంచెం తెలుసును. వారిద్దరూ తగినవధూవరులని మేము అనుకున్నాంకూడాను. కాని మాకాసంగతి తెలిసినట్లుగా కాంతంయెరగదు. వివాహానికి ప్రేమ ముఖ్యాధారం. అదేవున్నప్పుడు ఇంక మాఅభ్యంతరంయేముంటుంది?"

వివాహమునకువలయు ప్రయత్నములన్నియు జమీందారిణి స్వయముగ దగ్గరనుండిచేయించెను. పెండ్లి కోటలోనేజరుగుటకు నిశ్చయింపబడెను. విందులును, ఉత్సవములును కోటలోనే యేర్పాటుచేయబడెను. "మనంయిచ్చిన ఉంగరం ఆమెవేలుకి ఎంత అందంగావుంది! ఆమెను కష్టాలపాలుచేసినవుంగరమే ప్రధానపు వుంగరమవడం చాలాసంతోషకరమైనసంగతి" అని జమీందారిణి భర్తతో చెప్పెను.

వైద్యుడు లింగరాజును పెండ్లికి ఆహ్వానించిరి. వివాహపుదుస్తులలో కాంతమ్మ నిరుపమానసౌందర్య ముతో ప్రకాశించినది. చుట్టుప్రక్కలనుండి వేలకువేలుప్రజలు వివాహమునుచూచుటకువచ్చిరి. అకారణమైన నిందలపాలయి చెరసాలశిక్షననుభవించిన అమాయకురాలు తిరిగి యాస్థలముననే యద్వితీయగౌరవముతో పెండ్లికుమార్తెయగుటకు వారందరును సంతసించిరి.

మిత్రుని ప్రియకుమార్తెనుచూచి ఆదినారాయణ ఆనందాశ్రులోచనుడయ్యెను. కన్నసంతానమును సన్మార్గప్రవర్తనులనుగాచేయుటలోను, భగవద్భక్తిని వారిహృదయములందునాటుటలోను అందరు తలిదండ్రు లకును జగ్గయ్య ఆదర్శప్రాయుడని లింగరాజు తనసహజానర్గళవాగ్ధోరణిలో నుపన్యసించెను.

"పూలసజ్జ"నిండ పూలునింపి అమ్మాజీ పెండ్లికుమార్తె ముందుపెట్టినది. ఆసజ్జసౌందర్యము అతిథుల నందరిని ఆకర్షించినది. సర్వేశ్వరుని నిరుపమానవాత్సల్యమునకు నిదర్శనముగాను సజ్జను జాగ్రతగ దాచి యుంచుకొనవలెనని లింగరాజు సలహాగాచెప్పినాడు.

* * * *

వాగ్దానమొనర్చినప్రకారము జమీందారు జగ్గయ్య కొకసమాధినికట్టించెను. —ముగిసినది.

# రవీంద్రుడు

శ్రీ వేంకట పార్వతీశ్వరకవులు

౧

సుకవితారసవాహినికిఁ బుట్టినిల్లయిన చొక్కంపు విరిదేనెసోన వీవు
సరసభావసుగంధసరణికి నిరవైన తోరంపుఁబువ్వులతోఁట వీవు
ప్రణయకళాపరంపరకు మూలంబైన నిద్దంపుఁబంతువెన్నెలవు నీవు
దివ్యవిజ్ఞానకాంతికి నిధానంబైన తెల్లంపు రతనాలదివ్వె వీవు
మోటుప్రాకులఁజిగుఱించు పాటవీవు
పాటలోఁజొక్కి చొక్కించుపక్షివీవు
పక్షిలో భావగతిఁజూపు ప్రౌఢవీవు
ప్రణయరససాంద్ర సుకవిచంద్రా! రవీంద్ర!

౨

కన్నులలోఁబొంగి కరుణామృతరసంబు గంగాభవానికి గతులుసూప
మాటలలోఁబుట్టి మధురసంగీతంబు ప్రణవగీతమునకుఁ బటిమసూప
నవ్వులలోఁదేలి నవ్యకళాలీల శీతాంశురేఖకుఁ జెలువుసూప
తలఁపులలోఁదోఁచి తత్త్వదివ్యజ్యోతి వేదాంతసరణికి వెలుఁగుసూప
శాంతిసదనంబునందుండి సరసమధుర
మృదులకవితారసంబులో మేనుమఱచి
యఖిలమునెఱుంగఁగల రాజహంసవీవు
ప్రణయరససాంద్ర సుకవిచంద్రా! గవీంద్ర!

౩

పువ్వులతోఁటలో విరిసిపొంగిన వెన్నెలవెల్లితేటలో
నవ్వులమాటలో నిలువునంబులకించిన వీణెపాటలో
మవ్వపురూపుఁగన్న రసమంజరి నీకవితాలతాంగి కిం
కెవ్వరు సాటివత్తురు సుధీంద్ర! రవీంద్ర! కవీంద్రశేఖరా!

౪

వాసంతికానందవైభవంబునుబాడు రమణీయకోకిలారవమువోలి
ఉన్ముఖబ్రాహ్మీముహూర్తంబుఁగీర్తించు వరతామ్రచూడారవంబుఁబోలి

అమృతప్రపూర్ణవర్షాగమంబునుతించు బర్హికేకావిరావంబుఁబోలి
సర్వేశ్వరాత్మ సాక్షాత్కారమును దెల్పు ప్రణవఘంటావిరావంబుఁబోలి
పుణ్యమయవిశ్వభారతీమూర్తివైన
ధన్య నినుఁగూర్చి మాకవితాలలామ
సరసగతిఁబాడుచున్నది సాధుగీతి
ప్రణయరససాంద్ర సుకవిచంద్రా! రవీంద్ర!

౫

నవలీలాలలితంబుఁ బ్రేమమయ మానందోజ్జ్వలంబాత్మవై
భవసంపూర్ణ మనంతశాంతరససంపన్నంబునై యొప్పునీ
కవితాలోకమునందుఁగన్గొనిన యాకల్యాణతేజంబు స
త్కవిరూపంబునఁ గంటిమిప్పుడు రవీంద్రా! సాంద్రతేజోనిధీ!

౬

కూపలనై నమ్రింగు పులికోరలఁబువ్వులు పూయునెంత వి
జ్ఞానులనై ననొంచు ఘనశంకలసంకులు మ్రోయు రేపవల్
మానక లోకముంగలఁచు మాయలవెన్నెలఁగాయఁబ్రేమలోఁ
దానముఁజూపు నీకవిత ధన్యుఁడవీవు రవీంద్రసత్కవీ!

## రవి

కందుకూరి రామభద్రరావుగారు

(రవీంద్రునకు సూర్యునకు సర్థమిచ్చునట్లు వ్రాయబడినవి.)

దిశలఁబ్రాకిన గాఢాంధతిమిరముడిపి
ప్రాగ్దిశాంగనగర్భాన 'రవి' జనింప
నిబిడమై, నిగూఢమునయి, నిదురవోవు
ప్రకృతికంతకు జైతన్యభావమబ్బె.
భువనమోహనరాగప్రపూర్ణగీత
మాలికాంజలితోడ దన్మయతనొంది
ప్రాగ్దిశావైభవాంచితభావవీథి
కవికుమారులు విహరింప గడగిరంత.
భావగర్భితరేఖావిభాస్వరముగ
రమ్యచిత్రములన్ బ్రాచి రవిరచింప

కళనుపాసించు చిత్రలేఖకగణంబు
బొమలుపై కెత్తి తద్భావపుంజమరయు.
ప్రాక్ప్రతీచీసమన్వయభాగ్యరేఖ
వ్యాప్తిబొందంగ నఖిలప్రపంచయాత్ర
సలుపు జగదాప్తమూర్తిచే జన్మభూమి
మహితమంగళాలంకారమాన్యయయ్యె.
ఖండఖండాంతరముల విఖ్యాతబుధులు
పూర్వముఖులయి భక్తిసంపూర్ణులునయి
జననసమయానరవికి నంజలులునిలిపి
కానుకలొసగుచునున్నారు కానరండు.

# చరమగీతి

జనమంచి కామేశ్వరరావుగారు

భోజుని రాచనగరులో ఒకఆలయం. ఆఆలయంలోని దేవదాసి ఎక్కడోకొండ కోనలో దొరకిన ఆడకూన. సంగీతజ్ఞుడు ఆచార్యుడు.

"ఒకనాటిప్రొద్దుపొడుపులో నవ్యనాదమొకటి నాచెవినిసోకింది. సజ్జపట్టుకొని పుష్పాపచయంకోసం నేనడవికిపోగా వటతరుచ్ఛాయక్రింద గోలుగోలున ఏడుస్తూ దొరికింది ఆపాప నాకు"అని చెప్పినాడు.

అప్పటినుండీ ఆపాపనెంతో అల్లారుముద్దుగా పెంచుతున్నాడు. ఆమె అతనిప్రియ జంత్రము, తంబురాకన్న ప్రియతమమయింది. ఆమె నోటినుండి పలుకుకన్న పాటముందు విడివడి వెల్లివిరిసింది.

ఇప్పుడు ఆచార్యుని కంఠము రుద్ధమైపోయింది. దృష్టిమందగించింది. దత్తపుత్రిక ఆచార్యుణ్ణి చంటిపిల్లను చూసుకునేట్టు జాగ్రత్తగా చూసుకుంటూఉన్నది.

యువజనులు దూరదూరాలనుండి ఆమెపాట వినాలనివచ్చినారు. ఆచార్యుడు వీరినందరినిచూచినాడు. తొడిగిన మొగ్గవిడవడం, విడిచినమొగ్గ భువికి రాలిపోవడం అనేకాలధర్మం లోలోన మననంచేసుకున్నాడు. హృదయంలో కలగింపుపుట్టింది.

ఆమె "నిన్నువొదిలి ఒకగడియైనా ఉండగలనా? బాబూ!" అన్నది. ఆచార్యుడు ఆమాటలువినడంతోనే వెర్రిఆనందముతో ఆమె ముఖమూ, ముంగురులు ఆప్యాయంగా దువ్వాడు.

"నన్నువదిలి వెళ్ళిపోయిన గానపులీపులు నీలోకుప్పవోసికున్నాయి. నాచిట్టి తల్లీ! నిన్నుపోనాడుకుంటే నాజీవితామూల్య భారమంతా వృథా సంకలితమైపోతుందే!" అన్నాడాయన.

ఫాల్గుణమాసము వాసంతిక భూదేవికుంతలాలను హైమస్విన్న సౌరభసుమాలతో తురిమింది. ఆరాత్రి కౌముదీస్నాపితము. ఆచార్యునిశిష్యులలో అగ్రగణ్యుడు కుమారసేనుడు గురువునకు ప్రణామముచేసి "మహాశయా! మాధవిహృదయం నేను చేదుకున్నాను. మీ అనుజ్ఞఅయితే మేము బద్ధులమగుతాము"అన్నాడు.

ఆచార్యుని కనుకొలకులలో బాష్పములు నిలిచాయి.

"నాతంబురా తెచ్చిపెట్టి మీరుభయులు నాఎదుట రాజ్ఞీరాజేశ్వరులలా కూర్చోండి" అన్నాడు. ఆచార్యుడు చేతితో తంబురాతీసికొని పాడమొదలుపెట్టినాడు.

"నేను నాజీవితాంతిమగీతి పాడుకుంటాను"అన్నాడు.

మొదటిచరణంపాడాడు. మరిముందుకు జరగలేదు ఆయనపాట. తంబూరాతీగలు వడగళ్లుపడితే వడకిపోయేపువ్వుల్లా వడవడ వడంకిపోయినాయి.

ఆఖరుకి తంబురా కుమారసేనునిచేతికందిచ్చి

"జంత్రము నీవుతీసికో ఇదిగో అన్నాడు."

తరువాత మాధవిచేయి కుమారసేనుని చేయిపై పెట్టి "ఇదిగో నాప్రాణంతీసికో" అంటూ "నేను మొదలుపెట్టి వదిలివేసిన పాటను మీ రుభయులు గొంతులుకలిపి సాంతముగాపాడండి" అన్నాడు. మాధవీకుమారసేనులు పాడమొదలుపెట్టినారు. రవిచంద్రులు కూడ కరగి వారిపాటలో చిన్నచిన్నగీతులై కలిసిపోయినాయి.

ఇంతలో రాజసేవకుడెవ్వడో వీధితలుపు తట్టినాడు నఖశిఖపర్యంతమూ కంపిల్లుచు ఆచార్యుడు లేచినిల్చొని "ఏమిటి రాజుగారిఆజ్ఞ?" అని అడిగినాడు.

సేవకుడు "ఏమిటా? మీకొమార్తెగారి నశీబు బాగుందిబాబు! రాజుగారెందుకో కబురంపారు"అన్నాడు.

ఆచార్యుడు "కబురంపారా? అ ఎందుకోసం?" అన్నాడు.

"రేపుప్రొద్దున్న రాజకుమారిగారు భర్తగారింటికి కాంభోజనగరంపయనమై వెళ్తారట. మీకొమార్తె ఆమెతో చెలికత్తెగా తోడు వెళ్లాలట! ఇది రాజుగారిఆజ్ఞ బాబు?" అన్నాడు సేవకుడు.

పౌషమలపయి ప్రొద్దుపొడిచింది. రాజకుమార్తె ప్రయాణమై బైలేరింది. రాణమ్మగారు మాధవితో "మాఅమ్మాయి ఎప్పుడూ నవ్వుతూ త్రుళ్లుతూ సుఖంగావుండేట్టుగా నీవు చూస్తూఉండాలి. అమ్మాయిని అక్రొత్తఇంట్లో జాగ్రత్తగా కనుపెట్టుకొని చూస్తూండాలి సుమా! జాగ్రత్త"అని చెప్పింది.

మాధవి కనుతుదలనుండి ఒకచినుకైనా కదలలేదు; సరికదా వెలుగురేఖ ఒకటి మెరసింది-గ్రీష్మభానుదీప్తికి ఆకాశంలో క్షణప్రభనిస్తూ మెరసే ఉజ్వలకిరణంలాగున.

ముందుగారాజకుమార్తె నెమిలిపాలకీ పోతూన్నది. పాలకీపై భాగమంతా ముఖమల్ గుడ్డ కప్పబడిఉన్నది. చుట్టూకవచధారులు, ఖడ్గపాణులు నడుస్తూఉన్నారు. మాధవిపాలకీ వెనకాలేవస్తూన్నది.

పథపార్శ్వమున ఆచార్యుడు నిర్జీవప్రతిమయి ధూళిపిహితమైనదేహంతో భూమీారుహంలా పడివున్నాడు. ఆతనిప్రక్క కుమారసేనుడు నిశ్శబ్దంగా నిట్టనిలువుగా అశ్వద్ధవృక్షంలా నిల్చునివున్నాడు.

పక్షులు పరిసరారణ్యములో కేరుకుంటున్నాయి. మందవాయువులు మావిియిగుళ్ల సౌరభాలతో మత్తెక్కిపోతున్నాయి.

ఆమె పుట్టింటినిగురించి ఏఫాల్గుణమాసదివసాంత మందైన తలపోసికొనునేమో పాపము! అని మాతాపితలకు దూరమైపోయిన రాజకుమార్తెను తల్చుకుంటున్నారు రాజాంగణములోని ప్రజలు.

—రవీంద్రుడు.

# దుర్గావతి

డి. వి. అవధానిగారు

ఆమె పవిత్రమూర్తి తనయంగములందు స్వతంత్రరక్తధా
రామలవాహినీసముదయమ్ముగలట్టిది అన్యధారుణీ
స్వాముల కేరికిన్ శిరమువంచి నమస్కృతిసల్ప దెన్నఁడే
భూమితలేశుఁడో పొగరుబోతుతనమ్మును జూపనోర్చునే?

ఆమెకుఁగలాయిరాజునకు సంతములేనిదురాశగాక తా
నేమనిపంపగావలయు నిట్టులమైనచమూసమూహమున్
సామపథానువర్తనవశంగమితాఖిలవైభవమ్మును
ద్దామస్వతంత్రతావిలసితమ్మును గాండ్వనమున్ జయింపగన్.

ప్రబలమ్లేచ్ఛచమూద్ధూతపాంసుపటల
మామహాదేవి నేత్రద్వయమ్ము కెంపు
మంటకుసహింపనోపక మాడిచనిన
తురకసేనలమసిలాగు తోచెనపుడు.

రండో సైనికులార! విష్ణుపదమార్గప్రాప్తినై దాఘమా
ర్తాండప్రోజ్జ్వలదాయతాంగులయి సంప్రత్యాగతారాతిదో
ర్దండోద్దామమదమ్మునుక్కడచి మీరాజ్యాధికారమ్మును
ద్దండోత్సాహముతోడ నిల్పుకొనగన్ ధైర్యప్రపూర్ణాత్ములై.

విజయోస్తనెడి విప్రవిద్వదాశీర్వాక్కు లింపుగా చెవికి విన్పింపవేల?
సేనలజల్లంగ చేరుపుణ్యస్త్రీల మన్వంపుదోయిళ్లు మసలవేల?
అరిసైనికులగుండె లదరగొట్టగజాలు భేరీస్వనమ్ము విన్పింపదేల?
ప్రాలేయగిరిసుతాభవ్యవిగ్రహమున్న ఎఱ్ఱజెండాకఱ్ఱ నెత్తరేల?
తురకసేనలు పరిమితిదాఁటి కోట
ముట్టడింపగనేతెంచి మూగుచుండి
రేల సైనికులార! రారేల హస్త
తలముకాలిఁబిదప నాకులకువెదక?

బ్రదికితిమా యనన్యసులభంబగు శేముషిగాంచి భూరిసం
పదకునిధానమౌ ప్రబలభారతరాజ్యము నేలుకొంద మీ
కదనమునన్ మృతింగనిన గాంచెదమవ్యయమైన స్వర్గపుం
బదవిని సాధ్వసంపడక భండనభూమికి రండు సైనికుల్.

సాహసమూర్తులై ప్రబలశాత్రవసంఘము నుక్కడించి యు
త్సాహముతోడ మీయనుగుతాతలుతండ్రులు మాతృభూమికై

యాహుతిజేసినారలు నిజాంగములన్ తదపత్యముల్ భవ
ద్బాహుబలప్రదర్శనవిధానతదర్హత జూటజూడుడీ.
వదనోదేతభయంకరార్భటి శ్రుతివ్యాపారసంత్రాసితో
న్మదితారణ్యమృగప్రకాండమగు శుంభద్బాలపంచాస్య ము
న్మదమాతంగనికాయము స్తకలసన్మాంసాశనాపేక్షమై
ఎదురేతెంచెమభంగి రంకు విలసద్ధేలావిశేషాత్ములై.

అనుచునిజసైనికులకు ధైర్యమ్ముపుట్ట
బలుకు దుర్గావతీదేవి వామలోచ
నమున సరిసైనికా స్త్రబాణమ్ముకంటు
గ్రుచ్చుకొని యామెప్రాణాల గూడదీసె.

## స్వామి!

నామనూరు నాగభూషణరావు గారు

ఈప్రశాంతమనోహర సుప్రసన్న
భావములనాకుగరపి దుర్భ్రమలముంచి
అనుభవముకాని జీర్ణదేహంబొసంగ
న్యాయమా? నీకు. సైపలేనోయి స్వామి!
ఎదురగునిరాశతరగల నీదలేను
కలసిపోయెద దుఃఖసాగరములందు
ఏనొకతుషారసదృశుడ, నీప్రపంచ
సాగరనిగూఢగహ్వరభాగములను
రేగిపోవుచు, కడలిపై నూగియూగి
ఎగిరివచ్చెదమింటికి పొగలనెక్కి

అచటిచిరుమబ్బుపొదలతో, అందుమలయు
తొలకరిమెఱుంగుతీగలతో తదీయ
కుసుమితప్రసన్న తారకాగుచ్ఛములతో
పాడుకొనుచుందు నన్నిటితోడగలసి
ఆడుకొనుచుందు నన్నిటితోడగలసి.
ఏనొకయణుస్వరూపుడ, నీప్రపంచ
వలయమున వీచు భీకరానిలములోన
కలసిజీర్ణించి నీపాదకమలములకు
త్యాగమొనరింతు నాజీవధనముస్వామి!!

## నివాళి

హరి రాధాకృష్ణమూర్తి గారు

ధీరతన్నెలపు హిన్దీవాఙ్మయంబున
నెడలేని కాగిళులెన్నోయిచ్చి
ఆర్యభాషామణియైన సంస్కృతమున
ముదమార శిరమున ముద్దులిచ్చి
భావసమగ్రతన్ బచరించు వంగభా
షను చాలగా నుపాయనములిచ్చి
ప్రౌఢతరంబైన పరదేశభాషల
లలితమార్గమున సల్లపనమిచ్చి
ప్రజల నినుజూచి కన్నీరువరదలైన
క్షణము మదివిస్మరించిశోకమ్ము సకల
భాషలను భారతాంబ డెబ్బదవయేట
నిచ్చు నీకు నివాళి రవీంద్ర! కొనుమ.




శ్రీమతి శ్రీ రాజా నల్లపరాజు మీర్జా బుచ్చిబంగారయ్యమ్మబహాదరువారు

అజీర్ణమనునది వ్యాధులకుమూలస్థానము. బలమగురోగము. ఇది స్త్రీపురుషులకు వారినుండి శిశువులకును జనించి శరీరారోగ్యమునకు బాధకరమై చివరకు ప్రాణహానికూడ గలిగించుచున్నది. కనుక వారలజీవితపర్యంతమును సాధ్యమగునంతవరకూ యీరోగమును చేరకుండ వారివారి శరీరములను తగువ్యాయామములతోడను, ఆహారపరిమితితోడను, ఔషధములతోడను కాపాడుకొనుచుండుట ముఖ్యవిషయము. ఈవ్యాధి వర్తమానమున స్త్రీలయందును బాలురయందును ప్రబలమై జఠరాగ్నికి మందమునుగలిగించి క్రమముగా శరీరమును కృశింపచేయుచున్నదన్న సంగతి యెల్లరకును తెల్లమగుచున్నది. మొదట అజీర్ణములేనిదే రోగముకలుగదని వైద్యుల అభిప్రాయము. మొదట జీర్ణకోశమునకు శక్తితగ్గగనే మనము పుచ్చుకొనెడి పదార్థము జీర్ణముగాక అనేకవిధములగు మార్పులు గలుగచేసి శరీరమునకు వికారమును కలుగచేయుచున్నది. అజీర్ణమునుగూర్చి ఆయుర్వేద,యూనానివైద్యగ్రంథముల అభిప్రాయములను ఈదిగువ నుదాహరించుచు రోగనివారణార్థము కొన్ని తేలికయగుక్రియలనుకూడా వ్రాయుచున్నారము. మనముపుచ్చుకొనెడి పదార్థపచనలోపములవలనను, వేళలను అతిక్రమించి పుచ్చుకొనుటవలనను, యితర భాషామతముల ననుసరించుటచే కలిగెడి నిద్రలోపము చేతను ఈవ్యాధికి ఎక్కువచోటు అవుచున్నది. ఇదియునుగాక నవనాగరికతనుగాంచిన వారీమణులు గృహకృత్యములు మొదలగుపనులు చేయుట వర్తమాన, రాజసమునకు శరీరసౌఖ్యమునకు లోపమనియు తలంచి చాలమంది అట్టి మూఢవిశ్వాసమునకులోనై తిరుగుటయును సత్యేతరము కాజాలదు. ధనవంతులయిన కొలదియును ఖండాంతరులవలె మన హైందవనారీమణులును యీతీరుపయిపరుండి, కొన్నిపత్రికలను చేతబట్టి సాయంకాలము కారులపైగాని, గుఱ్ఱపుబళ్ళపైగాని షికారువెళ్ళుచు వేళనతిక్రమించినను మధ్యమధ్య కాఫీ, ఉపమా మొదలగువాటిని పుచ్చుకొనుచు తమశరీరములను రోగములకు తావలమగు వానినిగా చేయుచున్నారు. ఆభరణములలోనెల్ల ఉత్తమమైన ఆభరణమగు ఆరోగ్యము పాడుచేసుకొనుట కూడనిపని. కావున శరీరపోషణవిషయమై కడుజాగరూకతవహించియుండ సోదరీమణులను కోరెదము. రోగములకు మూలమగు అజీర్ణమురాకుండను, వచ్చినను సులభముగ నివారించుకొనుటకును అనువైనక్రియలు మాపూర్వులు వ్రాసినవియు, ఇతరులవియునగు గ్రంథములనుండి సేకరించి ఇచ్చుచున్నాము. యునానీ ఆయుర్వేదముల ననుసరించి అజీర్ణవ్యాధినిదానస్వరూపములు, క్రియలు తెలుపుచున్నాము. యునానిపద్ధతిని జీర్ణము నాలుగువిధములు. మొదట పదార్థము మేదా(పొట్ట)యందు జీర్ణించి సత్తునిలిచి పిప్పిమూలముగాబయలుదేరును. రెండవది మేదా, థుగర్

(కార్జము) వీట్లమధ్యనుండు సన్నని నరములలో పచనమై అచ్ఛటజలముగా మారుచున్నది. దీనివల్లను ఖిల్లతు పుట్టుచున్నది. మూడవజీర్ణము నరములలోను, నాల్గవజీర్ణము అవయవములలోనున్నూ అయి వాట్లవల్ల మట్టి చెమట యివిపుట్టుచు కన్ను ముక్కు చెవి యింకా దేహములోని రంధ్రములద్వారా యీమూడూ నాలుగు జీర్ణములు బయలు దేరుచున్నవి. ఈనాలుగుజీర్ణములలో మొదటిదానికి కైలూస్ అనిన్నీ రెండవదానికి కైమూస్ అనిన్నీ యూనానీవారి అభిప్రాయమైయున్నది.

యూనానీక్రియల్లను ఈదిగువ నిచ్చుచున్నాము. బయానే అమ్రాజే మేదా అనగా పొట్టలోనిరోగమునకు పేరు. దరదే మేదా పొట్టలోనినొప్పులు. ఈనొప్పులు భోజనవిరోధమువల్లను కలిగినయెడల వేడినీళ్ళలో ఉప్పువేసి లోపలికిఇచ్చి వమనముచేయించి తిరుగా మంచియాకలికలుగువరకూ ఆహారమును యివ్వకూడదు. ఆకలికలిగినవెంటనే తేలికయగుఆహారమును ఇవ్వవలయును. ఒకవేళ వాయువులవల్లనుండినయెడలగాని నొప్పి మారుతూ యుండినగాని అట్టిసమయమందు గోధుమపొట్టు, ఉప్పు యిసుక వేయించి కాపడమిచ్చేది. లేక వెంటనే మొదటిరకము ఓమము ద్రావకమును త్రాగించుట మంచిది. అందువల్ల చాలాగుణముకనిపించును.

జవారిష్కుటాంజి: కుటాంజి 5 దిరములు (దిరం లేక దిరహం అనగా మూడుమాషాలయెత్తు) ఒక రాత్రి సిర్కాలోఊరనిచ్చి యెండబెట్టి కొంచెముగావేయించి అర్ధశేరు చక్కెరపాకములో జవారిష్ చేసేది. ఈలాగుతయారైన జవారిష్ను సీసాయందుంచి ఉదయంసాయంత్రం చిన్నకుంకుడుపిక్కంత జవారిష్ను పుచ్చుకునేది. ఈజవారిష్ సేవవలన బలగంపోటు, పొట్టవాపులు, పొట్టలోనిదుష్టవాయువులు పోయి పొట్టలోనిపురుగులనుచంపును. ఈజవారిష్ స్త్రీలకుకలిగెడి ఋతువును అనగా మాసముల యెచ్చుతక్కువలను సరిచేయును. నీరును జారీచేసి నాభిలోనిరాయిని, సుద్దనుకరిగించి నొప్పులుపోగొట్టి పాతజ్వరములు మేహజాడ్యములను నివారింపజేయును.

హబ్బేనమ్మక్: ఇది పొట్టలోని వాయువులనుహరించును. పొట్టకుబలమిచ్చి అన్నివిధముల నొప్పులను యెక్కిళ్ళను నిలుపును. జీర్ణముకలిగించును. మామూలుఉప్పు, లాహోరీఉప్పు, నల్లఉప్పు యివి దినుసుకు 3 మిస్కాలు; పుదీనా, కిచ్చిలిగడ్డ ఇవి దినుసుకు ఐదుమిస్కాలు; త్రిఫలములు, త్రికటుకములు, లవంగపట్ట నల్లజీలకర్ర, ఎర్రఉప్పు ఇవిదినుసుకు 9 మిస్కాలు (ఒకమిస్కా మూడుమాషాలయెత్తు) ధనియాలు 8 దిరములు, సోపు, ఓమము యివి దినుసుకు 20 దిరములు వీట్లను చూర్ణముచేసి నిమ్మకాయరసమందు తడిపి యెండనిచ్చి నెల్లికాయరసమునగాని లేక కషాయములోగాని తడిపి యెండనిచ్చి మరల నిమ్మరసముతో నూరి మాత్రకట్టుకు రానిచ్చి రేగుగింజపరిమాణములు చేసియిచ్చేది. పథ్యంలేదు. లఘువైనఆహారమిచ్చేది. ఈఔషధము అజీర్ణములపైని మేహజాడ్యములపైని అనేకరోగములపైని నడచును. ఈరెండు క్రియలవస్తువులను యూనానీవస్తువులు అమ్మేచోటకొని ఉపయోగించేది.

ఆయుర్వేదఅభిప్రాయమును అందుల మంచిక్రియలను ఈదిగువనిచ్చుచున్నాము. జఠరాగ్ని కఫాధిక్యముకలిగియున్నచో మందాగ్నియనియు, పిత్తాధిక్యమైన తీక్ష్ణాగ్నియనియు, వాతాధిక్యమైనయెడల విషమాగ్నియనియు, త్రిదోషములు సమముగానున్నయెడల సమాగ్నియనియు నాలుగుతెరంగుల చెప్పబడును. సమాగ్నిగలవాడు ప్రమాణముగభుజించిన ఆహారము బాగుగాజీర్ణమగును. మందాగ్నిగలమనుజుడు భుజించిన ఆహారము స్వల్పమైనను జీర్ణముకాదు. విషమాగ్నిగలవాడు భుజించిన యాహారము ఒకప్పుడుజీర్ణమై మరియొకప్పుడు జీర్ణముకాదు. తీక్ష్ణాగ్నికలవాడు అమితభోజనముచేసినను స్వప్రమాణభోజనముచేసినను సులభముగ

జీర్ణమగును. ఇందునుగూర్చియే కొంచెముమార్పుతో మాధవనిధానమున సమాగ్నికలవాడు హితముగామితముగా భుజించుచు అగ్నిని రక్షించుకొనవలెను. విషమాగ్నిగలవారికి వాతహరమైనమందులను తీక్ష్ణాగ్నిగలవారికి పైత్యశాంతికరమైనమందులను మందాగ్నిగలవారలకు శ్లేష్మహరమైనమందులను ఈయవలెను అనియున్నది. అందుల క్రియలనుకూడా ఇచ్చుట కొన్నిటినిచ్చుచున్నాము.

విషమాగ్నికి శుంఠ్యాదిచూర్ణము. సూర్యోదయమగుచుండగానే శొంఠిచూర్ణమునందు యవక్షారమునుకలిపిగాని ప్రత్యేకముగ శొంఠిచూర్ణముగాని ఉష్ణోదకముతో సేవించిన విషమాగ్ని శమించును. విషమాగ్నికి అన్నమండపానీయము. బియ్యమునందు 14 గురెట్లు నీళ్ళుపోసివార్చిన మండగునందు పొంగించిన యింగువ సౌవర్చలవణముకలిపిపుచ్చుకొన్న విషమాగ్నిని సమస్థితికి తెచ్చి ఆరోగ్యమునుకలిగించును. అన్నమండపానీయ గుణము ఆకలినిబుట్టించుట వస్తిశుద్ధిపరచుట బలమునిచ్చుట రక్తవృద్ధిజేయుట జ్వరమునుహరించుట కఫమును వాతమును పిత్తమునుపోగొట్టుట యివి 8 గుణములున్నూ మండముయొక్క సుగుణములు.

అగ్నిమాంద్యమునకు సైంధవాదిచూర్ణము:—సైంధవలవణము కరక్కాయలు పిప్పళ్ళు చిత్రమూలం వీని సమభాగచూర్ణమును ఉష్ణోదకముతో పుచ్చుకొన్నయెడల మిక్కుటముగా పుచ్చుకొన్నపదార్థమైనను జీర్ణమునకువచ్చును.

జిహ్వాశుద్ధికి ఆర్ద్రికఖండము:—భోజనకాలమందు ప్రథమకబళములో అల్లపుముక్కలు సైంధవలవణముకలిపిపుచ్చుకొన్నచో జిహ్వ కంఠములు శుద్ధములగును. అగ్నిదీప్తికలుగును. ఇది అందరికిని అనుభవసిద్ధమైయున్నది.

అజీర్ణాదులకు బడబాముఖచూర్ణము:—కరక్కాయ శొంఠి పిప్పళ్ళు క్రామగువేరు చెక్క, మారేడువేరు చిత్రమూలము చెక్కార, వీని సమభాగచూర్ణముతయారుచేసి బిరడాగలగాజుసీసాలో పైచూర్ణమునుంచి భోజనమునకువెళ్ళేముందు మూడుప్రేళ్ళతో పట్టునంతగుండనోటవేసి మంచినీళ్ళుపుచ్చుకొనేది. భోజనముఅయిపోయినను కూడా ఈచూర్ణమును ఉపయోగించవచ్చును. అటులచేసిన యెంతటిగురుత్వముగల భోజనమైనను క్షణములో జీర్ణమవును.

కరక్కాయ పిప్పళ్ళు సౌవర్చలవణము ఇవి సమభాగములుగచూర్ణించి సదరుచూర్ణమును గాజుసీసాలో నుంచి వలయునపుడు కర్షప్రమాణమును గ్రహించి పెరుగుమీద తేటతోగాని వేడినీటితోగాని యిచ్చినయెడల చతుర్విధములైన అజీర్ణములు అరుచి, ఆధ్మానము, వాతగుల్మము, శూల యివి హరించును.

## భోగిపండుగ

శ్రీమతి సత్యవతీకన్యగారు

భోగిపండుగగాఁ బొలుపొందనీవేళ
స్నానంబులెల్లఱు సలుపవలయు
రేపుసంక్రాంతియౌ నాపయిఁగనుమము
క్కనుమనుపండుగల్ క్రమతవచ్చు
నీదినంబులయందు నింపుగాపల్లెంగ్రు
బావలుమఱఁదులు బంధుగులును
పిండివంటలతోడ మెండుగాభోజనం
బులనొక్కపంక్తిఁ బొసఁగఁజేసి
నవ్యవస్త్రాభరణములు దివ్యలీలఁ
దాల్చిసంతోషవారిధిఁ దనరఁదేలి
యాడుచును బాడుచును గడువేడుకలరఁ
జూడనొప్పుచునుందురు చోద్యముగను.

# బాలవిజ్ఞానశాఖ

## ప్రాతపాటలు

౧

సీతమ్మయుండేటి దీవిలంకల్ని
పాపప్రా వెన్నెల పగిలై కాయు
సీతమ్మచిత్రకథ చెప్పేటివేళ
అడవిలోవచ్చాను లగ్నులై మందు.

౨

సీతబుట్టానేల లంక చెడనేలా
లంకకూ రావణుడు రాజుగానేలా
హనుమయ్య బుట్టనేల వనముజెడనేలా
వనముపక్షులన్ని వలపోయనేలా.

౩

రావణాసురునిశిరసు లంకలోగొట్టి
రామన్న తనబంటుగెలిచి రమ్మానె
లంకదగలాబెట్టి లంకిణినిజంపి
శంకలేకాలంక యేలెహనుమంతు.

౪

ఇసుకలోయుండేటి కుసుమశిరిబాలా
మాబాలరాజుగా మిముగూడియూడ
మాబాలరాజుగా మిముగూడియూడా
అక్కనీబాలకూ ఆనవాలేమి
అక్కనీబాలకూ ఆనవాలేమి
అరిచేతిపద్మంబు అల్లుతామార

శ్రీమతి కొసరాజు సీతారామమ్మగారు

అరిచేతిపద్మంబు అల్లుతామారా
జడజడముత్యాలు జడరాయిరేఖ
జడజడాముత్యాలు జడరాయిరేఖా
లక్కపుత్తడిబొమ్మ రత్నాలమొరిలె
లక్కాపుత్తడిబొమ్మ రత్నాలమొరిలే
రాజుల్లచేతిదీ శిరిసిమ్మపండు.

౫

నల్లనన్నానీకు చెల్లెల్ని నేనూ
నగరిపట్టపురాజు కోడల్ని నేను.

౬

రావాకుచిలకమ్మ ఆడవేపాపా
రాజులూ నీచెయ్యి చూడవచ్చారు.

౭

కట్టమీదా రెండు కరివేపచెట్లూ
గాలివానవస్తె కొమ్మలల్లాడూ
గాలివానావస్తె కొమ్మలల్లాడూ
అన్నయ్యాలగుడ్డ కుచ్చులల్లాడూ.

౮

కాకారిబూసింది కళలేనిపూతా
కన్నతల్లిబెట్ట వెలలేనిసొమ్ము
మేనమామనుజంపి మేలురథమెక్క
కృష్ణయ్యతానేమికీర్తి బొందాను.

## పోలన్నకథ

శ్రీమతి కిలాంబి సీతాదేవిగారు

అనగనగా ఒకవూళ్ళో ఒకరాజుండేవాడు. అతనికూతురు రోజూ సున్నిపిండిపెట్టి నలుచుకునేది. కొన్నాళ్లుజరిగాక సున్నిపిండిమొక్క మొలిచింది. ఆమొక్క పేరు చెప్పినవాళ్ళకు

తనకూతుర్నిచ్చి పెళ్లిచేస్తానన్నా డారాజు. ఎవ్వరుగూడ చెప్పలేకపోయారు. కాని ఒక మాలాయన నున్నిపిండిచెట్టుకాదంటండి అని చెప్పినాడు. రాజు తనకూతుర్ని మాలాడికి ఇచ్చాడు. ఒకసవారిగూడ ఇచ్చాడు పాపమారాజు. పెండ్లికూతుర్ని సవారిలోకూర్చుండ పెట్టి వాళ్ళవూరికి మోసుకుపోతున్నారు మాలవాళ్లు. వారికి దాహమై ఒక యేటిఒడ్డున దాన్ని దింపి ఏట్లోదిగారు ఆమాలవాళ్లు. ఇంతలో ఒకదుప్పికన్పించింది వాళ్లకు. దాని వెంబడి పరిగెత్తారు. ఇంతలో వేటకై ఒకరాజకుమారుడు ఆఅడవికి వచ్చి పాపమా రాజకూతుర్ని తనగుఱ్ఱంమీదకూర్చోపెట్టుకొని సవారియందు ఒకపెద్దపులి నట్టిపెట్టి చక్కాపోయినాడు. మాలాళ్లంతావచ్చి సవారిని వాళ్లవూరికి తీసుకుపోయినారు. వూళ్ళోమాలాళ్లంతా సవారీ సందుల్లోంచి చూసి 'పోలన్నా! పోలన్నా! ఓరిపోలన్నా! పడుచుకి ఇంతింత గుడ్లుఉండవిరా' అన్నారు. పోలన్న అన్నాడుగదా 'మీమొహం గుడ్లేందిరా రాజకూతురికి పెద్దపెద్ద కళ్లుండవా?' ఇంకోమాలాడువచ్చి 'పోలన్నా! పోలన్నా! ఓరిపోలన్నా! పడుచుకి ఇంతింత బగ్గీలుండవిరా'అన్నాడు. 'అవిబగ్గీలుగావు రాజకూతురుకట్టుకొన్న బనారసుచీరచారలు'అనిఅన్నాడు పోలన్న. ఇంకొకడువచ్చి 'పోలన్నా!పోలన్నా! ఓరిపోలన్నా! పడుచుకి ఇంతింత తోకఉండదిరా' అన్నాడు. 'అదితోకకాదు. రాజకూతుళ్లు బంగారపుజడలువేసుకోరంట్రా. అది బంగారపు జడ' అన్నాడు పోలన్న. మాలాళ్లునిజమే అనుకున్నారు పాపం. సవారీతలుపు తెరిచాడు పోలన్న. 'గాండ్రు గాండ్రు'మనిచెప్పి అందులోనుంచి బెబ్బులొకటి బయటికిదూకి పోలన్నని మాలవాండ్లందరిని చంపేసింది. కథ కంచికెళ్లింది, మనమింటికొచ్చాం.

## అదృష్టమేలాంటిది?

శ్రీమతి సుంకర పార్వతీ దేవిగారు

అనగాఅనగా ఒకఊళ్లో ఒకబ్రాహ్మణయువకుడుండేవాడు. వాడు కడుబీదవాడు. అయినప్పటికి తనతల్లి తాను ఏదో ఒకవిధంగా జీవిస్తూవుండేవారు. కొన్నాళ్ళయినతరువాత తనవివాహంగూర్చి ప్రశ్నించాడు తల్లితో. నీఅదృష్టంకు నేను కర్తనుకానన్నది తల్లి. ఇంకెవరని కుమారుడడిగాడు. శ్రీమన్నారాయణుడని తల్లి చెప్పింది. ఒకనాటిఉదయం నారాయణునిచూద్దామనేఉద్దేశంతో బయలుదేరాడు బ్రాహ్మణుడు. వెళ్ళగావెళ్ళగా ఒకపల్లె కాన్పించినది. ఆపల్లెనాయుడు బ్రాహ్మణునిచూచి మీరెచ్చటికి వెళ్ళుచున్నారని అడిగాడు. నానీతిగతులు చెప్పుకుందామని దేవునిదగ్గరకువెళ్ళుచున్నానన్నాడు బ్రాహ్మణుడు. అలాగయితే "నాకుకొంచం మేలుచేయండి బాబూ" అంటూ తన కోనేరు ఎంతలోతుత్రవ్వించినా నీరుపడనందుకు కారణం అడుగమన్నాడు నాయుడు. అలాగేఅనిచెప్పి అచ్చటినుంచి బయలుదేరి కొంతదూరంవెళ్లేసరికి ఒక పెద్దమామిడిచెట్టు కనిపించి "ఎచ్చటికివెళ్ళుచున్నారని"అడిగింది. నేనువెళ్ళడం దేవదర్శనంకొరకు అన్నాడు బ్రాహ్మణయువకుడు. అట్లయిన నేను మునుపటివలె ఇప్పుడు పువ్వులు కాయలు కాయడంలేదు. కారణంకనుక్కోమన్నాది చెట్టు. సరేఅని చెప్పి వెళ్ళుచుండగా ఒక ముసలిసర్పము కనిపించి ఎచ్చటికి ప్రయాణం అంది. దేవుణ్ణిచూడడానికి అన్నాడు బాటసారి. చాలాకాలంనుంచి కళ్ళు కనిపించకుండా ఉన్నవి. కారణం కనుక్కోమన్నది పాము. అలాగేఅనిచెప్పి వెళ్ళుచుండగా కొంతసేపటికి నారాయణుడు ప్రత్యక్షమయ్యాడు. బ్రాహ్మణుడు నమస్కరించి పాముసంగతి ముందుచెప్పేడు. దాని శిరస్సున మణి

ఉన్నది, అదితీసివేసిన కళ్ళుబాగుపడునన్నాడు నారాయణుడు. తరువాత మామిడిచెట్టునుగూర్చిచెప్పేడు. ఆచెట్టుక్రింద రెండుగోలెములలో ధనంఉంది, అధనంతీసిన ఆచెట్టు కాస్తుందన్నాడు దేవుడు. తరువాత నాయుడువిషయం చెప్పేడు. వాడియింటిలో ఒకయువతియున్నది. దానికి వివాహంచేయలేదు. అందుచేత ఆయువతి విరహతాపబాధచే బాధింపబడుచున్నది. ఆకారణమువల్ల కోనేటిలో నీరులేదు. వివాహం చేసిన వెంటనే కోనేరునిండునని చెప్పేసరికి తనమాట మర్చిపోయి తిరుగుముఖంపెట్టేడు బ్రాహ్మణుడు. అలాగు వస్తుండగా పాముకనిపించి నాసంగతి ఏమని అడిగింది. నీతలలో మణిఉన్నదట. అదితీసిన నీకళ్ళు బాగగునని చెప్పేడు బ్రాహ్మణుడు. అట్లయితే నీవే తీసుకో నాయనా అన్నది సర్పము. బ్రాహ్మణుడు మణీతీసేడు. సర్పము కళ్ళు బాగయినవి. అందుచేత సంతోషంతో బయలుదేరాడు మణితో బ్రాహ్మణుడు. కొంతదూరంవచ్చేసరికి మామిడిచెట్టు కనిపించి నాసంగతి ఏమినాయనాఅన్నది. నీక్రింద రెండుగోలెములలో ధనమున్నదట. అధనం తీయవలెనన్నాడు బ్రాహ్మణుడు. అందుకు సమ్మతించింది చెట్టు. రెండుగోలెములలో ధనంతీసి ప్రయాణం సాగించాడు. అలాగు వస్తూవుండగా నాయుడు కనిపించి నాసంగతి ఏమని అడిగేడు. నీకుమార్తెకు వివాహంచేయవలెనని దేవుడు చెప్పెనన్నాడు బ్రాహ్మణుడు. అట్లయితే వివాహం చేసుకోమన్నాడునాయుడు. తక్షణం వివాహంచేసుకొని మణితోను, ధనరాశితోను, భార్యతోను బ్రాహ్మణుడు గృహోన్ముఖుడయ్యాడు. "అదృష్టమనగా యిలాంటిదే."

## శోధించిన సొట్టన్న కథ

శ్రీమతి అయ్యదేవర బాలాత్రిపురసుందరమ్మగారు

అనగనగా ఓఊళ్ళో సొట్టన్న, వీరన్న, రామన్న అను ముగ్గురన్నదమ్ము లుండెడివారు. సొట్టన్న కడగొట్టువాడు. కొన్నాళ్ళకి వేరడ్డారు ముగ్గురూను. పెద్దాళ్లిద్దరు మంచివితీసుకుని సొట్టవన్నీ సొట్టన్నకిచ్చారు. పొలముసొట్ట (గొయ్యి)నిచ్చారు. నడుమువిరిగిన సొట్టగేదె నిచ్చారు. నడికప్పవిరిగిన సొట్టఇల్లిచ్చారు. అదేచాలన్నాడు సొట్టన్న. సొట్టగేదె కుంచెడు పాలిచ్చేది. వాళ్ల గేదెలు సోలెడుపాలిచ్చేవి. ఇతనిపొలము బాగాపండేది. వాళ్లది పండేది కాదు. సొట్టన్నోరోజున ఊరికెళ్లాడు. బావగార్లనొచ్చి పాలుతియ్యమంది సొట్టమ్మ. సరే నని పాలుపితికి దానినిండా కుంకుమపోసి గేదె రక్తమిచ్చింది. వాతంకమ్మింది, పోవడానికి వాతలెయ్యాలని ఒంటినిండావాతలేశారు. గేదచచ్చింది. సొట్టన్నొచ్చి ఇదేమన్నాడు. భార్య జరిగింది చెప్పింది. సరేనన్నాడు. దాన్నోమాదిగాడికిచ్చి ఓడోలట్టుకు రమ్మన్నాడు. అదుచ్చుకుని ఓఅడవిలోకెళ్లాడు. ఓచెట్టెక్కాడు. కొంతసేపట్కి దొంగలు కొందరొచ్చి డబ్బుపంచుకుంటూన్నారు. అదేసమయమని డబ్ డబ్ వాయించాడు. దొంగలు పారిపోయారు. ఆసొమ్మంతా ఇంటికితెచ్చాడు. వారదితెలుసుకున్నారు. తమగేదెల్ని చంపుకున్నారు. సొట్టన్న నడిగి తెలుసుకున్నారు. రెండుడోళ్లు చెరొకటి తగిలించుకున్నారు. అడివిలోకెళ్లి చెట్టెక్కి కూచున్నారు. దొంగలొచ్చుటమె తడవుగా వాయించారు. దొంగలు ఇటుఅటుచూసి పైకి చూశారు. వీరు కనబడ్డారు. కిందకుదింపి నాలుగువాయించి పంపారు. ఏడుస్తూ ఇంటి

కొచ్చారు. మళ్లీ కొన్నాళ్లకి సొట్టన్న ఊళ్లో లేకుండా చూసి కొంపకి నిప్పంటించారు. మంటు తోందంటె చూస్తూ ఊరుకున్నారు. సొట్టన్నొచ్చేసరికి బూడిదుంది. సంగతి తెలుసుకుని మంచి దన్నాడు. బూడిద బస్తాల్లోపోయించి బండిమీదవేయించి తోలుకుపోయినాడు. వెళ్లగా వెళ్లగా ఓ ఏరు అడ్డమొచ్చింది. బళ్లుఆపారు. అవతలకొన్ని బళ్లున్నాయి. అదిరత్నాలసరుకు. సొట్టన్న మాముత్యాలసరుక్కి మీరత్నాలసరుకిస్తారా అన్నాడు. సరేనని అటుబళ్ళిటు, ఇటుబళ్లటు పట్టించారు. సొట్టన్నింటికొచ్చి కుబేరుడయ్యాడు. పెంకుటిమేడకట్టాడు. వారు కూడాతమఇళ్లుతగులబెట్టారు. సొట్టన్ననడిగి తెలుసుకున్నారు. జాగ్రతగా బూడిద బస్తాలో పోయించి బళ్లకెత్తించారు. ఏటిదగ్గరకెళ్లి కనిపెట్టుకున్నారు. మళ్లీ (మోసపోయిన) బళ్లొచ్చాయి. వీరు పూర్వమువలె అడిగారు. మీముత్యాలుచూపమన్నారు. వీరన్న, రామన్న తెల్లబోయారు. ఎపుడు ఈలాంటిమోసం చెయ్యవద్దని జ్ఞాపకార్థము పెద్దవానికి, చిన్నవానికి వాతలుపెట్టి పంపారు. తల్లిఎదురెళ్లి ధనమేదన్నది. అమ్మా, అన్నయ్యకుమూడు, నాకు రెండు అన్నాడు. ఏమిటంది. వాతలే అన్నాడు రామన్న. తల్లి నాయనలారా! చెరుపకురా చెడేవు, అని వానిని చెరుపదలంచితిరి. కావున మీపని ఇట్లుఅయినది. వానిని క్షమాపణ వేడి కలిసిమెలిసిఉండుడని నీతిచెప్పినది. వారట్లు సొట్టన్న ఇల్లుచేరిరి. కథకంచికెళ్లింది. మన మింటికొచ్చాం.

## పాటుపడ్డం అంటే

శ్రీమతి ఆదుర్తి సత్యాబాయిగారు

స్వప్రయోజనానికోసమేఅయినా కష్టపడి పనిచేసుకుంటే ఆత్మగౌరవానికి లోపంవస్తుందని చాలా మందిఅభిప్రాయం. మిగతావాళ్ళంతా మన్నిటీదవాళ్ళని ఎక్కడనుక్కునిపోతారో అన్న దురభిప్రాయమే దీనికాధారంగా అవుపిస్తున్నాది. అంచేతే దేశంలో పరిస్థితులిలాగున్నా ఇంకా చాలామంది సోమరులుగా ఉండడమే గొప్పని భావిస్తూండడం మనం చూడగలుగుతున్నాం. కష్టపడి పనిచేసుకోడంలో ఎంతగొప్పతనం ఉందో తెలియకపోడమే దీనికికారణం. సావధానంగా ఆలోచించిచూస్తే ప్రతీపనీ ప్రశంసనీయమైందే. పాటుపడ్డమే ప్రశంసనీయం. కష్టపడిపనిచేయడంలో అంతులేనిగొప్పతనం, విశేషించి పవిత్రతాకూడా ఉన్నాయి. ప్రతీమనిషిలోనూ ఎన్నోఅద్భుతశక్తులున్నాయి. అజ్ఞానంలోపడి వాటిని మరచిపోకుండా నిశ్చయమైనఉద్దేశంతోటీ ఉత్సాహంతోటీ పనిచేసేవారికి లెక్కలేనన్నిఅవకాశాలున్నాయి. మహాత్ముని చరిత్రచూస్తే దీనినిజం ముంజేతికంకణంలాగవుపిస్తుంది. సోమరితనంలోనే ఎంతేనా నిరవకాశత్వంఉన్నాది. పనిలో నీచత్వంఅన్నమాటేలేదు. ప్రతీపనీ సృష్టితో సంబంధంకలిగుంటుంది. అంచేత నిజంగా పనిచేద్దామన్నఉద్దేశమే మానవుణ్ణి సృష్టిచిత్రాలకు సృష్టినిబంధనలకు దగ్గరగాతీసికెళుతుంది. ఇవన్నీఏమిటి. సత్యస్వరూపాలుకావా! అంటే మానవుడుపనిచేస్తే సత్యానికిసమీపంగా చేరుకుంటాడన్నమాట. "నువ్వు చెయ్యగలిగే పన్ని తెలుసుకుని మరి వెనకాముందూఆలోచించకుండా దాన్ని నెరవేర్చవోయీ" అన్న దేఇప్పుడు ప్రపంచంలో మహావాక్యం. ఇదివరకెల్లా మహాత్ములందరూ "నిన్నునీవు తెలుసుకో, ఆత్మజ్ఞానంపొందూ" అని చెప్పేవారు. ఇన్నాళ్ళూ ఆ 'నిన్ను'ను తెలుసుకోడానికి తంటాలుపడ్డాం. ఇహ దాన్ని తెలుసుకోలేమనే నానమ్మకం. ఏమైనా ఇప్పుడుమాత్రం దాన్ని తెలుసుకోడం మనకర్తవ్యంకాదు. ఇప్పుడు మనపనల్లా పాటు

పడ్డమే. పనిచేయుటంలో ఎంతో మహత్తరమైన అర్థం ఉన్నాది. పనిచెయ్యడంవల్లే మనుష్యుడు ప్రజ్ఞావంతుడవుతున్నాడు. ఎందుకూ పనికిరావనుకున్న ప్రదేశాలు శుభ్రపడుతున్నాయి. వాటిస్థానే సౌభాగ్యవంతాలైన పచ్చటిపొలాలూ, సుందరములైన మహానగరాలూ అవుపిస్తున్నాయి. వీటితోపాటు దుఃఖసముద్రంలోకొట్టుకుంటూ, చుక్కానీలేనిపడవలాగ ఇష్టంవచ్చినట్లల్లాపోతూఉండే మానవునిమనస్సు శాంతిమైనమార్గంలోపడి ప్రకాశిస్తున్నది. ఎంతకనిష్టమైనపనైనాసరే చేద్దామనిపూనుకునేసరికి మిగిలిన ఇంద్రియాలతో మనస్సెంత తమాషాగా ఏకీభవిస్తుందో చూడండి. సంశయం-ఆశ-విచారం-కోపం యీగా మొదలైనవన్నీ ప్రతీమనిషిహృదయాన్నీ ఆవరించుకునుంటాయి. కాని ఎప్పుడైతే పనిచేద్దామని నడుంవంచుతాడో ఆక్షణంలో ఈదయ్యాలన్నీ వాటిగుహల్లోకి చెప్పకుండాపారిపోతాయి. దాంతోటి మనస్సు నిష్కల్మషమైపోతుంది. ఆపడ్డకష్టంయొక్క దివ్యమైనకాంతి దావానలంలాగ సంశయాలన్నిటినీ దహనంచేసి మనస్సును తేజస్సుతో నింపేస్తుంది. ఎవడైతే తనప్రపంచంలో చెయ్యగలవన్నీ తెలుసుకుంటాడో వాడేధన్యుడు. అతడు మరేవరం కోరుకోనక్కరలేదు. ఎందుచేతంటారా తనజీవితాన్నంతటినీ నిస్సంశయంగా ఆపని నెరవేర్చడాన్కి ఖర్చుపెట్టగలడు. బ్రతికున్నందుకు ఫలమేమిటంటే పాటుపడ్డమే. పాటుపడేవాడిఅంతరాత్మలోంచి దైవదత్తమైన బలంపైకుబుకుతుంది. తెలియకుండా లోపలదగిఉన్న అద్భుతశక్తులన్నీ బహిరంగపడతాయి. ఉన్నసంశయాలన్నీ నాశనమవుతాయి. దాంతో మనుష్యుడు దైవసమానుడైపోతాడు. నిజంగా ప్రతీపనీ పవిత్రమయిందే. ఆఖరుకది ఉత్తశరీరకష్టంమాత్రమే అయినపనైనాసరే దాన్లోకూడా దైవాంశఉన్నాది. ప్రపంచం ఎంతుందో దీనివైశాల్యం అంతున్నాది. దీనిమహాశిఖరాలు స్వర్గంలోపొడుచుకున్నాయి. శరీరకష్టంతో ముందు ప్రారంభిస్తే క్రమష్యా మనస్సుకు పనిగలుగుతుంది. అప్పుడు తీక్ష్ణంగాఆలోచిస్తేనే ఆశ్చర్యకరమైనవిషయాలెన్నో కనిపెట్టొచ్చు. ఇప్పుడు మనం నోరుపెళ్ళబెట్టిచూసే వాయువిమానాలూ, వైరులెస్సులూ, రేడియోలు ఎలాగొచ్చాయని మీఉద్దేశం. వేళ్ళతెన్నుకుపోయున్న గవర్నమెంటును గజగజలాడిస్తూన్న మహాత్మునిశక్తి, నోబెలుబహుమానంకొట్టిన రామనుగారి శాస్త్రసంపత్తి, టాగూరుమహాశయుని కవితామాధురి-ఆచంద్రతారార్కం వర్థిల్లేకీర్తినిసంపాదించిన భగవత్సింగు ప్రముఖులఆత్మార్పణం ఇవన్నీకూడా దీనియొక్క వేరువేరు పరిణామాలే. ఇంకా ఆలోచిస్తే ఇదేదైవారాధన. దీన్నే ఆరాధనకాదంటే ఆరాధన అన్నపదానికేలోపం. ఎంచేతంటే ఇంతకుమించిన భగవత్ప్రీతికరమైందింకొకటెవ్వరూ కనిపెట్టలేదు. పనిచెయ్యకుండా వ్రతాలూ, నోములూ నోచినంతమాత్రాన్ని ముక్తిరాదు. అలావస్తుందనుకోవడం వట్టివెర్రితనం. నిదర్శనంకావాలంటారా ఒక్కమాటు తలపైకెత్తండి. స్వర్గమందిరంలో భగవంతుడి అంకతలంమీదకూచుని మన్నిచూసి చిరునవ్వునవ్వుతూఉన్న తిలకు, లజపతిరాయి, నెహ్రూ మున్నగు మహానాయకుల్ని చూడండి. క్రీస్తు, బుద్ధుడు, శంకరుడు మున్నగు మతోద్ధారకుల్ని చూడండి. వీళ్ళనేకదూ లోకోద్ధారకులూ మనకి మార్గదర్శులూఅనిమనం నమ్ముతున్నాం. ఇప్పుడు వారిచరిత్రలనొక్కమారు స్మరించండి. ఇదంతాఎందుకూ సాక్షాత్తూ దేముడనుకుంటూన్న మనపక్కలోని గాంధీనిచూడండి. వీళ్ళందరూ ఎంతెంతలేనికష్టాలుపడి ఎటువంటిపనుల్ని చేసారో ఒక్కమాటు జ్ఞాపకంతెచ్చుకోండి. అంచేత నిజంగా భగవంతుడినే సంతోషింపచెయ్యాలంటే మనంకట్టుకున్న గుళ్ళల్లోకివెళ్ళి మొక్కడంకాదు. అసలైనఆరాధనకిస్థలం భూజలావృతమైన యీప్రపంచంఅంతాను. నక్షత్రాలూప్రకాశిస్తూన్న ఆకాశమే దీనికి వజ్రాలువేలాడదీసిన నీలిపట్టుచాందినీ. లోకరక్షణార్థం ఆత్మార్పణచేసిన వీరులచరిత్రాల్ని స్మరించుకుంటూఉండడమే భజన. ఆత్మగౌరవాన్ని లోపంవస్తుందన్నదుర్భ్రమతో తమపన్లుకూడా ఒకడినెత్తిమీదపడేక వాటిని విధ్యుక్తంగానెరవేర్చుకోడమే దివ్యమైన భగవత్ప్రార్థన. ఇల్లాచేస్తేనే ఇహమూ, పరమూను.

# ప్రాచీన బాలరక్షణశాస్త్రోక్తోపాయములు

శ్రీమతి చిల్లరిగె వేంకటరమణమ్మగారు

బాలురను లాలించుట, పాలించుటయందు తలిదండ్రులు సావధానత్వమును, చతురత్వమును వహించుట అవశ్యకము. మూర్ఖులగు తలిదండ్రులు ఆయుర్వేదోక్త శిశురక్షా విధానమును ఎఱుంగక తమ శిశువుల అనారోగ్యమునకు, అల్పాయువునకును కారణభూతము లగుచున్నారనుట నిర్వివాదాంశము. కేవలము అజ్ఞానమువలననే నోరెరుంగని శిశువులు అనేకవిధములగు వ్యాధులకు లోనగుచున్నారు.

ప్రసూతకాలమునుండి పంచవర్షప్రాయమువరకును శిశువులవిషయమై మాత అత్యంత చాతుర్యము చూపవలసియున్నది. మహర్షి చరకాచార్యుడు

మణ్యశ్చధారణీయా కుమారస్య ఖడ్గరురుగజగవయ
వృషమాణం జీవితాం దక్షిణేవిషాణేభ్యోగ్రగణీ గృహీ
తానిస్యుః, ఏంద్రయాదయశ్చౌషధయో జీవకర్షభకౌ,
యాన్యప్యన్యానిచ బ్రాహ్మణాః ప్రశంసయేపురితి.

అని బాలురనుగూర్చి వ్రాసియున్నాడు.

బాలకునికంఠమున నవరత్నములలో నేదియో ఒకరత్నము అలంకరింపవలసియున్నది. ఇంతియేగాక జీవించుపశువులలో పులిగోళ్లు, నల్లలేడియొక్క కొమ్ము, ఏనుగదంతము మొదలగువానియొక్క మీదభాగములు బంగారముతో కట్టించి అలంకరించుటగూడ మిక్కిలి ఆవశ్యకము. ఇంతయేగాక జీవక, ఋషభక మొదలగు బాలరోగనాశకములును, బలదాయకములునునగు ఔషధీరత్నములుగూడ ధరింపచేయవలెను.

పాశ్చాత్యశిక్షాభిమానులగు వైద్యవిశారదులు ఈప్రాచీనరక్షాపద్ధతిని పరిహసించినను వారుగూడ అనేకవిధములగు ఉంగరములు తయారుచేసి విక్రయించుచున్నారు. అట్టి వారుగూడ చిత్రవిచిత్రములగు యంత్రములద్వారా ఆరోగ్యమును కలిగింపజాలుచున్నారు. అయినప్పటికి మిక్కిలి సులభముగా మనము చేయజాలు కార్యమును, వారు అత్యంతకష్టముతో వెదకి వెదకి కనుగొని నెఱవేర్చుచున్నారు.

"నాగదమనా" యను వేరును దగ్గరనుంచుకొనిన పాము లెవ్విధములయినవియుగూడ తాకజాలవనుమాట నిర్వివాదాంశము. మన హైందవదేశీయౌషధమునందుండెడి శక్తిని మన మింకను గ్రహింపజాలకుండుటెంతయు శోచనీయము. విదేశీయౌషధములయందుండెడి శక్తి అనిత్యమును, క్షణభంగురమునునై యున్నది. బాలురు తమకష్టములను స్వయముగా వర్ణించుటకు అసమర్థులగుటచే వారిని కాపాడువారు ముఖ్యముగా శరీరారోగ్యమును గమనింపవలసియున్నది. బాలుర ఆరోగ్యమునకు వారికి ఘృతము సేవింపచేయుటగూడ ముఖ్యమని

మహర్షి సుశ్రుతాచార్యులు చెప్పియున్నారు. దానివలన ఆరోగ్యము, బలము, బుద్ధి వృద్ధినొందు ననియు, భయంకరవ్యాధులు అట్టిశిశువులను తాకజాలవనియుగూడ వ్రాయబడియున్నది.

బాలమంగళఘృతమనియు, నవమంగళఘృతమనియు ఇంకను పలునామములతో నివి కొలుకను ఈయబడుచున్నవి.

## గృహిణీపరిదేవనము

సీ. రీ. పి. ఆంజనేయులు నాయుడు

చదువుసాములమేల్మి భృశంబు లేక
మంత నవనాగరకతా ప్రశోభఁ గొనక
యార్యజనసేవనవిధాన మాత్మఁ గనక
వచ్చితి వమాయకునిరూప మచ్చుపడఁగ.

ఎంతయును దైన్యవృత్తి నాయింటికడపఁ
ద్రొక్కితివి గాదె యతిథిపోలికఁ? గరంబు
గంటఁ దడివెట్టి నీమహాకష్టచరిత
మొరిమమైవినిచితి, వెడందకరఁగిపోవ.

తొలుత నత్యంతవినయానతుండవగుచుఁ
గానిపించి వర్తించితి వానఁ దెలిసి
మచ్చికలు ఘటియించితి వచ్చుపోదల
నాదుహృదయసమాకర్షణమునఁ జెలఁగి.

నీయమేయవిశ్వాసంబు నీదురక్తి
నీదుకార్యకౌశలవిధి నీదుశక్తి
నీదువిద్యాభిరుచియును నీవినూత్న
భక్తిభావంబుఁ గంటి విభ్రమముఁ గొంటి.

నీవు నిరుపమసత్కులాన్వితుఁడ వౌదు
వనుచుఁ దలపోసి యున్నవిద్యాలయమున
కనిచి తిండితీర్థములనెప్పుడును గొఱంత
లవముగల్గక చూచితి గారవమెసంగ.

కొనితెమ్మనఁగు వస్తువితతికిఁ గొదువలేక
నీదు విభవానురక్తికి నియతిలేక
యుండియు నడంగెఁ బతనసముద్యమంబు
నీయపూర్వవేషోన్మేషనిరతిఁ దవిలి.

అనుఁగుఁజెలులు లోకద్రోహకరు పనుంచితాత్ము
లట్లు నినుఁ జేరి కుపథంబునందుఁ ద్రిప్ప
నీవు వారును నేవేళ నేకలీలఁ
బుక్కిటిపురాణములఁ బ్రొద్దుపుచ్చువారె.

అనుదినము మాఁపుఁజేఁపు గృహాంగణముఁ
గాచుకొని వీథిచక్కి నిక్కన్ బరుండి
పడకకురిచీతలంబునఁ బొరలుచుండు
వనుఁగులెదమెచ్చ ఘూకస్వరాళి హెచ్చ.

దాఁటిపోయెను పెద్దలతలపుఁ గనక
యతిశయత్రపావనతముఖారవింద
లగుచు సరిగెడు సాధ్వుల హైన్యదృష్టి
నరసి నైచ్యభావముల నెలార్చిపోక్క?

తెలచు నేనింటనుండని తఱిఁ దొలంగి
మొలకుఁదనమున నల్లరిమూకఁ గలిసి
దుడుకుచెయువుల నొనరించుఁ దోషరువాఁడ
వనివిని వినని చందాన నరుగుదాను.

ఇట్టిదోషప్రపంచ మదెంతయేనిఁ
గడుపునం బెట్టికొని యోర్చఁ గనినఫలమొ!
పూర్ణగ్నాతి నేసుఖనిద్రఁ బొంద నీవు
కలహనం బెత్తికొనిపోవఁ గల్గుటరయ.

ఆంధ్రగృహలక్ష్ములిట్టి నాయనుభవంబు
మదినిగుర్తించి మానసహృదయమొఱఁగి
యర్థ్యానర్థతలను భావాంతరమున
నెంచి జనమండలము నాదరించుటొప్పు.




## తాండవకృష్ణా

శ్రీమతి వావిలాల రాజ్యలక్ష్మిగారు

తారంగంతారంగం తాండవకృష్ణాతారంగం
తారంగంబని సారెకు నాడర వారువీరు జూడవత్తురు కృష్ణ
అందామెనా చెవులా మద్దికాయాలల్లలాడగా
పులిగోరూపతకా మూబొజ్జపై నుండి తూలాడగా
తంథసథిమిథిమితక తై అనచును అందముజూడగ ఆడరకృష్ణ
ముందఱరాముఁడు మురళినిసల్పగ అందముజూడగ ఆడరకృష్ణా
అందమయిన నుదుటాకస్తూరితిలకమూ జారాడగా
తద్దయురాముడు తాళముగొట్టగ విద్దియలుజూపుచు ఆడరకృష్ణా
అందెలుగజ్జెలు సందడిచేయగ మందరధరుడా ఆడరా
కుందనసొకట్లందము మీరగ దంధనతకతకథిమిథి యనుచును.

## వేదాంతము పాట

శ్రీమతి జరుగుమిల్లి రామాబాయమ్మగారు

చిట్టిబొమ్మలపెండ్లి చేసేనె జ్ఞానాంబ చిత్రాము చూడరమ్మా.
మట్టుమీరినలోకమంత బొమ్మలుచేసి దివ్యముగలక్ష్మిదేవి విచిత్ర్యమందే. చి.
భూరిబ్రహ్మాండము బొమ్మరిల్లుగజేసి ధారుణియెల్లపెళ్లరుగుగజేసి
ధరఆకాశము చలవపందిరవేసి తనదుమందిరమవి రేణికుండలుచేసి. చి.
దర శేషవాసకులా కంకణంబుగజేసి తనువుశివునికికన్యదానముచేసి
పనిబూని బ్రహ్మను పౌరోత్యునిజేసి భారతేందిరాదుల పేరంటాండ్లనుచేసి. చి.
తళుకుహారందభని తాళిబొట్టుగజేసి జలధులన్నీ వసంతములుగజేసి
బలుచంద్రాసూర్యుల బాషికంబుగజేసి యిలనుచుక్కలులన్నీ శేషాబియ్యముచేసి. చి.

చారుకీర్తికాకూరిగంధము చేసి మారుతునివింజామరముగ జేసి
సారఓంకారముభేరినాదముచేసి తనదుకొనాంతము తాంబూలముగా జేసి చి.
యిలను శ్రీ శేషాయియాసూనెన్నగ జేసి తనదుశక్తులనెల్ల శ్రమలెడబాపీ
యిలను శ్రీ కాళహస్తియాను నెన్నగాచేసిచెలగు సుబ్రహ్మణ్య తేరానుభైరవి. చి.

## మోక్షముపాట

శ్రీమతి యస్. వి. సరళాదేవిగారు

ఘల్లుఘల్లుఝంకారం జేసేగజ్జలు పావడాలడిగితినా
అందముగానీనడుమున వెలిగే బంగరువడ్డాణమడిగితినా
మోక్షములియ్యవెలక్ష్మి నీమోక్షపుకృష్ణునిగూడి
శ్రీకంఠసవరంరాగిడిబిల్లా లోకమాత నిన్నడిగితినా
కేతకిచెక్కినబంగరుగొలుసులజరుకుప్పెలు నిన్నడిగితినా మో.
ఆదిలక్ష్మి నీహస్తమున వెలిగే అరిడీవోలీఅడిగితినా
అందముగానీకంఠమున వెలిగేబంగరుకంఠీలడిగితినా మో.
అందముగానీముక్కున వెలిగేముక్కరలిమ్మనిఅడిగితినా
కమ్మకొన్నముత్యాలుకూర్చిన కానుకబావిలీలడిగితినా. మో.
గరుడవాహనమెక్కిదంపతుల, గూడిరమ్మనియడిగితినీ
వేడుకతోమాదంపతులకు నేడువైకుంఠములిమ్మనియడిగితినీ. మో.

## రామునిభజన

శ్రీమతి అచంట సత్యవతమ్మగారు

"చింతిలకమ్మా! మన శ్రీరామునికొఅకు మదిని"వలె. పల్లవి: చింతసేయరే మన శ్రీరామునిచరణములను.
శాంతమానసమున హనుమంతునివలె మంతనమున
ఏకాంతముగాను హృదయమాకాంతుని వశముచేసి. చింత.
అజరుద్రాదులకైనను అమరేంద్రులకైనను అలవికాని
అచ్యుతునద్భుతమహిమాదులపొగడగ. చింత.
యజ్ఞయాగదానతపోయమనియమ శమాదులలో
భక్తికిమించినయోగము ముక్తిపరులకిలలోకలదె? చింత.
సాకేతపురాధినాధులే యితరులు సాటిరారు
జాగేలనుసేవజేయ భోగేచ్ఛలువదలిరండు. చింత.
మన్నింపుము మమ్మనుచును మాధవమధుసూదనయని
మననముసేయుచునుమదిని మారామునిభజనపరులు. చింత.
విమలశీలు కమలనయను అమలచరితు భ్రమలహారితు
ప్రేమలీల శ్యామలాంగు కోమలాంగు తెపుడుమదిని. చింత.



## నోబిల్ శాంతిబహుమానమందిన స్త్రీ:—

"నోబిల్ బహుమానములు ఏర్పడి ఏళ్లుగడిచినవి. అయినను అందలివివిధబహుమానములలో నొక్కటి గూడనొక్కసారిగూడ స్త్రీకి ఈయబడలేదు. 1931-వ సంవత్సరమున నోబిల్ శాంతి బహుమానము డాక్టరు నికలస్ ముర్రేబట్లరుఅను పురుషునకును, మిస్ జేనుయాడమ్సుఅను స్త్రీకిని సమముగా పంచిఈయబడెను. నేటి రేట్లప్రకారము ఈబహుమానముయొక్క విలువ 9,527 పౌనులు. ఇదివఱ కీయబడిన మొత్తములన్నిటికంటె ఇది పెద్దది. ఈబహుమానమున భాగస్వామియగు డాక్టరు బట్లరు కొలంబియా యూనివర్సిటీ అధ్యక్షుడు, అమెరికాదేశస్థుడు, శాంతివిషయమున అమితముగ కృషిసలిపినవాడు, కెల్లాగు ఒడంబడికకు రూపసిద్ధినిచ్చిన ప్రముఖులలో నొకడు, ఐరోపాఖండమున పలుబడివత్సరములుగ పలుసారులు ప్రయాణములు చేసినవాడు, అందలి వివిధదేశముల ఏలికలకు అతిథియైయుండినవాడు. ఇక మిస్ జేనుయాడమ్సు. ఈమెయు అమెరికా దేశస్థురాలే. సాంఘికసేవాపరాయణులగు నేటి స్త్రీలలో ఈమె ఒకరత్నము. తన ఇరువదితొమ్మిదవసంవత్సరమున ఈమె చికాగోనగరమునందు 'దిహల్ హౌసుసెటిల్ మెంటు' ఏర్పఱచినది. అచిరకాలముననే అది సమగ్రాభివృద్ధినంది ప్రపంచమునందలి అట్టిసంస్థలకు మాతృకయైనది. స్త్రీల అంతర్జాతీయ శాంతిసంఘమునకు ఈమె అధ్యక్షురాలు. ఈశాంతిమతి కిప్పుడు డెబ్బదియొక్కసంవత్సరములు. ప్రస్తుతము ఆరోగ్యము సరిగాలేనికారణమున బాల్టిమోరు ఆసుపత్రియందు ఉన్నది. నోబిల్ బహుమానముబు పుట్టినదేశమగు నార్వేయందలి సుప్రసిద్ధ విశ్వకళాపరిషత్తుఅగు ఓస్లావిశ్వవిద్యాలయమున చారిత్రకాధ్యాపకులగు హాల్ వాడన్ కోహట్ గారు ఈమెను గూర్చి ఇట్లుచెప్పియున్నారు: "ప్రపంచమును శాంతిధామముగా చేయుటకు సహకారులగు స్త్రీగుణములకన్నిటికిని శ్రీమతి యాడమ్సు జీవన్మూర్తి." ఇట్టివారికి నోబిల్ శాంతి బహుమానమునిచ్చు ప్రకటనము ఓస్లాలో నార్వేరాజగు హాక్కన్ గారి సమక్షమున, యువరాజగు ఒలాఫ్ గారి సమక్షమున చేయబడెను. నోబిల్ బహుమానమందిన స్త్రీలలో యాడమ్సుగారు ప్రథమురాలు. ఆమెకీబహుమానమిచ్చుట ప్రపంచస్త్రీలు విశ్వసౌభ్రాతృత్వమునకు, విశ్వమానవశాంతికి గావించుచున్న సమగ్రప్రయత్నమునకు యోగ్యతాపత్రమిచ్చుట, స్త్రీశక్తికి కేలుమోడ్చుట."

—*Ceylon Daily News.*

## ముగ్గులు:—

"పూర్వకాలమున మనభారతరమణీమణులు అనేకవిధములయిన ముగ్గులు నేర్చుకొనియుండెడివారు. ఏపండుగ పర్వములకును ఇండ్లుకడిగి, ఎఱ్ఱమన్ను పెట్టి, ముగ్గులు చిత్రవిచిత్రములుగా వేయుచుండెడివారు.

అప్పుడప్పుడు నవనాగరికులు దానిని వాడుక చేయుట మానివేసిరి. అట్లనిపూర్తిగా మానిరనికాదు. ఇప్పటికిని ప్రతిహిందువుల గృహములయందును ఉదయము, సాయంత్రము వీథులలో నీళ్ళుజల్లి ముగ్గులుపెట్టు అలవాటు యున్నది. అయినప్పటికి పూర్వమున్నంత ఎక్కువగ లేదు. పూర్వము ఒక పండుగవచ్చుచున్నదంటే ఒకవారము ముందునుండి ఇండ్లగోడలకు సున్నము వేయించుట, గడపలకు పసుపుకుంకుమలు పెట్టుట, తోరణములు కట్టుట మొదలైనవి చేయుచుండెడివారు. ప్రతిఇంటిలోని కుమారికలకు ఈపనులు మిక్కిలి ఉత్సాహముగలిగించి ఒకరితో నొకరు పోటీలువేసుకొని చేయుచుండెడివారు. ఇప్పటిబాలికలు వీథిలోనికివెళ్లి ముగ్గులుపెట్టుట అవమానకరమని ఎంచెదరు. ఇప్పటిబాలికలు పండుగలువచ్చినయెడల ఒక నెలక్రిందటనుండియు వారి తల్లిదండ్రులను నాకు బొంబాయిసిల్కుచీర గావలెనని కొందరు, నాకు జపానుసిల్కుచీర గావలెనని కొందరు, నాకు కాంచీపురము అంచుచీరెలు కావలెనని కొందరు ఇట్లు అనేకవిధముల తెచ్చియిమ్మని తల్లిదండ్రులను బాధించుచుందురు. ఇంక భక్ష్యములనుగురించి నాకు మైసూరుపాకుఇష్టము అదియే చేయుమని కొందరు, నాకు బూరెలు, ఒబ్బట్లుఇష్టము అది చేయుమని కొందరు, నాకు ఫేణీ, జిలేబిమాత్రముఇష్టము అదియే చేయుమని కొందరు ఇట్లు భక్ష్యములనుగురించియు వాదించువారేగాని ఒక్కరయినను ముగ్గులవిషయమయి ఎంతమాత్రము శ్రద్ధవహించుటలేదు. ఏదో అలవాటుచేత మామూలుగా ఇంటిపని చేయుమనిషి చేత వీథిలో రెండుగీతలుగీయించుచున్నారు. ఆపనిచేయువారు తమఇంటిలో పండుగచేయవలయునని మరింతతొందరగ దినముకన్న త్వరితముగా ముగ్గులనుపెట్టి పోయెదరు. బాలికలు ఈపనులయందు కడుశ్రద్ధవహింపవలయును. మన పూర్వీకులకాలములో ఎంతయో చక్కని ముగ్గులుపెట్టుచుండెడివారు. వారిచేతనైన నాగరికమైనపనులు మనచేతగాదనియే స్పష్టముగా చెప్పవచ్చును. ముగ్గులుపెట్టుటబాగుగ అలవాటుపడినయెడల అనేకవిధములయిన లతలు మొదలైనవి చీరలకు, రవికలకు కుట్టవచ్చును. ముగ్గుపెట్టుట కలవాటుపడినవారు, చిత్రలేఖనము బాగుగ అలవాటుపడినవారు కుట్టుపని బాగుగచేయగలరు. కావున ఓభారతబాలికామణులారా! యికమీదటనైనను తప్పక మీరు చక్కగాముగ్గులను పెట్టనేర్చి ముగ్గులయందు శ్రద్ధవహించి మనపూర్వపుటాచారమును వదలక ఇండ్లకు లక్ష్మీకళకలుగజేయుదురని కోరుచున్నాను."

—నీలాపాశెం సుబ్బరత్నమ్మ.

## రైలుస్టేషనునందు బుక్ స్టాల్ కంట్రాక్టు:—

"ఈస్టుఇండియా రైల్వే (E. I. R.) కంపెనీవారు తమ రైలుస్టేషనులయందు బుక్కుస్టాల్సు ఏర్పఱచు కంట్రాక్టుకు టెండర్లుపిలిచినారు. రైల్వేపరిపాలనమున ఇదియొక నూతనవిషయము. భారతశాసనసభలో జరిగిన ఆందోళనమున కిదియొక ఫలమనవచ్చును. ఈసందర్భమున దక్షిణభారతదేశమునందలి రైలుస్టేషను బుక్కుస్టాల్సు విషయమున ఏమిజరుగుచున్నదో చూడగోరెదము. వత్సరములుగ ఇచ్చటి కాంట్రాక్టులను హిగినుబోథామ్సువారే పొందుచున్నారు. వారిరేట్లు ఎప్పుడో ఏర్పాటయియున్నవి. బహిరంగముగ టెండర్లు పిలిచి వ్యాపారము చేయుచో ఎక్కువ మొత్తము రాగలదు. ప్లాటుఫారములమీది ఇండియను రిఫ్రెషుమెంటు రూములు, పళ్లఅంగళ్ళవిషయమున బహిరంగముగ టెండర్లను పిలుచుటతోడనే ఆర్థికముగ చాల లబ్ధికనిపించినది. ఈక్రొత్తఆదాయమును పోనాడనేల? ప్రత్యేక మొకకంపెనీవారిపై అభిమానమును చూపనేల?"

—*The Indian Railway Magazine.*

## దుండగీళ్ళగు స్త్రీలు:—

"ఇండియను సివిలుసర్వీసులో నడిసన్న అధికారులలో నొకడగు స్టీవెన్సుగారిహత్య స్త్రీలచే నిర్వహింపబడినది. హిందూదేశమునందలి దుండగీకముయొక్క చరిత్రయందు స్త్రీలు రాజకీయమగు హత్య

గావించుటకిదియే మొదలు. ఈహత్యను రష్యాదేశపుచరిత్ర ఎంతవఱకు ప్రేరేపించినదో తెలియరాదు. దుండగీడ్రగు స్త్రీలతో రష్యాదేశపుచరిత్ర నిండియున్నదనుమాట మాత్రము సత్యము. జారుప్రభుత్వకాలమున జెనరల్ ట్రెపాఫ్ (General Trepoff) రాజద్రోహకురాలగు స్పిరిడోనోవా (Spiridonova) చే హత్యచేయబడెను. 1918 సెప్టెంబరుమాసమున జరిగిన లెనిన్ (Lenin) చంపుటకైన, నెగ్గుమొగుడలకువచ్చినట్టి కుట్రకు డోరా కాప్లన్ (Dora Kaplan) అను మఱియొక దుండగురాలు కారణము. ఈ ఇరువురు స్త్రీలును ఉన్నతవంశ సంజాతలే, ఉద్రిక్తస్వభావలే. అన్నిరీతుల దుండతకమున అదర్శము తీవ్రమైన అంటురోగమే. స్త్రీలు సాహసమువహించుచో వారుతెలుచుగా పురుషులకంటె హెచ్చుసాహసమును చూపగలరు. హిందూస్త్రీలు చేసిన ఈహత్యను గాంధిగారును, ఇతరకాంగ్రెసుప్రముఖులును నిరసించియున్నారు."

*—The Illustrated weekly of India.*

## చంటిపిల్లలకు ఉచితముగా పాలసరఫరా:—

"దరిద్రులగు బెంగాలీకాయస్థకుటుంబీకుల చంటిపిల్లలకు మంచిపాలు ఉచితముగా పంచిపెట్టు ఉద్దేశముతో ఒకసంస్థను త్వరలో ప్రారంభింపనున్న విషయము అడ్వాన్సు పత్రికాముఖమున శ్రీమతి బి. దాసు సతిగారు తెలిపియున్నారు. పేదవారి శిశువులకు పాలుఉచితముగానిచ్చు సంస్థలు కలకత్తాలో కొన్నిగలవు. కాని కలకత్తావంటి పెద్దపట్టణముయొక్క అవసరమునకు అవి చాలవు. కావున చిత్తరంజన శిశుసేవాసమితి అనుపేరుగల ఈక్రొత్తసంస్థకు మేము స్వాగతమిచ్చుచున్నాము. ప్రస్తుతము పాలసరఫరా కాయస్థకుటుంబీకుల శిశువులకు మాత్రమే ఇచ్చుటకు (ధనాభావమున) నిర్ణయించుటమైనది. ఈసంస్థ అచిరకాలముననే పుష్టినొంది ఎల్లరిశిశువులకు పాలుసరఫరా చేయగలుగునని గాఢముగ నమ్ముచున్నాము."

*—Advance.*

## పార్లమెంటు : స్త్రీలు:—

"మొన్నటిఎన్నికలలో అరువదిఒక్కరుస్త్రీలు అభ్యర్థినులుగా నిలచిరి. వీరిలో పదునైదుగురుమాత్రము ఎన్నుకొనబడిరి. ఈపదునైదుగురలో పదముగ్గురు యూనియనిస్టులు (Unionists); ఇరువురు ఇండిపెండెంట్లు (Independents) లేబరుపార్టీకిచెందిన ఒక్కస్త్రీగూడ ఈసారియెన్నుకొనబడలేదు. ఈక్రింది పట్టీకలన ఈఎన్నికలలో జయముగాంచిన స్త్రీలనామములు, వారు అభ్యర్థినులుగానిలిచిన ప్రదేశములు తెలియగలవు.

యూనియనిస్టులు

1. యస్. రంజిసతి—రోథర్ హైక్.
2. మిస్. యమ్. గ్రేవ్స్—సౌత్ హాక్నీ.
3. హోనరబుల్ మేరీ ఎ. పిక్ఫర్డు—నార్తు హామర్స్మిత్తు.
4. మిస్. టి. కాజాలెట్—ఈస్టు ఐలింగ్టన్.
5. వైకౌంటెస్సు నట్టన్ఆస్టర్—ప్లిమత్.
6. కౌంటెస్సు అఫ్ఇరన్—సౌత్ఎండ్ఆన్సీ.
7. డచ్చెస్ ఆఫ్ఎథోల్ట్లు—కిన్రాస్అండ్ వెస్టరన్.
8. హెచ్.బి. టేట్ సతి—డబ్లుయు విల్లెస్ డెన్.
9. మిస్ ఇరన్ వార్డు—వాల్సుఎన్డు.
10. ఐ. కోప్లాండ్ సతి—స్టాక్ఆన్ట్రెంటు.
11. యస్. ఎ. వార్డుసతి—కోవాక్ స్టాప్స్.
12. హెచ్ షాసతి—బోత్ వెల్.
13. మిస్. యఫ్. హార్స్బ్రూ—డండి.

ఇన్డిపెండెంట్లు

14. మిస్. యమ్లాయిడ్జార్జి—ఆంగ్లసీ.
15. మిస్. ఇ. రాత్బోన్—కంబైన్డ్ ఇంగ్లీషు విశ్వవిద్యాలయములు.

ఇందు వైకౌంటెస్సు నట్టన్ఆస్టరు, కౌంటెస్ఆఫ్ఇరన్, డచ్చెస్ఆఫ్ ఎథోల్ట్లు, మిస్యమ్. లాయిడ్ జార్జిగార్లు గతపార్లమెంటునందును సభ్యులుగానుండిరి."

*—The Manchester Guardian.*

అమెరికను కళాశాలలు: స్త్రీవిద్య:—

"ఇప్పుడమెరికాలో ఎక్కడజూచినను కళాశాలవిద్యగడించిన స్త్రీలున్నను గృహతంత్రమును బోధించు ఉపాధ్యాయినిలుగను, కాఫీహోటళ్ళలోను టీ పానీయశాలలలోను డైరక్టరుపదవులును, షాపులలో విక్రేతలుగను, ఆసుపత్రులలో రోగులకాహారమొసంగువారుగను, పారిశ్రామికపత్రికలను నిర్వహించు సంపాదకురాండ్రుగను ఇట్టిపదవులలో ప్రవేశించుటకు చాలినంతమందిమాత్రము లేరు. ఇట్టిపదవులకర్హలనుగా స్త్రీలను జేయుటకవసరమగు పాకశాస్త్రము, గృహతంత్రము (Home Economics) అను విషయములను ప్రత్యేకముగ బోధించు ఉపాధ్యాయవర్గము ప్రతివిశ్వవిద్యాలయావరణలోగలకళాశాలయందును రసాయనిక, ప్రకృతిశాస్త్ర న్యాయ, వ్యవసాయిక, వైద్యసంబంధములగు శాస్త్రములతోపాటు పైనపేర్కొనబడిన స్త్రీలకుపయోగించు విషయములనుకూడ బోధించుటకు నియమింపుచున్నారు. ఈగృహతంత్రమునకు సంబంధించినవిషయములనేగాక యితరములగు వైజ్ఞానికములగు విషయములనుకూడ ప్రత్యేకగణ్యతతో స్త్రీలు చదువగలుగుచున్నారు. అందు ముఖ్యముగా వైద్యసంబంధములగు శాస్త్రములనుచదువుచున్నారు. ముఖ్యముగ రసాయనికశాస్త్రము, దంతశాస్త్రము మొదలగునవి. అచ్చటిస్త్రీలలో కొలదిమందిమాత్రము న్యాయశాస్త్రము, శిల్ప వాస్తుశాస్త్రములు, కట్టడములకుసంబంధించిన యింజనీరింగుశాస్త్రముల నభ్యసింతురు. మొత్తముస్త్రీలభ్యసించుశాస్త్రములన్నియు (Home Economics) గృహనిర్వహణశాస్త్రమునకు సంబంధముగలవియే. స్త్రీల కుపయోగించు యిట్టిశాస్త్రములు కళాశాలలందు బోధింపబడుటచేతనే స్త్రీలధికముగ కళాశాలలో చదివి కృతార్థులగుచున్నారు. ఈశాస్త్రములను బోధించుటకు కడుసమర్థులగు స్త్రీలున్నారు. విస్తృతమగు పరికరములు ప్రతి కళాశాలయందును సమకూర్పబడుచున్నవి. అయోవాపరగణాలలోగల వ్యవసాయికకళాశాలలోను యంత్ర నిర్వహణకళలు (Mechanical Arts) నేర్పు వేరొకకళాశాలలోను గృహతంత్రమునుగూర్చి బోధించు శాఖ యత్యుత్తమమైనదనియు, అట్టిశాఖ అమెరికాసంయుక్తపరగణాలలో ఏకళాశాలలోకూడ లేదని అయోవా పరగణాలకు చేరిన స్త్రీలు సగర్వముగ చెప్పుకొందురు. అయోవాపరగణాలో పైన పేర్కొనబడిన కళాశాలలో వెయ్యిమంది స్త్రీలు ప్రతిసంవత్సరమున 'గృహతంత్ర' విద్యలలో నుత్తీర్ణులగుచుందురు. ఆకళాశాలలో ఒక్కొక్క గృహనిర్వహణశాఖలో ప్రత్యేకప్రవీణతనందిన ఉపాధ్యాయినులరువదిమందికలరు. పూర్వపు పద్ధతి గృహతంత్రమున వంటవండగలుగుట, కొంచెము కుట్టుపని నేర్చుటయే. ఇప్పటి గృహతంత్రము అతి విస్తృతమై వివిధశాస్త్రోపశాఖాబాహుళ్యమైనది."

—అకుండి వేంకటశాస్త్రి.

*Modern Review.*

మాతాజీ కస్తూరిబాయి నిర్బంధింపబడినది:—

"జనవరి నాలుగవ తేదీని మహాత్మాగాంధిగారు నిర్బంధింపబడినపుడు శ్రీమతి కస్తూరిబాయివెక్కెను, ఏడ్చెను. 'వారు నన్నుగూడగొనిపోవరా?' అనెను. గాంధిజీ మందహాసముమాత్రము చేసినాడు. మాతాజీ వాక్యములు ఎంతనిష్కపటములో, ఆమెభావములు ఎంతఉద్వేలితములో పెరుమాళ్లకు తెలియును. ఆమె హృదయవాంఛ ఇపుడు నిండారినది. ఒకవారముదినములు గడచినవి. ఋషియగు తనభర్తవలె ఆమెయు జయిలునందుంచబడినది."

*—Amrita Bazaar Patrica.*

షౌకత్ అలీకి తమమతస్థులచేతనే చివాట్లు:—

"షౌకత్ అలీ మహాత్మునిఅభిప్రాయములతో ఏకీభవింపకుండినందులకు మేమేమియు ననము. కాని ఆఅభిప్రాయభేదములను విదేశములందు కొండంతలుగాచేసి అయినప్పుడు కానప్పుడు ఉపన్యసించుచుండుట-

ఉపన్యసించుటలో మర్యాదనతిక్రమించుట మహమ్మదీయులకు గౌరవము తెచ్చునదికాదు. ఇట్టి ఉద్రిక్త భావములకు ఈజిప్టుజాతీయులు స్వాగతమీయజాలరు."

—*Egyptian Gazette.*

**నాట్యకళోన్మత్తమైన జర్మనీ:—**

"జర్మను దేశీయులంతా సంగీతపాఠకులేనా? సంగీతమే వారి మాతృభాషా?...ఆమరునాటి ఉదయం, ఇంకా ఆరుగంటలైనాకాలేదు. నాకిటికీక్రిందనుండి యెవ్వరో పాటలుపాడుతూ నన్ను మేలుకొలిపారు... ఆయువతీయువకులు యెంతఅందంగావున్నారు! ఎంతకులాసాగా వారు పాడుతూసాగిపోయారు! వారు పాడుటవల్ల ఆవాతావరణమంతా ఎల్లా సంగీతమైపోయిందీ! మళ్ళీ, ఆరాత్రి హోల్ బ్రాన్ లో నాకు దూర దూరాన్నుంచి వినబడుతోనేవున్న దేమిటది? ఆదంతా నిశ్శబ్దమైనఅంధకారం...కాని దూరాన్నుంచి మెల్ల మెల్లనైన ఆధ్వని మృదువుగాజారి వినబడుతోవుంది...ఔను—అది పాడడమే! ఏనృత్యశాలలనుండియో, ఏఉపవనసీమలనుండియో. అది మనుష్యులకంఠస్వరమే! సంకులమైనశబ్దాలూ, వికటాట్టహాసాలూ, మోటుసరసాలు కావవి; అంతిమస్వరస్థాయీలవద్ద దీర్ఘంగా, ప్రేమగావిడవలేక అంటిపెట్టుకోవడంతో కూడిన మనోహరస్వరసమ్మేళనతో పాడబడిన సరదాఐనపాటలేఅవి! ఇది రజనీవాణియేఐనయెడల, అది జర్మనీదేశపు వాణి. సంగీతం—హృదయంలోనూ, పెదవులమీదా కలకాలము సంగీతమే!...ఈనిరంతరసంగీతం నన్ను మొట్టమొదట ఆనందపరచింది, కాని చివరకుమాత్రంతప్పని సరిగా విషాదభారమే కలిగించింది. ఏమంటే, నాఆత్మను పడ కించివేసే లోలోపలిగుసగుసలేవో వినబడుతున్నట్లుగావుండేది. ఈయువతీయువకులు ఈనాటికిమాత్రం ఆనందంగానేవున్నారు, కాని రేపటిరోజున వారికి యేమిరాబోవుతుంది? ఈమనోహరమైనబయళ్లూ, పర్వతాలూ, పురాతనమైనపట్టణాలూ వీటిమీదపొంచుకొని యేదోఒకరహస్యవిధివిధానం వేచివుండుటలేదా? ఏమంటే, జర్మనీఅంటే ఆటపాటలుమాత్రమేకాదు. అది దుఃఖం, నాశనము, వైషమ్యం, అసహనమూ కూడాను. చెవియొగ్గి జాగ్రతగావినండి; సంగీతపురోభాగమేకాక గుసగుసలాడే తీవ్రమైనఅసమ్మతి, ఆగ్రహపూరితమైనబెదరింపూ, వీటిధ్వనిసంకులంకూడా వినబడుతుంది. ఆపద యీభూమిని ఆవరించుకొనివుంది. విప్లవ మాద్వారసీమలయొద్ద వేచుకొనివుంది. యౌవనప్రపంచకము అన్నిచోట్లా సరదాగావుంటున్నారంటే సరదా వారిభాగ్యవిధానంకాబట్టి. వారు జర్మనీలో సరదాగావుంటున్నారంటే వారితండ్రులవలెనే వారూ బహుశాచచ్చిపోవలసివచ్చినా, జర్మనీమాత్రం జీవించకతప్పదని వారు కృతనిశ్చయులైవున్నారు కనుకా... రాజకీయంగానూ, ఆర్థికంగానూ, జర్మనీ తీవ్రతరమైన ఒక అంతరోద్రేకంచేత ఉత్తేజితమైవున్నదంటే కావచ్చును; కాని విషాదమయభావాలూ, డబ్బులేకపోవడం, ప్రపంచకమంతా వీటిచేతనే నిర్మింపబడలేదు. బెర్లిన్నగరమునకు తనవిచారాలు తనకువుండవచ్చును. చాలమంది బెర్లిన్నివాసులకు అత్యల్పమైన ధనంమాత్రమే వుందన్నదికూడా నిజమే; కాని జీవితంయొక్క హావభావోల్లాసితమైనపక్షంమాత్రమచ్చట యథావిధిగాముందుకు సాగిపోతోనేవుంది. ఇదిచాలా క్షేమకరమైన సంగతి. ప్రజలునవ్వుతూ, నాటమాడుతూ, క్రీడాపరులై కులాసాగా నేవుండకపోతే, వారింతకంటె కోపదారితనంగా వుండవలసింది; రాజకీయపరిస్థితి అప్పుడింతకన్నా విషమతరమైవుండేదే. నాట్యమందిరాలిప్పు డచ్చటవిశాలములైన ప్రహసనాలతోనూ, సుఖాంతములైన ఆటలతోనూ పఱదలుకట్టుతున్నాయి. ఏదోవిధంచేత ప్రజాదృష్టిని ఆరికట్టేటంతటి అసాధారణమయినదయితేనే తప్ప, సామాన్యంగా యేదైనాగంభీరవిషయాన్నిగూర్చి వ్రాసిన సినిమాకథతో ఒకవ్యవస్థాపకుడిదగ్గరకు వెళ్ళడం ఆట్టేఉపయోగంలేదిప్పుడు. కాని హాస్యరసపూరితమైన కథలు ఆత్యాతుర

తతో స్వీకరిస్తారు. నాటకశాలలుకూడా యిప్పుడదే అవస్థలోవున్నాయి. ఇక్కడ 'అవస్థా'శబ్దం యెందు కంటే, జర్మన్ నాట్యరంగానికి, ఎప్పుడూలాగే, యిప్పుడుకూడా సుఖాంతనాటకాలు మంచివిలేవు. నాట్యశాలలూ, విందులుజరిగేస్థలాలూ, సరదాగాకాలయాపనం చెయ్యాడంకోసమై స్త్రీపురుషులు సమావేశమయ్యే ఇతరప్రదేశాలూ, ఇంకా జనసమూహాలతో కిలకిలలాడుతూనేవున్నాయి. ఉన్నంతకాలం అవిఅల్లాగే వుంటాయి; ఏమంటే, అవి ఇంతట్లో బయలుదేరి, అంతట్లో అంతరించిపోతూవుంటాయి; లేచితలయెత్తుతో వుండగానే, విస్మయకరమైన వేగంతో దివాలాయెత్తేస్తూవుంటాయి. అవిఎప్పుడూ కిటకిటలాడుతో నిండుగానేవుంటాయి. కాని ప్రజలు అక్కడసాధ్యమైనంత తక్కువగానే ఖర్చుపెడతారు. 'షాంపెయిన్' పానీయంత్రాగేవారు 'బీర్' వుపయోగిస్తారు. 'రైన్‌సారాయి వాడేవారు, కాఫీ'తోనే తృప్తిపడిస్తారు. కాని ఒక్కటిమాత్రం వారికివుండితీరాలి. వెలుగురంగుల చలనోచ్ఛ్వాలనములు, 'జాజ్ బ్యాండు'యొక్క కలచివేసే ధ్వని, నాట్యంయొక్క ఉన్మత్తపరిభ్రమణం. ఇదంతాతీవ్రమైన ఆర్థికపతనంయొక్క విషమావస్థమీద చాలా చిత్రమైనవ్యాఖ్యానం. ఈచలికాలం పేరుచెప్పి, ప్రజలకందరికీనీ వుద్దేశింపబడిన విందులు మూడువందలవరకూ నిర్ణీతములైవున్నాయి! కాని, ఉన్నదున్నట్లుగా చెప్పాలంటే, వాటిల్లోచాలావరకూ 'ఉచితపువిందులే.' పైపైనమాత్రమే చూసేపరిశీలకుడెవరైనా జర్మనీదేశపు రాజధానికివచ్చి, ఇదంతాచూసేసరికి ఇల్లా అనిపిస్తోవుంటుంది: "కష్టదినాలు వొచ్చాయనడం యెంతనిరర్థకమైనమాట! ఏమిటి ఈప్రజలంతా నాట్యమాడిపోతోంటేనే!" ఈమాజిరి పరిశీలకుల్లో పెద్దపెద్దవిదేశీయపత్రికల ప్రత్యేకప్రతినిధులుకూడా చాలామంది కలిసివున్నారు. వారిచరిత్ర వారికి తెలియదో, లేకమరిచిపోయారో వాటర్లూ యుద్ధపుసాయంసమయంనాటి మహోత్సవంవారు జ్ఞాపకముంచుకోవాలి. ప్రయత్నించి వారు కొంచెములోతుకు తరిచిచూడాలి. ప్రయత్నించి ఈనాట్యమాడేవారితో కొంచెము పరిచయంచేసుకొని, వారి అంతరంగాలమరుగున నిజంగాఏమి దాగివున్నదో వారు కనిపెట్టాలి; (దానితో దగ్గరసంబంధమున్నవిషయమది) వారిజేబుల్లో ఎంతడబ్బువుందో కూడావారు తెలిసికోవాలి. వారు నాట్యమాడుతున్నారు; నాట్యమాడనిండు! వారునవ్వుతున్నారు; పోనీ, నవ్వనియ్యండి! విస్మృతత్వంలో వారుగడిపే ఆకొలదిపాటి అల్పక్షణికాలే వారికున్న ఒక్కజీవనౌషధమూను. ఆజీవనౌషధం వారికి ఎంతగానో అవసరమైవున్నది. నిరపాయమై, ఖర్చులేని ఈజీవనౌషధసేవనమల్లా జర్మనీకి, తక్కిన ప్రపంచానికీకూడా మంచిమాటే." (హోమ్రూ)

—కస్తూరి రాజా మాణిక్యము.

—*From the Sunday Chronicle.*

## ఆడపోలీసుదళము:—

"స్త్రీలు జాతీయోద్యమములో నధికముగ పాల్గొన మొదలిడినకొలదివి స్త్రీనిర్బంధితురాండ్ర సంఖ్య పెరిగిపోవుచున్నది. వీరినిమిత్తము వివిధరాష్ట్రములలో ప్రత్యేకకారాగృహము లేర్పడుచున్నవి. పాశ్చాత్యదేశములలో ఆడపోలీసువారున్నటుల వినుచుందుము. కాని హిందూదేశమునం దింతవరకు, ఇట్టి ఏర్పాటు జరిగియుండలేదు. కాని, ఢిల్లీ పోలీసుసూపరింటెండెంటుగారు ఆడపోలీసుదళము నేర్పరచుటకు నిశ్చయించిరనియు, దీనియందు జేరుటకు ఇష్టమున్నవారు చేరవచ్చునని ప్రకటించిరనియు, ఆడపోలీసువారికి ప్రత్యేకపు దుస్తులును, వసతిగృహములును ఏర్పాటు చేయబడుననియు, ఆడపోలీసువారు ఆడవారితో మాత్రమే జోక్యము కలుగజేసికొందురనియు వార్తలు తెలుపుచున్నవి. ఢిల్లీలో నీప్రయత్నము కొనసాగుచో, హిందూదేశమందంతటను నిట్టియేర్పాటు జరుగవచ్చును. పురుషులకును స్త్రీలకును అన్నిశాఖలలోను సమానమగు హక్కులను గోరుచున్నపుడు పోలీసుశాఖలోగూడ స్త్రీలు సమానస్థానమాక్రమించుట వింతగాదు. ఇటులనే

సైన్యమునందుగూడ స్త్రీలపటాల మేర్పడిన నేర్పడవచ్చును. ప్రాచీనకాలమున హిందూదేశమునందు స్త్రీలు శౌర్యధైర్యప్రతాపముల జూపిన నిదర్శనములు పెక్కులుగలవు. మరల నట్టిస్థితి హిందూదేశమున నరుదెంచు చిహ్నములు గనుపట్టుచున్నవి. వింత యేమన ఇంగ్లండుమున్నగు యూరపియను దేశములలో స్త్రీలు వోటింగు హక్కులబడసి, పార్లమెంటు సభ్యురాండ్రగుటకుగాను ఎన్నియో ఆటంకముల నెదుర్కొనవలసివచ్చెను. స్త్రీలకోర్కెలను పురుషులు సామాన్యముగ నంగీకరింపరయిరి. సఫ్రెజిట్టుఉద్యమము ప్రారంభమై, స్త్రీలు తమహక్కులనుబడయుటకు చాలకష్టముల నెదుర్కొనవలసివచ్చెను. ఇప్పటికిని స్త్రీలవిషయమున నిషేధము లింకను పెక్కులుగలవు. స్త్రీస్వాతంత్ర్యము లేదనియెంచబడు హిందూదేశమునందుమాత్రము స్త్రీలకు ఎన్నిక హక్కులనిచ్చువిషయమునను, వారు శాసనసభలలో ప్రవేశించు విషయమునను గూడ పురుషులనుండి ఎట్టి యాటంకముగలుగలేదు. హిందూదేశమునందు స్వరాజ్యము లభించుచో పురుషులతోపాటు స్త్రీలు దేశ పరిపాలనమునందు అర్ధస్థాన మాక్రమించెదరని తలంపవచ్చును." —ఆంధ్రపత్రిక.

కీ. శే. సదాశివయ్యరుసతి:—

"సదాశివయ్యరుసతిమరణము దేశమునకును, అందుముఖ్యముగా స్త్రీలకును గొప్పనష్టము. నేటిస్త్రీజనాభివృద్ధికరములగు సకలమైన ఉద్యమములును ఆమెసాయమును, దీవెనను పొందుచుండునవి. సంస్కృతమునందును, తమిళమునందును అంచితపాండిత్యమును; వివిధవిషయపరిజ్ఞానమును; మానవస్వభావపరిశీలనమును గలిగిన ఈయమ స్త్రీలకుసంబంధించిన సమస్యలనుగూర్చియొసగుఅభిప్రాయములు పెద్దలచేతను పిన్నలచేతను గౌరవింపబడునవి. ఈరాష్ట్రమున ఆమె స్త్రీజనోద్యమనాయకురాలుగనుండినది. ఆమె తననాయకత్వమును దూషితమొనర్పలేదు. పతినిగోలుపోవుసరికి ఆమెకు అరువదివత్సరములు. అవయస్సున ఆకష్టము ఆమెకు మఱువరాని ఆఘాతమయ్యెను. అయినను ఆమె ధైర్యముతోడను శాంతచిత్తముతోడను ఓర్చెను. కాని ఆమెఆరోగ్యము, బలము క్రమముగాతగ్గిపోయినవి. బహిరంగసభలు మొదలగువానియందు పాలుగొనుట మానివైచినది. తుదకామె కోయంబత్తూరులో తనకొడుకుయింట అసువులనుబాసినది. ఆమె ఉత్తమజీవితము, ప్రజాహితవర్తనము స్త్రీజనములకు కర్తవ్యముపదేశించు దివ్యజ్యోతియగునుగాక! ఆమెఆత్మకు నిత్యశాంతి యగునుగాక!"

—*Stri-Dharma.*

చిన్ననాటికథ:—

"మాఅమ్మను అందరూ జానకమ్మఅంటూండేవారు. నాకామాట అర్థమయేదికాదు. మాఅమ్మపేరు తెలియక అల్లా పిలుస్తుంటారుఅనుకునేవాణ్ణి. ఎవరయినా మీఅమ్మపేరేమిటనిఅడిగితే మాఅమ్మపేరు అమ్మే అనేవాణ్ణి. అమ్మఅనేమాట ఎవరినోటంటవచ్చినా ఆమాట నాచెవులకు అమృతప్రాయంగావుండేది. చక్కని వాళ్లని ఎవరినిగురించయినా చెప్పుకుంటే మాఅమ్మకు మల్లేవుంటారుగామాన్ను అనుకునేవాణ్ణి. మంచిశారీరం అంటే మాఅమ్మకంఠానికి మల్లేవుంటుందికామాన్ను అనుకునేవాణ్ణి. అమృతమని ఎవరయినాచెప్పుకుంటే మాఅమ్మపాలలేయుంటుందికామాన్ను అనుకునేవాణ్ణి. నన్ను మాఅమ్మపెంచింది. దాసీలకప్పగించలేదు. నాకు మాఅమ్మేపాలిచ్చింది. డబ్బాపాలోయ్యలేదు. మాఅమ్మమాటే నాకుప్రాణం: ఇప్పుడు భగవంతుడంటే నాకు మాఅమ్మనిచ్చినవాడుకదా అనుకుంటాను. భగవంతుడు నాకెన్నోయిచ్చాడు. కాని, ఆయనిచ్చిన వాటిల్లో అమ్మనుపోలిందేమీలేదు. స్వర్గమంటారు-మోక్షమంటారు-అమృతమంటారు-ఇంకేమేమోఅంటారు నామట్టుకు అమ్మతోసాటిరావు. అమ్మంటేంది అమ్మే." —నివేదన.




### ఎనిమిది కాళ్ల పందిపిల్ల:—

పైడిమక్కల అను గ్రామములో 29-12-31 తేదీని ఒకపందికి విచిత్రమగు పిల్ల పుట్టినది. తలఒక్కటియే. చెవులుమాత్రము నాలుగు. కన్నులురెండే, ముట్టెయుఒకటియే. కాని మెడనుంచి దిగువ రెండుశరీరములు, రెండుతోకలు. కాళ్ళుమాత్రము ఎనిమిది. పుట్టిన అయిదునిమసములకే ఈవిడ్డూరపుపందిపిల్ల చనిపోయినది.

### అన్నియు అంకెలు:—

అమెరికాసంయుక్తరాష్ట్రప్రభుత్వమువారి నిలువలోనున్న బంగారమువిలువ 1,000,000,000 పౌనులు ...ఫ్రెంచిప్రభుత్వమువారి నిలువలోనున్న బంగారమువిలువ 450,000,000పౌనులు...1930 డిసెంబరు 26-వ తేదీ మొదలు 1931 అక్టోబరు 11-వ తేదీవఱకు 9½ మాసములలో బర్మాయందు జరిగినహత్యలు 1345... ఇంగ్లండులో ఓటరులసంఖ్య 30,000,000...మనవైస్రాయిగారి నెలజీతము 20,900...హిందూదేశపు పల్లెటూళ్ళు 7,00,000.

### 103-వ ఏట సినీమారంగమున ప్రవేశించుట:—

బ్లూమ్సుబరీలో 1828-వ సంవత్సరమునపుట్టి నేడు డెబ్బదిపత్సరములు మాత్రముగలవానిగా కనిపించు ఆల్ ఫ్రెడ్ ఆర్నాల్డు అనువాడు ఇప్పుడు-తన 103-వఏట-సినీమారంగమున పాత్రధారణ మొనరించు వృత్తియందు ప్రవేశించినాడు. తన దృఢారోగ్యమునకు, దీర్ఘాయువునకు తాను హిందూదేశమునందుండగా నేర్చిన యోగవిద్యయే కారణమని చెప్పియున్నాడు.

### 15 వేల లేవాస్ ధనము తినినగాడిద:—

బల్గేరియాలో నొకవ్యవసాయదారుడు తనగాడిదపై ప్లెవ్నామార్కెట్టునకుపోయి తనరెండుయెద్దులను విక్రయించి 16 వేల లేవాస్ధనమునుపొందెను. అందు 15 వేలునోట్లు, మిగిలిన వేయి నాణెములు. మార్గమధ్యమున ఒకచోటవిశ్రయించి అతడు నోట్లులెక్కించి ప్రక్కనుపెట్టుకొని నాణెములను లెక్కించుచుండగా అతనిగాడిద ఆనోట్లను తినివైచెను. అయిన చప్పుడుకు తిరిగిచూడగా గాడిద వ్యానిని నమలుట పూర్తియగుచుండెను. ప్లెవ్నాతిరిగిపోయి పశువైద్యపరీక్షచేయించుసరికి ఆనోట్లు గాడిదకడుపులో ముద్దయై స్వరూపమును గోలుపోయెను.

రెండుతలలవింతమగశిశువు:—

ఈయుస్ట్యారుఆసుపత్రిలో 24-12-31 తేదీని ఒకవైశ్యస్త్రీ ప్రసవించినది. మగశిశువు. ఆకారము చాల విచిత్రముగనుండెను. తలలురెండు. చేతులునాలుగు. కాళ్లుమాత్రమురెండే. ఈవిచిత్రమైనబిడ్డ పుట్టిన తోడనే చనిపోయెను. ఆసుపత్రిదొరసాని దానిని వెంటనే ఛాయాపటముఎత్తెను.

పీశెతూకముగలసీమవంకాయ:—

హేవార్డులో నొకడు మూడుపౌనుల రెండుఔన్సుల తూకముగల టొమాటోను కాపించినాడని తెలియవచ్చుచున్నది.

విడాకుకోరుటకిదియొకకారణము:—

చికాగోలో ఒకానొకభార్యాభర్తలు వివాహకాలమున కంట్రాక్టుచేసికొనిరి: మగడు ఇంటిపనిచేయుటకు, భార్య డబ్బుసంపాదించుటకు. ఇప్పుడు తనరేడియోపై దుమ్ముదులుపలేదనియు, కంచముకడుగలేదనియు భార్య మగనినుండి విడాకునుకోరుచు కేసుతెచ్చెను.

సంస్కృతమునందు తీర్ణులైనవారిలో స్త్రీఅగ్రసరురాలు:—

కలకత్తా విశ్వవిద్యాలయమువారి ఎం.ఏ. సంస్కృతపరీక్షలో కమలారాణిసింహాకన్యయు, ప్రహ్లాద గుప్తకన్యఅను నామెయు ప్రథమతరగతిలో ప్రథమలుగా నెగ్గిరి.

దిగంబరులై వ్యాయామము:—

న్యూయార్కుపట్టణమునగల వ్యాయామాశ్రమమున ఏడుగురు స్త్రీలును, పదునేడుగురు పురుషులును దిగంబరులై వ్యాయామముచేయుచుండగా పోలీసువారుకనుగొని ఎరస్టుచేసిరి. వీరి ఉనికి ఈవ్యాయామము చేయువారిలో నొకపురుషునిభార్య పోలీసువారికి తెలిపెను. ఆమె తనభర్తతో ఈవ్యాయామసంఘమునకు పోవద్దని పలుసార్లు చెప్పెను. అయినను అతడు వినలేదు. అందుమీద ఆమెకు కోపమువచ్చి ఈవ్యాయామాశ్రమముయొక్క ఆచోకీ పోలీసువారికి తెలిపెను.

పిల్లియొక్క విశ్వాసము:—

న్యూపోర్టులో జాన్ హెన్రీడేవిస్ ఒకగనిపనివాడు. గనిలోపనిచేయుచుండగా అతనిపై అండవిఱుచుకొని పడుటచే నాతడు చనిపోయెను. అతడు పెంచుచున్నపిల్లికి ఇదిభరింపరానిదయ్యెను. తానుకూడ అతని శవపేటికయెక్కి కూర్చుండెను. శ్మశానమున శవమును దింపినపుడు అది తనయజమానిపైబఱపిన తుదిచూపులు చూడవచ్చినవారి మనస్సులనుగూడ కరగించెను. దానిని బలవంతమున బయటికి గొనిపోవలసివచ్చెను. పిల్లికి ఉన్నస్థలమునందును, కుక్కకు తనయజమానియందును ప్రేమహెచ్చుగానుండునని జంతుశాస్త్రజ్ఞులు చెప్పుదురు. ఇచ్చట పిల్లి యజమానియందు ప్రేమచూపుచున్నది.

ద్రాక్షారముభీమన్ననెత్తిమీదసీల:—

ద్రాక్షారముభీమన్న అడ్డులేక ఎదుగుచుండగా దానిని ఆపుటకు అతనినెత్తిపై దేవతలు సీలకొట్టిరని పెద్దలందురు. కాని అది సాధారణముగా ఎవరునునమ్మరు. యథా[illegible]ఇన ఈవిషయమునువినినయెన నమ్మెదరేమో! అడాల్ఫురూమివయస్సు 14 సంవత్సరములు.తూ[illegible]పొడుగు ఆరుఅడుగులు. రోజు రోజుకు ఎదుగుచుండెను. అసాధారణమైన ఈఎదుగు[illegible]గ్రంథు (Pituitary Gland)కు మందువేయించుకొనవలసి[illegible]లు[illegible]

మునకు ఒప్పుకోలేదు. అడాల్ఫురూమి ఇట్లు చెప్పెను "పిట్యూటరీగ్లాండువైద్యము నాకుఇష్టములేదు. ఆవైద్యము మేధనుపాడుచేయును. ముందుపుచ్చుకొనక మేధగల తాడి జానయ్యనే అయ్యెదనుగాని మందుపుచ్చుకొని మేధలేని తాజామనిషిని కాజాలను."

మన విశ్వవిద్యాలయములు:—

మనదేశమున పదునెనిమిది విశ్వవిద్యాలయములుగలవు. అందు దాదాపు 110,000 మంది విద్యార్థులు గలరు. అమెరికాసంయుక్తరాష్ట్రములందుతప్ప ప్రపంచమున మఱియేదేశమునందును ఇంతమంది విద్యార్థులు లేరు. అయితే అమెరికాలో పెక్కురు వ్యాపారాదివిషయములకు పోవుచుండ ఈదేశమున అందరును గుమాస్తాగిరీలకు తపస్సుచేయుదురు. ఇది ఖేదము.

120 ఏండ్లగల మనుష్యుడు:—

అలెప్పెనుండి ఒకవిలేఖరి మదరాసు మెయిలుపత్రిక కీవార్తను వ్రాసిపంపెను. "పల్లముఅను గ్రామమునకు చేరువనున్న పూవనాతురుత్తూర అను గ్రామమున అస్పృశ్యులకులము (పులయా)నకుచేరిన వాడొకడు కలడు. అతనివయసు 120 యేండ్లున్నవని తెలియుచున్నది. 15 యేండ్లక్రితము యితనికి మూడవసారి వాటియంతటనే మరల క్రొత్తపళ్ళు మొలచినవి. ఇపుడు చాలదారుఢ్యముగాను ఆరోగ్యముగానుఉన్నాడు. ఇతడు ఒక ఓనంపండుగనాడు పుట్టెను. అంతకంటె అతనికేమియును తెలియదు. పుట్టిన సంవత్సరము, తేదీ మున్నగునవి యితనికి తెలియవు. పతిరత్తోపులో పోర్చుగీసువారుండినపుడు యితడు అచట కొబ్బరికాయలను యేరుకొని పోవుచుండెను. ఇతనికి కొద్దిగా చెవుడుకలదు. అపుడపుడు కీళ్ళనొప్పులు వచ్చుచుండును. ఇతనికి మరే వ్యాధియునులేదు. ఇతడు తరుచుగా కిరసనాయిలుతో స్నానము చేయుచుండును. ఇతనికి సరిగా తిండిపెట్టినచో ఇప్పటికిని బాగుగా పనిచేయగలడు. మంచి పడుచుతనములోనున్న బలిష్ఠుడగు కూలిమనుష్యుడు చేయగలపనిలో సగముపని నితడు చేయగలడు. ఇతనికి దయ్యములు దుష్టగ్రహములునున్నవని వానియందు గట్టిగాఢవిశ్వాసముకలదు. ఈదుష్టగ్రహములే తనకు కీళ్ళనొప్పులను కలిగించుచున్నవని యితడు నమ్మకముగా చెప్పును. ఇతనికి 120 యేళ్ళకు తక్కువయుండదని సాముద్రికశాస్త్రవేత్తయగు ప్రొఫెసరు జి. పాలుగారు తెలిపిరి. ఇదినిజమని చెప్పుటకు ఇతరనిదర్శనములుగూడ నున్నవి. ఇట్టి వృద్ధులను దొరతనమువారు కాపాడుటవసరమేయగును."

—ఆంధ్రపత్రిక.

అప్పుడు మగవాడు: ఇప్పుడు ఆడుది:—

టర్కీదేశమున ఉత్తరములు పంచిపెట్టు ఉద్యోగమునందు కుదిరియున్న మొదటిస్త్రీ తాను మగవాడినని చెప్పుకొనుటచే ఉద్యోగమును సంపాదించినది. ఇప్పుడు తాను ఆడుదానినని చెప్పుకొనుటచే ఆఉద్యోగమును నిలుపుకొన్నది. ఇంజిగాల్ గ్రామమున ఇరువదిరెండేండ్లవయస్సుగల యనటోలియాఅను పోస్టుమానును సైనికసేవకై రమ్మనిరి. కాని అతడు తాను స్త్రీననియు, కుటుంబఛిద్రములచే తనపుట్టుకనుండియు తాను మగవానిగా వేషముధరించియుంటిననియు చెప్పెను. దానిపైని అధికారులు ఆమెను సైనికసేవచేయ నక్కరలేనట్లును ఆమెతనఇప్పటి ఉద్యోగమును ఎప్పటిరీతిని జరుపుకొనునట్లును చెప్పిరి.

మదాసురాజధానిలో సూ[illegible]లు ఫైనలువిద్యార్థులు:—

మద్రాసురాజధాని[illegible] మెట్రిక్యులేషనుపరీక్షకు 7,362 దరఖాస్తుచేసిరి. దరిమిలాను సూ[illegible] లో 13,541 నుండియు; 1931 లో 22,343 రును

# గ్రంథపరిచయము

**నీతికథారత్నావళి:—**

క్రౌనుసైజున 90 పుటలు. పూర్వకవియగు మంచనరచియించిన కేయూరబాహుచరిత్ర యను పద్యకావ్యమునుండి నీతికథలు పదునాల్గు గ్రహింపబడి యాకథ లేనీతులు ప్రస్ఫుటముచేయునో అయా నీతివాక్యములనే శీర్షికలుగానుంచి దాసరి లక్ష్మణస్వామిగారిచే బాలబాలికలకు సుబోధముగనుండునట్లుల వచనరూపమున రచింపబడినకథలు ఇందుగలవు. చిత్రకళాభిజ్ఞులును, ఉత్సాహవంతులునగు వాడ్రేవు చలమయ్యగారీకథలలో కొన్నిటిని సముచితముగ సచిత్రముగావించిరి. ఈగ్రంథము చెన్నపురి పాఠ్యపుస్తకనిర్ణాయకసమితివారి ఆమోదముద్రనందియున్నది. ఈపుస్తకము ఎలిమెంటరీపాఠశాలలలో 4, 5 తరగతులలోను; యితరపాఠశాలలలో 1-వ ఫారమువఱకును నాన్‌డిటెయిల్డు పాఠపుస్తకముగ నుపయోగింప యోగ్యముగనున్నది. ఆంగ్లమునగల యీసపుకథలందు; సంస్కృతమునగల హితోపదేశకథలందువలెనే యిందును అల్పజంతువులే జ్ఞానులవోలె సంభాషించుచు మానవులకుమార్గదర్శకములగు నీతులనుగరపునవిగ చిత్రింపబడినవి. వెల 0-8-0. వలయువారు దాసరి లక్ష్మణస్వామిగారు పిఠాపురం అని వ్రాయవలెను. —అకుండి వేంకటశాస్త్రి.

**ప్రేమసుందరి:—**

ఇది బళ్ళారి శ్రీకృష్ణదేరాయగ్రంథమాలలో తృతీయపుష్పము. ఇది యాంగ్లేయకవియగు టెన్నిసన్ రచించిన శృంగార, కరుణరసాయుష్టమైన Lancelot and Elaine అను కథలో Lovely Maid of Astolot అనునామాంతరముగల 'Elain'అనుకన్నియను కథానాయికగాజేసి బళ్ళారిలో నొకమిషన్ హైస్కూలులో తెలుగుపండితులుగనున్న హె. దేవదానముగారు రచించిననవల. హిందూసాంప్రదాయవర్ణనలు, హిందూనామములు ప్రయోగింపబడి. ఇందుకథ పూర్తికాలేదు. ప్రథమభాగము. క్రౌనుసైజున 117పుటలు: వెల 0-8-0. వలయువారు కల్లూరిహోబలరావు, మేనేజరు: భారతీభవనము, కౌలుబజారు, బళ్ళారిఅని వ్రాయవలయును. —అకుండి వేంకటశాస్త్రి.

**ననత్సుజాతీయము:—**

ఇది కడపటౌన్ సబ్‌జడ్జీగానుండిన తాడూరి లక్ష్మీనరసింహరాయపండితవిరచితపద్యకావ్యము. సులలితమగు కవితాశైలితో ప్పారుచున్నది. ఇంగ్లీషుభాషలోను, తెలుగులోను విస్తృతమగు పీఠికలు గ్రంథకర్తచే వ్రాయబడియున్నవి. వెల 0-4-0. డెమ్మిసైజు: 37 పుటలు. వలయువారు తాడూరి లక్ష్మీనరసింహరావుగారు, ఇన్నీసు, రాజమండ్రి అనివ్రాయవలయును.

**సూర్యకిరణచికిత్స:—**

ఇది పండితజ్వాలప్రసాదు అను దివ్యజ్ఞానసమాజసభ్యులు ఆంగ్లమునరచించిన గ్రంథమునకు పుచ్చా వెంకట్రామయ్యగారిచే రచింబడిన ఆంధ్రానువాదము. ఇది దంతలూరు ప్రకృతినికేతనగ్రంథమాలలో ప్రథమకుసుమము. ఇందు సూర్యకిరణప్రభావమున ఎట్టిట్టిచికిత్సలుగావింపనగునో వివరింపబడును. వెల 0-12-0. వలయువారు ప్రకృతినికేత, దంతలూరుఅగ్రహారం, కొల్లిపరపోస్టు, గుంటూరుజిల్లా అనివ్రాయవలయును.

**గోపికామానసోత్సవము:—**

కీర్తనలపుస్తకము. కర్త్రి శ్రీమతి ఆర్. [illegible] సురము కళాశాలాంధ్రపండితులును, ఉభయభాషాకోవిదులును [illegible] నముమగూర్చి [illegible]

పీఠికలో నిట్లు వ్రాయుచున్నారు. "శ్రీయుతులు ఎస్. నరసింహఅయ్యంగారి సోదరీమణి శ్రీమతి రుక్మిణమ్మ గారు రచించిన 'గోపికామానసోల్లాసము'ను వీనులవిందుగ వింటిని. సంస్కృతమున జయదేవవిరచితమయిన "గీతగోవిందము"వలెనే ఈగేయకృతి శ్రీకృష్ణుని లీలావిలాసములను తద్దయు ముద్దుగ వర్ణించుచున్నది. పసిండికి పరిమళమబ్బినట్లు శృంగారగానరసభరితములయిన యీకీర్తనలందు భక్తిరసమును తరంగితమగుచున్నది. సుకుమారరాగరసభరితమగు నీకృతి భక్తజనులయుల్లముల పల్లవింపజేయుననుట యథార్థకథనము." గ్రంథము క్రౌను సైజున 48 పుటలు. గ్లేజుకాగితములు. వెల 0-4-0 అణాలు. చిరునామా: శ్రీసాధన ప్రెస్, అనంతపురము.

### శ్రీకన్యకాపరమేశ్వరీశతకము:—

గ్రంథకర్త శ్రీమదాంధ్రవిద్యావాచస్పతి, సాహిత్యసరస్వతి, విద్వద్వినోద, కవిభూషణ, విద్యాసాగర, శతావధాని దోమా వేంకటస్వామిగుప్తగారు. వీరు ఆంధ్రపరిశోధ … విశ్వవిద్యాలయసభ్యులును, మదరాసు క్రిస్టియనుకాలేజీపండితులును అయియున్నారు. నామముచేతనే పుస్తకమునందలి విషయము గ్రహింపనగును. ఈపుస్తకముప్రతులు ఆర్యవైశ్యులకు ఉచితముగా పంపబడును. వలసినవారు గ్రంథకర్తకు వ్రాయునది. డెమ్మీసైజున 20 పుటలు. గ్లేజుకాగితములు.

### ఆంధ్రచంద్రాలోకము:—

కాళిదాసకృతమని కొందరిచేతను, జయదేవకృతమని కొందఱిచేతను చెప్పబడుచున్న సంస్కృతము నందలి చంద్రాలోకమునకు ఇది ఆంధ్రానువాదము. అనువాదకులు సుప్రసిద్ధపండితులు, గవర్నమెంటు ఉద్యోగులు అయిన తాడూరి లక్ష్మీనరసింహారావుపంతులుగారు. ప్రాచీనుడగు అడిదము సూరకవి అనువాదము కంటె ఇది బాగుగనున్నదనియు, కొన్నిరెడల మూలగ్రంథమునకు వ్యాఖ్యానవత్తుగనున్నదనియు కొక్కొండ వేంకటరత్నముపంతులుగారు అభిప్రాయమిచ్చియున్నారు. రాయల్ 1/8 సైజు ఫేదరువెయిటు కాగితములు. 48 పుటలు. వెల రు. 0-4-0 అణాలు. గ్రంథకర్తపేర ఇన్నీసుపేట, రాజమ॥ అని వ్రాసి బడయగలరు.

### అహల్యాసహస్రాక్షము:—

శ్రీకృష్ణార్జునీయము, అవిజ్ఞేయతనయచరిత్రము మున్నగు గ్రంథములను రచించిన కల్లూరి యజమాన వేంకటనారాయణరావుగారు బి.యే. దీనికికర్తలు. ఏడంకములనాటకము. రసలక్షణముల ననుసరించుటకును, కావ్యవృత్తి నుద్ధరించుటకును, పాత్రపోషణమునకును ననుకూలము గల్పించుటకై పురాణప్రసిద్ధమగు ఈకథలో కొన్నిమార్పులు చేయబడినవి. గ్లేజుకాగితములు. డెమ్మీసైజున 74 పు. వెల 0-12-0 అణాలు. చిరునామా: సరస్వతీపవర్ ప్రెస్సు, రాజమండ్రి.

### శ్రీనమ్మాళ్వారికులప్రశంస:—

శ్రీవేణుగోపాలభక్తలీలామృతలహరీగ్రంథమాల సప్తమపుష్పము. ఆంధ్రకాశిక, సమదర్శినిపత్రికలనుండి పునర్ముద్రితము. గ్రంథకర్త బాలబ్రహ్మచారి, సహజకవియునగు బెనుబ్బారెడ్డిగారు. ఇందు శ్రీనమ్మాళ్వారు రెడ్డివంశజులనియు, …ర్మదేశము హిందూదేశములోనిదే కామ్లేచ్ఛభూమి కాదనియు మున్నగు విషయములు నిరూపింప… …బంధవిషయములను చదువగా పశ్చిమగోదావరిమండలమునందలి రెడ్లు ప్రజాహితజీవనులై … …ను. ఆప్రముఖులలో కొం… శ్రీలుకూడనుండుట సంతో… …పుటలు. వెల [illegible]4-0. వలయువారు గ్రంథ

అర్థము స్ఫురించున ట్లుండవలెను. ముందు చెప్పిన విషయ మునకు, తరువాత చెప్పు విషయమునకు అనుక్రమము, పొందిక ఉండవలెను. చదువరులను అనావశ్యకము లగు ప్రశ్నములను, సందేహమును గలిగించు విషయములను చొప్పించకుండవలెను. కొండమీటిచే త్రాడువంటి వాక్యములు, పిడుగురాళ్ల వంటి పదములు నుండకూడదు. శకటరేఫములు, అర్థానుస్వారములు పాటింప బనిలేదు. ఒక చోట పాటించినను నిర్దుష్టముగా పాటింపవలెను. కాని ...లవతరగతివరకు సర్వధా వాటిని పాటింపకుండుటయే శ్రేయము. కుసంధులు, సుసంధులయినను క్లిష్టములు, ...ండజనదు. విసంధికముగ నుండుటొప్పును. ఒక్కొక్క ...పదమునకు గలపర్యాయ పదముల నన్నిటిని ఒకపాఠము ...నే కురిపించుట పనికిమాలిన పని. అంతకంటె పూర్వపు ...ఉపరించి ఏ నిఘంటువులనో బట్టీ పట్టించుట ...గును. ఇంతేకాదు. చదివిన విషయములను ...స్వయముగ ముద్దులు మూటగట్టు వాక్యము ...ప్ప నుపకరించు ఒడుదొడుకులులేని వింజాల ...కావలెను.

...గ్రంథవచనము, ప్రకటనము చిల్లర దుకాణముల ...మువంటి దయిపోయిన్న యీకాలమున మంచి పుస్తక ...ప్పన్నము లగుట అరుదు. పూర్వపు ఒక అక్షరము ...కు సువర్ణములు విలువ; నేడు లక్ష అక్షరముల ...ఒక సువర్ణము విలువ కనుపడదు. ఇక, పనికి ...న, తప్పులుకుప్పలయిన గ్రంథములు కుప్పలుతిప్ప ...నేడు పుట్టుచున్నవి. గ్రంథకర్తలు ప్రకాశకులు ...లంచమునకుబడిని వినియోగించి స్వార్థపరులై యీ పుస్త ...పతి మన చిట్టితండ్రులపైనను, చిట్టి ...ల పైనను చునది వారి తెలివితేటలను భంగ జేత ...న్నారు. ...పునకు గ్రంథకర్తల అధికారబలము ఖం... ...గాతి ...యున్నది. దీని నరికట్టుటకు గట్టి ...ములు ...ం. లేకున్న వాఙ్మయమునకు, పిల్లల... ముప్పు ...ల్లగలదు.

...చకమునుగూర్చి :

...౧, ౨, ౩, ౫; ౬ పాఠముల గలవిషయ ...కల తలల తక్కువాలవు. 'భార్యా భర్తలు' అనుపాఠము చాల గడబిడగా నున్నది. అట్లు కాక, సీత-రాముడు, నలుడు-దమయంతి, సావిత్రి-సత్య వంతుడు...అని ఉండిన ఎంతయు బాగుండును. కాని ఏండ్ల బాలికలకు అలుమగలవిషయ మెందుకు? ఇందు పర్యాయపదములు చూడుడు:—భార్య, సతి, రాణి, దేవి, గృహిణి,—భర్త, పతి, నాథుడు, వరుడు,—ఒకే ప్రోగు! ఉచ్చరింపనైన శక్యముకాని పదజాలము!!

౪వ పాఠము 'సామెతలు'. సామెతలు చాల వరకు పెద్దలకే అర్థముకావు. ఇందుకు ఈపాఠముచివర 'పిల్లికి చెలగాటము (చెలగాటము తప్పు. చెరలాటము ఒప్పు.) ఎలుకకు ప్రాణసంకటము' అను నొక్క సామెత రెండుగా నుండుటయే నిదర్శనము.

'పేరాశకు పోరాదు', 'ఐదు ఇంద్రియములు,' 'చెట్టు', 'బాలుడు', వంకరచెట్టు' అనుపాఠముల రచనావిధానము చిన్నవయసువారికి సుబోధముగా లేదు; బోధపడిన పిదప గదా దానివలని ప్రయోజనమును చూచుకొనవలసినది!

'నోరులేని జంతువులయెడల దయ కలిగియుండవలెను.' పుట ౩

'ఐకమత్యమే అందఱి బలము.' పుట ౪

'ప్రజ్ఞమాట చెప్పవలదు.' పుట ౫

'ఇది (మల్లెపూవు) దేనిని పూచును.

మల్లెపూవులు మల్లెతీగలను పూచును' పుట ౬

'బయట తిరిగివచ్చిన బట్టలతో అన్నము తినరాదు.' పుట ౨౫

ఇట్టివాక్యములందు ఉద్దిష్టార్థమునకు సన్నిస్ఫూర్తి కొరతవడినది.

'తరువాత తలదువ్వుకొని నీళ్లుపోసికొని, కాటుక, బొట్టు పెట్టుకొనవలెను. కాటుక పెట్టుకొనుట మాత్రము మానవలదు' పుట ౨౫. తక్కినవన్ని మానిన మానవచ్చునని అర్థము రాదా!

'దానికి (చెట్టు మొదలునకు) 'మ్రాను'అని పేరు.' పుట ౩౬. 'మ్రాను' పదము చెట్టునకే పర్యాయపదము. మ్రాని మొదలు 'మోడు' అని చెప్పవలెనుకదా!

'అర్ధరూపాయ' పుట ౬. ఇదితప్పు. 'అర్ధరూపాయ' ఒప్పు. ధ-ధలకు అనంతము భేదమున్నది.

'ముగ్గులు' పుట ౧౩. 'ఇద్దలు'లో శకటరేఫ మని దీనికికూడ తగిలించినట్టులున్నది. 'వలుగురు' ఇత్యాదులకుకూడ ఇది ప్రాకునేమో!

అర్ధానుస్వారముల గొడవ చెప్పబనిలేదు. ఒక్క పదమునకే ఒకచో నుండును; ఇంకొకచో నుండదు. 'అందుకొను, అంట, రంగడు, చూడుడు, చెప్పుడు, ఇత్యాదిపదములు.

సంధులు: 'ఈ చెట్టుయొక్కటి' మొదలయినవి, పరుష సరళాదేశాలు, నుగాగమాలు ఇష్టమువచ్చినట్లే. వీనిబాధ తరువాతి తరగతుల వాచకములలో నధికము. కఠినపదములకు అర్థములు:

'విపరీత వేళ = అదృష్టము తొలగిన రోజులలో అదివరకు సుఖపడినవాడే కష్టపడును.' పు. ౪౫ ఇది అర్థమట.

'కరుణ=దయతో, వెలయ=బాగా' పు ౪౫.

'కరుణ వెలయ=దయనిండారగా' అనదగును.

'పేరిమి=ప్రేమ, గౌరవము.' పు. ౪౬. 'ప్రేమ' అనుఅర్థము కానరాదు. పద్యసమన్వయమునను ఈయర్థము పొసగదు.

'కడఁగుచు' = యత్నించుచు, హెచ్చును రెండవ అర్థము వ్యంగ్యము.

'భంగపడును=మోసపోవును' పు. ౪౭. 'అవమానపడును' అనుట ఒప్పు.

ఇది యికచాలును.

గ్రంథాదిని 'ఉపాధ్యాయులకు కొన్ని సూచనలు' అను శీర్షిక క్రింద "ఏపాఠమైనను ఉపాధ్యాయుఁడు తాను బోధించుటకు ముందే యాపాఠమును సిద్ధముచేసికొనినచో గాని దానిని బోధించుటయందు జయమును గాంచజాలఁడు. ఈవిషయము వాచకపాఠముల కెక్కువ యావశ్యకమని నేను వేఱుగఁ జెప్ప నక్కఱలేదు." అని కలదు. ఎవరో వ్రాసిన పిచ్చిమొచ్చి వాక్యములను ఏకరువు పెట్టవలసిన ఉపాధ్యాయుడు పాఠమును ... డు సిద్ధముచేసికొనవలెనట. పెక్కురు బాలబాలికల ...ం ఉద్దిష్టములయిన గ్రంథములను రచియించు గ్రంథకర్తలు వానిని రచియించుటకు పూర్వము తామెంతసంసిద్ధులుగా నుండవలెనో! ఈగ్రంథరచన విషయమున నీగ్రంథకర్త యెంత సంసిద్ధుడయ్యెనో? అరయఁదగును.

అన్నిటికంటె విశేషము: ఇందు 'క్రీస్తుజననము' అను పాఠమున్నది. ఇదిబాలికల కెందుకు? రాజభక్తి నిదర్శనమా? అటయిన: గ్రంథాదినే చక్రవర్తి దంపతుల చిత్రములకు మ్రొక్కితిరి కదా! ఇక నిదియేల? ... గురించి' వ్రాయ కంకణముకట్టిన గ్రంథక... స్తవు'కూడ శ్రీ అనియే వ్రాసిరి? వ్యా... మనుకొనిరా? లేకున్న భారతీయులకు దు... వలె నిగ్రాకియున్న దాస్యభావము పండినవ...

—కి...

## నవకుసుమాంజలి

గ్రంథకర్త: జనమంచి వేంకటరామయ్య గారు రాజమహేంద్రవరము

ఇది ఖండ పద్యకావ్యముల సంపుటము. డెమ్మి సైజులో 176 పుటలు గలిగియున్నది. దీనివెల రు1-4

ఇందు గ్రంథకర్తగారు 1891 సం. మొదలు 1927 సం ము వరకు నప్పుడప్పుడు వ్రాసి సాహితి..., ...రతి మున్నగు పత్రికలలో ప్రకటించ... వచ్చిన ...డకావ్యము లనేకములు సమకూర్పబడి...వి. మొ...త్తము 28 శీర్షికలు గలవు. వీనిలో ... నవకుసుమాంజలి, అమృతకలశి, అమృతభా... నవి. తక్కిన వన్నియు సందర్భాను... డు చెప్పిన పద్యములు.

నవకుసుమాంజలి యు... ఇందలి పద్యము లన్నియు